శ్రీ వేంకటేశ్వర స్వామి వారి చుట్టూ వున్న ఆళ్వారుల పద్యాల అర్థ రూపము. ..... 1.

అమరవాది కృష్ణ మనోహర్ - +91 90 32 153669

మరింగంటి విజయ్ భార్గవ్ - +91 99 66 650824

(1) ఆళ్వారులు రచించిన కొన్ని అందమైన మాటల పద్యాల అర్థ రూపాలు.

ఆళ్వారుల పద్యాలు వేదముల సారము.

***************

1. సుప్రభాతపు మేలుకొలుపు పద్యాల అర్థ రూపము,

2. వైకుంఠములో వున్న స్వామి యొక్క రూపు రేఖల పద్యాల అర్థ రూపము,

3. కనికరించు స్వామీ అని వేడుకునే చాలా పెద్ద పద్యము యొక్క అర్థ రూపము,

4. తిరుపతి వేంకటేశ్వర స్వామి గురించి రచించిన పద్యాల అర్థ రూపము,

5. అందరూ అభిమానించే తిరుప్పావై యొక్క అర్థ రూపము,

6. శ్రీరంగనాథుడిని చూసిన పద్యాల అర్థ రూపము,

7. అందరి ఆళ్వారుల పద్యాలలోని అద్భుత పాశురముల అర్థ రూపము.

*************************************************

1. సుప్రభాతపు మేలుకొలుపు పద్యాల అర్థ రూపము.

తొండరడిప్పొడి ఆళ్వారు రచించిన తిరుప్పళ్లియెఴుచ్చి

దివ్యమైన మేలుకొలుపు

1. సూర్యుడు తూర్పు దిక్కున ఆకాశపు ఉదయగిరిన అందమైన అరవింద ప్రకాశ తేజోమయుడై వచ్చివున్నాడు. ఉదయకాలపు వెలుతురు చక్కగా రాగా, దట్టమైన చిమ్మ చీకటి అంతా నశించినది. మంచి పరిమళపు సువాసనలు వెదజల్లు రంగురంగుల పువ్వులు అన్నీ వికసించి తియ్యని తేనెతో నిండి పలకరిస్తున్నవి. నీ దర్శనమునకై దేవతలు, రాజులు అందరూ వచ్చి అన్ని వైపులా నిండి వున్నారు. వారు ఎక్కి వచ్చిన ఏనుగుల గుంపు యుక్క ఘీంకార శబ్దములు భేరీ వాయిద్య ధ్వనితో కలిసి శబ్దించు అలల సముద్ర ఘోషవలె అన్ని దిక్కుల ప్రతిధ్వనిస్తున్నాయి. శ్రీరంగనాథా, పడక నుంచి లేచి మాపై దయ చూపవయ్యా.

2. తూర్పు దిక్కు నుండి వీచు చల్లని గాలి పూలతీగలపై నిండివున్న మల్లెలు, మొల్లల పూలవాసనలను గ్రహించి మంచి పరిమళ సువాసనాభరితముగా వీచుచున్నది ఇదిగో. పూలపడకన నిద్రించు హంసజంటలు తెల్లవారుఝామున పడే లే మంచు బిందువులతో

తడిసిన తమ చక్కని అందమైన రెక్కలను విదిల్చి నిద్ర లేచినవి. మొసలి యొక్క తెల్లని కోరలకి చిక్కి,  విపరీతముగా బాధపడిన గజేంద్రుడి గొప్ప దుఃఖమును పోగొట్టిన శ్రీరంగనాథా, పడక నుంచి లేచి మాపై దయ చూపవయ్యా.

3. ఆకాశమున అన్ని దిక్కులలోను సూర్య కాంతి వ్యాపించెను. నక్షత్రముల ప్రకాశము తగ్గినది. చల్లని వెన్నెలలను వెదజల్లు చంద్రుడు కాంతి విహీనుడయ్యెను. రాత్రి వ్యాపించిన ఘనమైన చీకటి అంతా పోయినది. ఉదయకాలపు పచ్చని తోటలు పోకచెట్ల తోపుల యుక్క వికసిత పుష్పముల పరిమళపు కమ్మటి గాలి సుతిమెత్తగా చల్లగా తాకుతూ పులకరింప చేయుచున్నది. అందమైన విశాలపు బలిష్ఠమైన చేతిలో కోటిసూర్య తేజస్సుతో ప్రకాశించే చక్రము గల  శ్రీరంగనాథా, పడక నుంచి లేచి మాపై దయ చూపవయ్యా.

4. ఆవులను, ఆవుదూడలను మేపుటకు అడవికి తీసుకొని వెడుతూ, గోపాలకులు ఊదు వెదురు వేణువుల వేణుగానము, ఆ గానమునకు అనుగుణముగా ఎద్దుల మెడలోని గంటల చప్పుడు లయబద్ధముగా వినిపిస్తున్నవి. తోటల యందు తుమ్మెదలు గుంపులు గుంపులుగా చెదిరిపోవుచున్నవి. విశ్వామిత్రుడి గొప్ప యాగమును కాపాడి, సీతా స్వయంవరములో శివుని విల్లుని విరిచి సీతను పెళ్ళాడి కోదండమను ధనస్సుతో లంకాధిపతి రావణాసురుడిని, అతడి రాక్షస వంశమును నాశనము చేసి, బలమైన పెద్ద అయోధ్యా రాజ్యమును ఏలిన  శ్రీరామచంద్ర, మమ్మల్ని రక్షించువాడా, శ్రీరంగనాథా, పడక నుంచి లేచి మాపై దయ చూపవయ్యా.

5. పూలతోటల యందు పక్షులు కిలకిలారావములు చేయుచున్నవి.రాత్రివేళ పూర్తిగా పోయినది. ఉషోదయము అయినది. తూర్పుదిక్కున శబ్దించు సముద్ర ఘోష భూపాల రాగము వలె వినిపించుచున్నది. రంగురంగుల సీతాకోక చిలుకలు, తుమ్మెదలు గుంపులు గుంపులుగా ఎగురుతూ, సన్నాయి వాయిద్యము వలె రాగయుక్తముగా పాడుతూ తిరుగుతున్నాయి. అద్భుత రంగులు కలిగి వికసించిన పరిమళపు పువ్వులతో అల్లిన అందమైన పూలమాలలను తీసుకొని వచ్చి, నీ దివ్య పాదములకు సమర్పించుటకై దేవతలు వచ్చిరి. కనుక సర్వేశ్వరా, విభీషణుడు సేవ చేసిన శ్రీరంగములో కొలువై వున్న శ్రీరంగనాథా, పడక నుంచి లేచి మాపై దయ చూపవయ్యా.

6. ద్వాదశాదిత్యులు తమ మెరిసే కాంతులు వెదజల్లు విలువైన నవరత్న ఖచిత మణిమయ రథములలో వచ్చియున్నారు ఇరిగో. సర్వ నిర్వాహకులు అయిన ఏకాదశ రుద్రులు కూడా వచ్చియున్నారు ఇరిగో. గుర్రముల మీద, రథముల మీద మరుత్తులు వసువులు వచ్చి తమ ఆటపాటలతో గుమిగూడివున్నారు ఇరిగో. నెమలి వాహనముపై షణ్ముఖుడు వచ్చి వున్నాడు ఇదిగో. ఆ కుమారస్వామితో పాటు ఆయన సేనావాహిని కూడా వచ్చి నీ గుడి ముందు నిలిచిరి ఇరిగో. శ్రీరంగనాథా, పడక నుంచి లేచి మాపై దయ చూపవయ్యా.

7. సర్వేశ్వరుడివి అయిన నీ దివ్య పాదపద్మములను సేవించుటకు అండ పిండ బ్రహ్మాండములలోని దేవతలు, వారి వారి పరివారము వచ్చిరి ఇరిగో. అధిక తపస్సంపన్నులు

అయిన సనకాది బ్రహ్మర్షులు మరుద్గణములు వచ్చిరి ఇరిగో. ఐరావతము మీద ఇంద్రుడు వచ్చెను. నీ గుడి గోపురపు వాకిట గంధర్వులు కిక్కిరిసి వున్నారు. నీ భక్తులు, మునులు, యక్షులు వచ్చి నీ గుడి వాకిట కూర్చొని వున్నారు. వచ్చిన వారందరితో ఆకాశము, భూమి చాలకున్నది. శ్రీరంగనాథా, పడక నుంచి లేచి మాపై దయ చూపవయ్యా.

8. రాత్రిపూటంతా నీకు చక్కగా నిద్ర పట్టాలని కిన్నెరులు, గంధర్వులు, మిగిలినవారందరూ కలిసి మృదంగము, మద్దెల, వీణ, వేణువు, తంతి వాయిద్యములతో పాడదగిన కీర్తనలు అన్నీ వినసొంపుగా పాడుతూ కమ్మటి రాగాలాపన చేస్తూ ఇక్కడే వుండిపోయిరి. తపస్సంపన్నులు, దేవతలు, చారుణులు, సిద్ధులు నీ దివ్య పాద సేవ చేసుకోవాలని తపన పడుతున్నారు. శ్రీరంగనాథా, అందుకే ఇప్పుడు వారందరికి నీ విశ్వరూప సేవ ప్రసాదించుటకు పడక నుంచి లేచి మాపై దయ చూపవయ్యా.

9. సూర్యుడు అధిక ప్రకాశముతో ఆకాశమున సప్త వర్ణ కిరణములతో అలరారుతున్నాడు. ఆకాశము నుండి చీకటి పూర్తిగా పోయినది. శక్తిసంపన్నులు అయిన ఋషులు, తుంబుర నారదులు వచ్చి నిలిచిరి ఇరిగో. సర్వలోక అధిపతివి అయిన నీకు, స్వర్గలోకవాసులు పరిమళించు సుగంధ ద్రవ్యములను సమర్పించుటకు వచ్చి వున్నారు. నిన్ను నిత్యము సేవించువారు నిలువుటద్దమును నీ అవసరములకు కావలసిన వస్తువులను తీసుకొని వచ్చిరి. శ్రీరంగనాథా, పడక నుంచి లేచి మాపై దయ చూపవయ్యా.

10. పరిమళించు ఎర్ర తామర పువ్వులు వికసించెను ఇదిగో.అలల తరంగముల సముద్రము నుండి ఆకాశములోకి పైపైకి  లేచి సూర్యుడు ఎగసిపడి ప్రకాశించుచుండెను ఇదిగో. ఢమరకము వంటి సన్నని నడుములు కలిగిన ఈ వూరి స్త్రీలు వారి తలలను దువ్వి, కొప్పులు చుట్టుకొని చెరువు నీటిలో స్నానము చేసి,  ఉతికి ఆరవేసిన చీరలను ధరించి , చెరువుగట్టు ఎక్కి ఇంటికి బయలుదేరిరి.  కావేరీనది నీటితో చుట్టిన శ్రీరంగనాథా, తులసిమాలలతో నిండిన గూడ బుట్టను భుజమున ధరించి వచ్చిన తొండరడిప్పొడి అను పేరు గల నీ భక్తుడను, నీ స్నేహితుడను. నాపై దయ చూపి దేవర వారి భక్తులను తృప్తి పరచుటకు శేషశయ్య నుంచి లేచి మాపై దయ చూపవయ్యా.

తొండరడిప్పొడి ఆళ్వారుడి దివ్య పాదములకు నమస్కారములు.

*****************************

2.  వైకుంఠములోని స్వామి రూపు రేఖల పద్యాల అర్ధ రూపము.

నమ్మాళ్వారు రచించిన తిరువాశిరియము.

ఇది యజుర్వేదసారము.

1. స్వచ్ఛమైన తెల్లని పాలకడలి అలల నడుమన, ఆకుపచ్చ రంగు కలిగిన ఆదిశేషుడు తన వేయి పడగలను చేతి ఆకారపు గొడుగుగా చేసి, తన శరీరమును పానుపుగా చుట్టి ఉంచగా,

ఆ పానుపుపై ఎరుపు రంగు మరకత మణి వర్ణముల మేళవింపుతో , పెద్ద మేఘము వంటి పర్వతాకారుడు, ప్రకాశవంతమైన సప్త వర్ణ సూర్యకాంతులతో, మిణుకు మిణుకుమంటూ మెరిసే నక్షత్రకాంతుల కలగలుపు నింపుకొని, చంద్రుడు చిందించు చల్లదనమును మించిన చల్లదనపు ప్రకాశము కలిగిన శరీరముతో, ఆ శరీరమునకు తగిన పీతాంబరము, కిరీటము, కంఠి మొదలగు అద్భుతమైన రత్న మణిమయ బంగారపు వజ్రాభరణములను ధరించి, ఉజ్వలమైన పగడపు అధరము చిద్విలాసపు చిరునవ్వులు చిందించుచుండగా, ఎర్రబారిన కలువకన్నులు మూసుకొని, తన నాభియందు తామరపువ్వును కలిగిన అద్వితీయ సుందరాకారపు సర్వేశ్వరుడు, ముల్లోకములు పూజించు సుందర దివ్య పాద పద్మములు కలిగిన శ్రీమన్నారాయణుడు యోగ నిద్రలో మునిగెను.  ఆయనయే మోక్షప్రధానుడు.

2. భోగభాగ్యములు, సిరిసంపదలు, అష్టైశ్వర్యములతో ఎంతగాతులతూగుతున్ననూ,వివేకవంతులైన మానవులు జ్ఞానులై ఈ మానవ జన్మలోనే సాధ్యపడి, సాధించగలిగే అమృతమయమైన పరమ పద పురుషార్థ మోక్షమును పొందదలచి, అధికమైన భక్తిభావమును పొంది, ముల్లోకములలోను అధిక

శక్తిసంపన్నుడై వుండి, అన్ని లోకములను తన సంకల్పముతో సృష్టించిన ఆ దేవాదిదేవుడి అందమైన ప్రకాశించు దివ్య పాద పద్మములపై ఆశ పడి తమ ఆత్మను కరిగించి సమర్పించెదరు.

3. కులగిరులలోని విశాలమైన మందర పర్వతమును కవ్వముగా చేసుకొని, పడగల సర్పరాజు వాసుకి శరీరమును త్రాడుగా చుట్టి, చల్లని క్షీరసాగరమునుచిలుకుసమయములో,ముల్లోకములలోని వారు త్రిమూర్తులలో ముఖ్యుడైన శ్రీమన్నారాయణుడిని ఆశ్రయించగా, వారి కోరికను తీర్చుటకు కూర్మరూపధారుడై తన

ప్రకాశవంతమైన వక్షస్థలముపై మందరపర్వతమును వుంచి చిలకగా, త్రాడు యొక్క రాపిడికి ఆ పర్వతము బాధతో దిక్కులు పిక్కటిల్లునట్లు పిడుగుల శబ్దముతో అరచుచున్నదా అన్నట్లు వుండగా, క్షీరసాగరపు అలలు కకావికలమై ఆకాశమును అంటుచుండగా, అమృతమును సాధించుటకు అత్యంత అధ్భుతమైన శక్తి కలిగి వున్న ఆ భగవంతుడిని ప్రతీయుగములోను సేవించు భాగ్యము దొరికిన ఎంత అదృష్టము.

4. యుగాంతమున ప్రళయము సంభవించి, అల్లకల్లోలముగా సకల ప్రాణులను నాశనము చేసి అన్ని లోకములను నీటితో ముంచెత్తగా, ప్రళయానంతరము తిరిగి సకల ఆత్మలకు ఆశ్రయమును ఇచ్చిన అద్వితీయకారణుడు ఆ శ్రీమన్నారాయణుడు తన నాభి నుండి తొలి అంకురముగా ఆ బ్రహ్మదేవుడిని తరువాత ఆ త్రినేత్రుడిని, దేవతలను సృష్టించి, తన సంకల్పముతో ముల్లోకములను సృష్టించిన ఆ భగవంతుడి దివ్య పాద పద్మములకు ప్రతీ యుగములోను మంగళములు తెలుపుతూ ఆయనను సేవించిన ఎంత భాగ్యము.

5. బ్రహ్మదేవుడు మొదలగు దేవతలందరూ కీర్తిస్తుండగా, లోకములన్నీ ఆశ్చర్యముగా చూస్తుండగా, వేయి సూర్యులు ఒక్కసారే ఉదయించిన తేజస్సుతో ప్రకాశిస్తూ, అనేక పెద్ద పెద్ద చెట్లు, పొడవైన వృక్షములు కలిగి వున్న అడవుల వలె వేయి కిరీట భుజములతో ఆకాశమంతా వ్యాపిస్తూ, వికసించిన పద్మముల వంటి కన్నులతో, దొండపండు వంటి అధరముతో, తేజోవంతమైన సుందర దివ్య పాదపద్మములతో ఆ వామనుడు, గొప్ప కారణ

జన్ముడు ఒక పాదముతో భూమిని, మరొక పాదముతో ఆకాశమును కొలవగా, ఆ భగవంతుడి సర్వ శక్తి సంపదలకు లోకములన్నీ దాసోహమైనవి.

6. ఈ లోకపు స్వభావము చాలా  ఆశ్చర్యముగా వున్నది. ఎదురుగా కన్నతల్లి వుండగా ఆమెకు సేవ చేయుట మరిచి ఆమె బొమ్మకు సేవ చేస్తున్నారు. ఇది ఏమి విచిత్రము.  అదే విధముగా అనేక జన్మల నుండి వచ్చు పాపకర్మల నుండి మన ఆత్మను రక్షించి, మనకు మోక్షమును ప్రసాదించు ఆ భగవంతుడు, లోకములన్నిటిని రక్షించు ఆ శ్రీమన్నారాయణుడిని సేవించుట మరిచి, సుఖ దుఃఖములకు నిలయమైన గొప్ప కోరికల వలయములో కొట్టుకొనిపోతూ, ఎవరినో సేవిస్తున్నారు. ఈ మానవ జన్మలోనే సాధ్యమయ్యే మోక్షమును వదులుకొనుచున్నారు.

7. చల్లదనమును కురిపించు చంద్రుడిని సిగలో సింగారించిన శివుడిని, నాలుగు ముఖములు కలిగిన బ్రహ్మదేవుడిని, చిగురుకాంతి మెరుపులు చిందించు దేవతలను, దేవతలకు అధిపతి అయిన ఇంద్రుడిని, ప్రకాశవంతమైన చైతన్య కిరణములతో విరాజిల్లు సూర్యుడిని, చల్లని వెన్నెలలను వెదజల్లు చంద్రుడు మొదలగు వారిని అంతే కాకుండా ఎటువంటి వ్యర్థము కానటువంటి వాటితో నిండిన మొత్తము అన్ని లోకములను, సకల ప్రాణులు నివసించు భూమిని, అగ్నిని, నీటిని, గాలిని, తేజస్సు నిండిన ఆకాశమును, మిగిలిన అన్నిటిని ప్రళయకాలమున తన పొట్టలో దాచుకొని, ఒక మర్రి ఆకుపై అమాయకపు చిన్ని బాలుడై పడుకున్న ఆ సర్వ మంగళ సౌందర్య దివ్య విగ్రహుడైన ఆ భగవంతుడిని, అంతులేని ఆశ్చర్యకరమైన పనులు చేస్తూ, చేయిస్తూ వుండే ఆ భువన మోహన సుందర సాక్షాత్కారుడైన ఆ శ్రీమన్నారాయణుడినే మనము ఎల్లవేళలా కొలిచి సేవిస్తూ, ఆయన దివ్య పాదములనే ఆశ్రయించెదము. ఆయనయే మోక్ష ప్రధానుడు. ఆయన పరమ పావనమైన

దివ్య పాదములే మన ఆత్మలకు పరమ పద నిలయమైన మోక్షము. ఇదియే యజుర్వేద సారము.

నమ్మాళ్వారుడి దివ్య పాదములకు నమస్కారములు.

*************************

3. కనికరించు స్వామీ అని వేడుకొనే పెద్ద పద్యము యొక్క అర్థ రూపము.

తిరుమంగై ఆళ్వారు రచించిన తిరువెజుకూత్తిరుక్కై.

ఇది ఒక అంకెల గారడి.

తిరుక్కుడంద అను మహా నగరములో కొలువై వున్న అభయామృత స్వామిని కీర్తిస్తూ తిరుమంగై ఆళ్వారు అద్భుతమైన అంకెల గారడీతో ఒక్కటే పద్యములాగా రచించారు.

...........................

ఒకసారి నీ నాభిలో వున్న విశాలమైన తామరపువ్వులో బ్రహ్మదేవుడిని సృష్టించి పాలసముద్రములో శయనించిన ఓ వాసుదేవా,

సూర్యచంద్రులు ఉదయించే ఆకాశమునకు అంటుతున్నాయా అని కనిపించే విధముగా నిర్మించిన 3 కోటగోడల దుర్గము కల లంకానగరమును పరిపాలించిన రావణాసురుడిని 2 కొనలు వంగిన కోదండము  అను గొప్ప విల్లుతో 2 దంతములు కలిగి నిప్పులు కురియు నోరుగల రామబాణముతో చంపిన ఓ శ్రీరామచంద్రా,

ఒకసారి 3 పేటల జంధ్యముతో ప్రకాశించు వక్షము కలిగి, కృష్ణాజినమును శరీరమునకు ధరించి జల, ఎడారి, వన, పర్వతము అను 4 విధముల భూమిలో 3 అడుగులు కోరి, 2 అడుగులతో 3 లోకములను కొలిచిన ఓ వామనుడా

తూర్పు, పడమర. ఉత్తర, దక్షిణములు అను 4 దిక్కులు వణుకునట్లు గజేంద్రుడు పిలవగా, అందమైన 2 రెక్కలు కలిగిన గరుత్మంతుడిని ఎక్కి, నిండు నీటి చెరువులోని మొసలి నోటిలో చిక్కిన 2 పెద్ద చెవుల అసహాయ గజేంద్రుడి బాధాకరమైన దుఃఖమును తీర్చిన ఓ శ్రీమన్నారాయణుడా,

జఠరాగ్ని, గృహాగ్ని, దావాగ్ని అను 3 అగ్నులతోను ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము అను 4 వేదములతోను జాతి, మతము, గుణము, సమాజము, దేశము అను 5 ధర్మములతోను యజనము, యాజనము, అధ్యయనము, అధ్యాపనము, దానము, ప్రతిగ్రహణము అను 6 కర్మలు చేయు ఉత్తమమైన బ్రాహ్మణులతో నిత్యమూ పూజింపబడే   ఓ విష్ణుమూర్తీ,

మానవుడి యొక్క శ్వాస, చూపు, వినికిడి, తినుట అను 4 ద్వారములను మరణము సమీపించిన వెంటనే మూసివేసి వాక్కు, పాణి, పాదము, వాయువు, ఉవస్థ అను 5 ఇంద్రియములతో నిండిన శరీరమును నాశనము చేసి సత్వగుణము, తమోగుణము,

రజోగుణము అను 3 గుణములలో చివరి తమోగుణము, రజోగుణము అను 2 గుణములను తీసివేసి సత్వగుణమున మానవుడు చేసిన పుణ్యము, పాపము అను 2 లెక్కలతో మానవుడి జన్మలను నిర్ణయిస్తావని జ్ఞానులు చెప్పగా తెలియబడిన ఓ గోవిందుడా,

3 కన్నులు, 4 చేతులు కలిగి మెడలో 5 పడగల పామును, శిరస్సున గంగను ధరించిన పరమశివుడికి కూడా తెలియరాని గొప్ప విశిష్ఠ స్వభావము కలిగిన ఆశ్చర్యుడా, ఓ పురుషోత్తమా,

7 లోకములలోని భూమిని దంతముపై ఎత్తిన ఓ వరాహమా,

తీపి, వగరు, ఉప్పు, కారము, చేదు, పులుపు అను 6 రుచుల ఫలితమై వున్న ప్రద్యుమ్నా ఓ దామోదరా,

ప్రకాశవంతమైన వనమాలి, గద, శాంఘుము, శంఖము, చక్రము అను 5 ఆయుధములను నీ దివ్య హస్తములలో కలిగిన ఓ చక్రపాణీ,

అందమైన 4 భుజములు కలిగిన సముద్రవర్ణుడా, ఓ మధుసూధనుడా,

స్వచ్ఛమైన మనస్సుతో చంద్రుడి వంటి ప్రకాశించు ముఖములు కలిగిన ఇద్దరు సఖులు శ్రీదేవి, భూదేవి తమ సుతిమెత్తని పూలవంటి దివ్య హస్తములతో ఎల్లప్పుడూ నీ 2 పాదములను వత్తుతుండగా, యోగనిద్రలో అమరిన ఓ శేషశయనుడా,

భూమి, నీరు, నిప్పు, వాయువు, ఆకాశము అను 5 మహా భూతములకు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అను 4 వర్ణముల శాస్త్ర విధికి నిర్వాహకుడవైన ఓ అనిరుద్ధుడా,

వసంత ఋతువు, గ్రీష్మ ఋతువు, వర్ష ఋతువు, శరదృతువు, హేమంత ఋతువు, శిశిర ఋతువు అను 6 ఋతువులలోను లభించే రకరకాల పువ్వులను తన అందమైన కొప్పులో ధరించు నప్పిన్న రాధ గురించి 7 ఎద్దులను చంపిన ఓ శ్రీకృష్ణుడా,

శైవము, వైష్ణవము, శాక్తేయము, గాణావత్యము, సౌరము, కాపాలము అను 6 మతముల చేత కూడా తెలియరాని స్వభావము కలిగిన ఓ పరాత్పరా,

శక్తి, జ్ఞానము, బలము, ఐశ్వర్యము, తేజస్సు అను 5 గుణములు కలిగిన లక్ష్మీదేవిని వక్షస్థలమున కలిగిన ఓ శ్రియఃపతీ,

ధర్మము, అర్థము, కామము, మోక్షము అను 4 పురుషార్థములు అయి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు అను 3 మూర్తులు అయి పుణ్యము, పాపము అను 2 విధముల ఫలితములు కలిగి అన్ని లోకములలోను ఒకే విధముగా వ్యాపించి వున్న ఓ సర్వేశ్వరుడా,

తేనె నిండి వికసించి, పరిమళములతో మైమరపించే రంగురంగుల పూలతోటలు,సువాసనలు వెదజల్లే అందమైన పూల తీగలు, మంచినీటి చెరువులు, మంచి ముత్యపు మణుల కాంతితో ప్రవహించే కావేరీనది, నవధాన్యములతో కళకళలాడే పచ్చని పంటపొలములు, విరిసిన వనములు, పూలలతలతో చుట్టిన ప్రహారీలు కలిగివున్న బంగారపు మేడలు, ఆకాశమున ప్రకాశించే నిండు పున్నమి చంద్రుడిని అడ్డగిస్తున్న ఎత్తైన మేడలు, నిండైన ఐశ్వర్యము, సంస్కారము,కలిగిన తిరుక్కుడంద అను మహా నగరములో నిత్యమూ పురోహితులు వేదమంత్రములతో పూజించుచుండగా ఆదిశేషుడి పానుపుపై పవళించి యోగనిద్రలో అమరిన ఓ అభయామృత స్వామీ,

"నీ 2 పాదములను ఆశ్రయిస్తిని

ఈ ప్రపంచములో సంసారమున వచ్చు

దుఃఖములను పోగొట్టు స్వామీ"

తిరుమంగై ఆళ్వారుడి దివ్య పాదములకు నమస్కారములు.

*************************

4. ఆళ్వారులందరూ చాలా చాలా అభిమానముతో రచించిన

తిరుపతి వేంకటేశ్వరస్వామి పద్యాల అర్థరూపము.

1. మోక్షమై వున్న కొండ అని వేంకటాద్రిని గురించి పాడుతున్నాను. దానిసే మనస్సులో స్థిరముగా తలుస్తున్నాను. అందుకే మనము అధ్యయనము చేయు వేదశాస్త్రపు వలలో చిక్కుకొని వున్న ఆ లక్ష్మీపతి యొక్క కాళ్ల సంధులలోని వలలో నేను పడిపోయి వున్నానండి.

2. అధికమైన వర్షపు నీటితో నిండిన సెలయేళ్లు మణిమాణిక్యములను తీసుకొని వచ్చి పై నుండి క్రింద పడగా, కొండ చిలువ ఏమో అని అనుకొని అక్కడ వున్న ఏనుగు భయపడి ఒక పక్కగా ఒదుగు పర్వతమైన తిరుమలకు వెళ్లుట గురించి కలుద్దామా అని వ్రాస్తున్నాను. అక్కడ కొలువైన వేంకటేశ్వరుడిని సేవిద్దామా అని పిలుస్తున్నాను.

3.  శ్రవణా నక్షత్రపు ధ్వని వినిపించుచుండగా నాపై అభిమానముతో ఆ వేంకటాధిపతియే వచ్చి నా మనస్సులో చేరి వుండిపోయెను. కొండవాగులు ముత్యాలు విసురుచుండగా చూడాలని అనుకుంటున్నాను. అందుకే నేను వేంకటాచలమునకు వెళ్లాలనుకుంటున్నాను.

4.  పరిమళించు కమలములో ఉద్భవించిన బ్రహ్మదేవుడు, త్రినేత్రుడైన శివుడు కూడా ఎల్లవేళలా ఆ స్వామి పాదములపై పద్మములుంచి కీర్తిస్తారట. అందుకే మహోన్నతమైన వేంకటాద్రికి వెళ్లి నమస్కరిస్తే అక్కడ వున్న మహిమతో మనలో నిలిచి వున్న పాపములన్నిటిని పోగొట్టుకొనవచ్చును.

5.  మబ్బులు నిండుగా చేరిన ఉత్తర శిఖరపు వేంకటాధీశుడికి దిష్టి తీయడానికి చంద్రుడిని జడలో గల శివుడు, తామరపై వున్న బ్రహ్మదేవుడు చత్రచామరలను చేతిలో పట్టుకొని సాయంసంధ్య వేళ వచ్చి కూర్చొని వుంటారట.

6. దేవతలు కీర్తించే ఆదిదేవుడి ఇప్పటి అవతారము గురించి చెప్పాలి అంటే కోపముతో లంక పైకి నేరుగా యుద్ధమునకు వెళ్ళి, రావణాసురుడిని చంపిన శ్రీరామచంద్రుడు వెదుళ్ల పొదలు నిండుగా పెరిగిన చల్లని వేంకటాద్రి కొండ చరియలపై వేంకటేశ్వర స్వామిగా నిలుచున్నాడు.

7. వేదములలో చెప్పినట్లుగా, ఆ శ్రీమన్నారాయణుడిని భక్తితో సేవించువారు ఎటువంటి లోటు లేకుండా జీవించి, ఆ తరువాత వైకుంఠమునకు చేరెదరు. అదిగో భూమిని తన పాదముతో కొలిచిన వామనుడు, ఆ సర్వేశ్వరుడు, కళ్యాణ గుణ సంపన్నుడు వేంకటేశ్వరస్వామిగా కొలువైన ఆ వేంకటాద్రిపై నున్న తిరుపతియే ఈ భూమిపైన వెలిసిన వైకుంఠము.

8.ఎల్లవేళలా విడువకుండా తులసిమాలలను ధరించిన ఆ సర్వేశ్వరుడిని తలుస్తూ, మోక్షమును పొందతలచిన ఐశ్వర్యవంతులు వేంకటాద్రిపై నున్న వేంకటేశ్వరుడుని దర్శించినంతనే, ఆ స్వామి వారి మనస్సులో జ్ఞానదీపమును వెలిగించి , వారి జ్ఞానమును పెంచి, వారి అగ్ని వంటి పాపములన్నిటిని నాశనము చేయునట్లుగా చేస్తూ కొలువై వున్న కొండ కేవలము ఆ వేంకటాద్రి మాత్రమే.

9. ఆ సర్వేశ్వరుడిని చేరు దారుల గురించి తమ చెవులారా భక్తితో విని, అప్పుడు కలిగిన జ్ఞానముతో ఆ స్వామిని దర్శించాలి అనే తపన నిండిన భక్తులు మరియు వేదార్థ జ్ఞానులు అయిన ఋషులు, మునులు ప్రతీరోజు అన్ని దిక్కుల నుండి అందరూ ధూపము, దీపము, పుష్పములు, జలము, నైవేద్యములను చేతులలో పట్టుకొని, నిండు భక్తితో ఆనందముగా చేరు తిరుమలయే తెల్లని శంఖమును ఊదు నేరు గల స్వామికి ఇష్టమైన ప్రదేశము.

10. ప్రజలకు దూరముగా విసిరేసినట్లుగా కదిలే రకరకాలైన పాములతో, ఆటవీకులతోను, గుంపులు గుంపులుగా తిరిగే ఏనుగులతో నిండి వున్న పెద్ద అడవిలో, దట్టమైన మేఘములతో నిండి వున్న పెద్ద పెద్ద కొండల నడుమ , ప్రకాశవంతమైన మణిమయ కాంతులతో పుట్టలో కొలువై వున్న వేంకటేశ్వరస్వామి నివసిస్తున్న వేంకటాచలమే అందరికి ఇష్టమైన ప్రదేశము.

11. శత్రువుల వంటి మన శరీరములోని ఐదు ఇంద్రియములను, పంచభూతములను అణిచిపెట్టి, ఘోరతపస్సు చేసుకునేవారికి మరియు దేవతలకు, మోక్షమును పొందేవారికి, నమస్కరించుభక్తులకు ఈ భూమిపైన ఆ విష్ణుమూర్తి ప్రసాదించిన దివ్యమైన స్థలము సుఖసంతోషములను ఇచ్చే అందమైన వేంకటాద్రియే.

12. రాక్షసులను చంపే చక్రమును ఆయుధముగా ధరించి ,దేవతలను కాపాడు స్వామి యొక్క పర్వతము ఈ వేంకటాద్రియే. దేవతలందరూ గొప్ప భాగ్యమనుకొని సేవించునది ఈ వేంకటాద్రినే. ఖచ్చితముగా మన పాపకర్మలను తీర్చునది కూడా ఈ వేంకటాద్రియే.

13. వేంకటాద్రిన నివసించే ఆ వేంకటేశ్వరుడికి నమో నమః అని చెప్పే విధమును తెలుసుకొని మిగిలినవారికి చెప్పేవారి పాత పాపములు, రాబోయే పాపములన్నీ నిజముగా నశించిపోవును.

14. కొండనెత్తి చల్లని వర్షము నుండి కాపాడినవాడు, ఆనాడు భూమిని కొలిచిన సర్వేశ్వరుడు వచ్చి చేరివున్న ఒక్క వేంకటాద్రికే వెళ్లి సేవించగానే మన పాపములన్నీ నశించును.

15. భక్తులందరూ ఆశ్రయించి పూలను సమర్పిస్తూ ,ఆ స్వామి దివ్య పాదపద్మములను ఆశించి వదల కుండా వుండిపోగా, తేజోమయప్రకాశముతో అంతటా నిండి నిలిచిన స్వామి కొలువైన చల్లని సెలయేళ్లతో నిండిన ఆ వేంకటాచలమే దేవతలకు, మానవులకు కూడా పెద్ద రత్నాల నిధి.

16. భగవంతుడి గురించి వివరముగా తెలుసుకొని, ఆ స్వామిపై ఆశతో చంద్రుడిని దాటి ఆకాశము చివర వరకు వెళ్లి, అక్కడ ఆగి, ఆ స్వామి ఎక్కడ వున్నాడా అని వెతుకుతూ క్రిందకు చూస్తూ పరిగెడుతున్న నా మనస్సు, వేంకటాద్రిపై కొలువై వున్న వేంకటేశ్వరస్వామిని చూసి క్రిందకు వచ్చి, మంచి పందిరి గుంజకు అల్లుకుంటూ పైకి పాకిన పూలతీగవలె ఆ స్వామి చుట్టూ పాకినది.

17. మహా సముద్రము వంటి నీలివర్ణుడి గొప్పతనమును ఏమని చెప్పను. సముద్రమునుండి భూమిని విడదీసెను. చిటికెన వ్రేలిపై గోవర్ధనగిరిని ఎత్తెను. చిన్నప్పటి నుండి

భయపెడుతున్న కంసుడి మీదమీదకు వెళ్లి గుండెలపై ఎగిరి తన్ని చంపెను. అలల ఘోషతో నిండిన మహా సముద్రమున పవళించిననూ, నిలుచున్నది మాత్రము ఆ వేంకటాచలముపైననే.

18. పాలసముద్రము, పాడగము కుంభకోణము అను నగరములు, చల్లని వేంకటాద్రి, స్వచ్ఛమైన నా మనస్సు, నిండు వైకుంఠము, గొప్పవైన వేదములు, అనంతుడు అను ఆదిశేషుడు ఇవన్నీ అందమైన తులసిమాలలు కలిగిన శ్రియఃపతి యొక్క ముఖ్యమైన ప్రదేశములు.

19. భూమి, అష్టదిక్కులు అన్నీ తానే అయి వున్న స్వామి, వేదమై, వేదప్రతిపాద్యుడై, పరమపద వైకుంఠమై వున్న సర్వేశ్వరుడు, ప్రవహించే సెలయేళ్ల నీటిచప్పుడుతో నిండు చంద్రుడికి దగ్గరగా వున్న కొండ శిఖరముపై వేంకటేశ్వరుడిగా కొలువై వుండి, నా హృదయములో నిండుగా నిండి వున్నాడు.

20. ఉత్తముడైన పురుషోత్తముడు ఎల్లప్పుడు తనను ధ్యానించు వారి హృదయములో నిండి వున్నాడు. అందుకే ధ్యానించే నా మంచి మనస్సులో కూడా నిండి వున్నాడు చూడు. అంతేకాదు తన పాదముల క్రింద అంత పెద్ద భూమిని నిండుగా ఒదిగినట్లుగా కొలిచిన స్వామి, పొంగి ప్రవహించు సెలయేళ్లతో నిండి, ఆకాశములో ఒదిగిన ఎత్తైన కొండ శిఖరము మీద వేంకటేశ్వరుడుగా కొలువై వున్నాడు చూడు.

21. ఎత్తైన కొండ శిఖరపు వేంకటాద్రిపై  ఎల్లవేళలా మానవులను, దేవతలను రక్షిస్తూ ఆ సర్వేశ్వరుడే కొలువై వున్నాడు.

22.ఎర్రని, నల్లని కలువ కన్నులు, ఈటెలు, చేపలు అంటూ అనేక రకాల విశాలమైన కన్నులతో లోకములను జయించి, ఆత్మస్వరూపమై వున్న స్వామి,  అవధి లేక అంతటా వ్యాపించిన అనంతమయుడు, రాక్షసులను చంపిన గొప్ప ఆశ్చర్యకరుడు, గరుడవాహనధారి, మాధవుడు, గోవిందుడు రెక్కలు కలిగిన అందమైన తెల్లని హంస వంటి కన్నులతో, వాటికి సరిసమానమైన తెల్లని పూలతోటల నడుమ వేంకటాద్రిన కొలువై వున్నాడు.

23. అశాశ్వతమైన ఈ మానవజన్మను పోగొట్టి తనను చేరునట్లు చేయు కరుణారససాగరుడు, పురుషోత్తముడు, మెరుపులతో నిండిన మేఘములు తిరిగే ఆ వేంకటాద్రిపై నివసించే ఏనుగు వంటి దివ్యమైన భారీ ఆకారపు నా స్వామి, ఆ వేంకటేశ్వరుడు నా మనస్సులో పూర్తిగా నిండి వున్నాడు.

24. పరిమళములు వెదజల్లు పూలతో నిండిన కురంద వృక్షమును పీకిన గోవిందుడు, నా దేవదేవుడు, శంఖములు వున్న విశాలమైన పాలకడలిలో నిద్రించిన పద్మనేత్రుడు, వీర విహారము చేయు బకుడి నోటిని చీల్చిన పురాణపురుషుడి  స్థానమైన సెలయేళ్ల ప్రవాహపు నీటిలోని ఎర్రని చేపలు చిందులు వేయు వేంకటాద్రిని చేరు మనసా.

25. శ్రీరంగమనే మహానగరమును, పాలకడలివలె పవళించే పడకగా చేసుకొని, భయంకరమైన రక్కసి పాలతో పాటు బలవంతముగా ప్రాణములను కూడా మ్రింగిన పసిబిడ్డడు, నా స్వామి నిలిచి వున్న చోటు అందరు జ్ఞానులు ప్రతీక్షణము  'ఓ తెల్లని ప్రకాశపు నీలమణివర్ణపు నల్లనివాడా ' అని అంటూ నమస్కరించు ఆ వేంకటాద్రిని చేరు మనసా.

26. ఆకాశము, అగ్ని, గాలి, నీరు, భూమి అన్నీ అయి వున్న దేవాదిదేవుడు, పరిమళ పువ్వుపై కొలువైన లక్ష్మీదేవి వల్లభుడు వున్న చోటు, బిగువైన నడుముల అమాయకపు ఆటవీక స్త్రీలు ఎత్తైన మంచెలపై నిలబడి ఎర్రధాన్యపు చేలకు కాపలాకాయు వేంకటాద్రిని చేరు మనసా.

27. భూమి, నీరు, అగ్ని, గాలితో పాటు ఆకాశము అన్నీ అయివున్నవాడు, వేయిపేర్లుగా చెప్పబడు జన్మాంతరహితుడు నిలిచి వున్న చోటు, విశాలమైన ఆకాశము మధ్యన కురిసే కారుమేఘములు తాకుతుండగా ఎత్తైన కొండలపై మంచు మబ్బుల పూలతోటలు చుట్టిన తిరుమలను చేరు మనసా.

28. చాలా గొప్పదైన తిరుమంత్రము అష్టాక్షరిని అనుసంధించిన వారికి, అనుసంధించుచున్నవారికి మరొక జన్మ లేనట్లు జన్మ పరంపరలను నాశనము చేసి రక్షించు స్వామి వున్న చోటు పరిమళములతో నిండిన రంగురంగుల మంచి పూలతో వికసించు విశాలతోటలతో, మహోన్నతమైన మహిమ కలిగి ప్రకాశించు వేంకటాద్రిని చేరు మనసా.

29. దానగుణ పరిపూర్ణుడు అయిన అసుర కుల నాయకుడు బలిచక్రవర్తి చేయు యాగమునకు పొట్టి బ్రహ్మచారి వామనుడై వెళ్లి భూమిని దానముగా అడిగిన స్వామి, ఏడు మద్దిచెట్లను పడగొట్టిన అతిబలవంతుడు, అష్టభుజుడు, హిమాలయములలోని బదరీనాథ్, తిరుమాలిరుంశోలై నగరములను ఇష్టపడే దేవదేవుడు, బలమైన ఏనుగు దుఃఖమును తీర్చిన నా స్వామి వున్న వేంకటాద్రిని చేరు మనసా.

30. ఆనాడు భారతయుద్ధ సమయమున అర్జునుడికి విజయమును ఇచ్చిన పరంజ్యోతి, రేపల్లెలోని గోపికలతో రాసలీలలాడిన గోపాలుడు, తనను కొలిచే వారి హృదయాలలో వుండి,

అంతటా నిండి వున్న దేవాదిదేవుడు కొలువై వున్న పవిత్రమైన నీటి తటాకముల తోటలు కలిగిన వేంకటాద్రిని చేరు మనసా.

31. ఎత్తుకొని ఒడిలో లాలించే చిన్నపిల్లడై, బాధపెట్టే రాక్షసుల తలలను, కాళ్లను నిర్లక్ష్యముగా విరిచి అదృశ్యమైన యువకుడు ఆ శ్రీకృష్ణుడు వచ్చి నిలబడిన చోటు తోటలతో నిండిన వేంకటాద్రికే వెళ్లి చేరండి యువకులారా.

32. ఎల్లవేళలా నిండుచంద్రుడు మణిదీపమై వెలుగుతుండగా, వేటగాళ్లుగా చుట్టుకొని ఆటవీకులు ధనస్సును పట్టుకొని ఏనుగులకై రాగా, ఆ ఏనుగులు తొండమును పైకెత్తి కాపాడమని ఆ స్వామిని ప్రార్థించు వేంకటాచలమునకు ప్రజలందరూ వెళ్లి,  ప్రదక్షిణములు చేసి భక్తి పారవశ్యముతో నాట్యమాడిన చాలా చాలా మంచిది.

33. పూల తోటలతోను, బంగారము మణిమాణిక్యములు ముత్యములతో కలిసిన నవరత్నపు నీటి సెలయేళ్లతో దొర్లిపడు అడవులలో, బలమైన సిం హములు, పులులు, కోతులు మరియు కోయవారు కలిగిన వేంకటాద్రియే ఆ మణిమయ ప్రాకాశకుడు కొలువైన ప్రదేశము.

34. కొండజాతి స్త్రీలు తమ అందమైన చేతులతో వేంకటాద్రిపై పెరిగే వెదుళ్ల పొదనుంచి కొరబియ్యమును తీసుకోవడానికి తిరిగే ఆ వేంకటాచలమే వెలిగే చంద్రుడిని రాహువు నుండి కలిగిన భయమును పోగొట్టిన పురుషోత్తముడు ఆ దేవాదిదేవుడి నిత్యనివాసము.

35. ఆకాశమున మెల్లగా పయనించే చల్లని తెల్లని చంద్రుడిలోని అందమైన కుందేలు వంటి ఆకారమును అందుకొనుటకై మాటు వేసి చూస్తున్నట్లుగా వున్న వేటాడే పులి వంటి ఎత్తైన విశాలపు కొండశిఖరము కలిగి, వికసించి పరిమళించు పువ్వులతో నిండిన వేంకటాద్రియే ఆ శ్రీకృష్ణుడి దివ్య స్థానము.

36. అడవి పందులు తమ మూతితో తొలచి దున్నిన భూమిలో, ఆటవీకులలోని పెద్దవారు, తియ్యని మంచి ధాన్యపు విత్తనములను చల్లి, ఆకాశమును అంటుతున్నట్లుగా పెరిగిన వెదుళ్లను నరుకుటకై వెళ్లిన వేంకటాద్రియే, వెదురు వేణువును నోట నుంచుకొని వేణుగాన సమ్మోహితులను చేసిన స్వామి యొక్క పర్వతము.

37. తొండము పైకెత్తి పరిగెడుతున్నట్లుగా వున్న ఒక పెద్ద ఏనుగు ఆకారము వంటి పెద్ద మేఘము, పరుగు పరుగున వచ్చి ఆ వేంకటాద్రిని గుద్దుకోగా, తొండము ముక్కలు ముక్కలై, తెల్లని దంతము విరిగినట్లుగా భయముతో బాధతో అరుస్తున్నట్లు, ఆ మేఘము అక్కడికక్కడే నిలబడిపోయి ఉరుముతూ కనిపించే కొండయే, ఆవుదూడను పట్టుకొని వెలగపండుపైకి విసిరిన స్వామి యొక్క కొండ.

38. ప్రవహించే సెలయేటి నీటిని త్రాగుతూ, ఆ నీటిలోని తన నీడనే చూసి వేరొక పెద్ద కోతి అని అనుకొని, భయముతో దూరముగా పరిగెత్తి, అక్కడే వున్న చెట్లపై నున్న నల్లని నేరేడు పండ్లను కోసి తినడానికై చెయ్యి చాచు కోతులు నివసించే వేంకటాద్రియే, పూర్వకాలములో చెట్టుపై వున్న వెలగపండు కోయుటకు ఆవుదూడగా వచ్చిన రాక్షసుడిని విసిరిన స్వామి నివసించే పర్వతము.

39. కొండలపై తిరిగే కోతులు రాత్రి సమయమందు దగ్గరగా కనిపించే వెన్నెలలను వెదజల్లే చంద్రుడిని పట్టుకోవడానికై పరిగెత్తే ప్రశాంతమైన వేంకటాద్రియే, ఒకానొకప్పుడు ఉపాయముతో భూమిని తీసుకున్న వామనుడు ఇష్టముతో సుఖముగా తిరిగే ప్రదేశము.

40. మదమెక్కిన ఏనుగులు, ముత్యము వంటి తమ తెల్లని దంతములు నేలరాలునట్లుగా, కోపముతో పోట్లాడుకొను వేంకటాద్రియే, ఒకప్పుడు వరాహమై భూమిని తన దంతముతో పైకి ఎత్తినవాడు కొలువైన కొండ.

41. ఆడ మగ ఏనుగులు కలిసి తియ్యతేనియ రుచి కలిగిన లేత వెదురు కొమ్మలను పీకి తింటూ, తిరిగే తిరుమలయే కదా, కారుమేఘపు రంగు శరీరము కలిగిన ఆ వేంకటేశ్వరస్వామి యొక్క కొండ.

42. విశాలమైన ఆకాశములో ,నక్షత్రములు ప్రకాశించు రాత్రి సమయమున ,తమ పొలములపై పడిన ఏనుగుల గుంపును తరుముటకై , ఆటవీకులు తమ చేతులలో ఎర్రని అగ్నితో మండే కాగడాలను పట్టుకొని, పెద్ద పెద్ద విల్లు బాణములతో వచ్చినప్పుడు, అవి భయముతో పారిపోతుంటే, ఒకప్పుడు విల్లు బాణములతో వచ్చిన శ్రీరాముడుని చూసి రాక్షసులు పారిపోయినట్లుగా తలచి సంతోషించిన కొండ ఆ వేంకటాచలమే.

43. వాడిచూపుల పడతులు శ్రీరాముడి వంటి భర్త కావాలి, అని కోరుకుంటూ అందమైన పూలమాలలను సమర్పిస్తూ, ధూపము వేస్తూ పూజించే ఆ శ్రీరాముడు, బంగారు లేడి చచ్చునట్లుగా తన బాణముతో కొట్టిన ఆ సర్వేశ్వరుడు కొలువైన కొండనే ఈ వేంకటాచలము. ద్వాదశినాడు రాత్రి సమయమునందు నల్లని ఆకాశములో మిణుకు మిణుకుమంటూ మెరిసే కోటి నక్షత్రముల మధ్య, తన ప్రకాశవంతమైన కాంతితో మెరిసే ఎత్తైన కొండనే ఈ వేంకటాచలము.

44. తపస్సు చేసుకునే వారి జుట్టు జడలు కట్టి, ముందు వెనుక ప్రేలాడుతుండగా, ఆ జడలతో నిండిన వారి తలలను చూసి, చిన్న చిన్న పాముపుట్టలు, మట్టిగుట్టలు అనుకొని,

అక్కడ వున్న పూలతీగలు, ఆ జడలకు అల్లుకుంటూ పోతుంటే, వాటి పక్కనే, సన్నని జలతారు సవ్వడి చేస్తూ, నీళ్లు రాళ్లపై పడుతూ, లయబద్ధమైన స్వరముతో, గలగలమని పారే సెలయేళ్లతో చాలా చూడచక్కగా రమ్యముగా కనిపించే అందమైన కొండ, అందరికి చాలా ఇష్టమైన ఆ తిరుపతి కొండయే, ఆ స్వామి వెలిసిన కొండ.

45.మణిమయ ప్రకాశవంతుడు, విశాలమైన ఉదారశక్తివంతుడు అయిన ఆ సర్వేశ్వరుడు ఇష్టపడే ప్రదేశములు శ్రీరంగము, తిరుక్కోట్టియూరు అను నగరములు. చాలా కాలముగా నివాసముంటున్నది ఆ తిరుపతిలో, చాలా రోజులుగా వచ్చి కొలువై వున్నది అతిశయమైన అందముతో నిండిన తిరునీర్మలము అను నగరములో.

46. కేశి అను రాక్షసుడి నోటిని చీల్చిన చిన్నికృష్ణుడు, క్షీరసముద్రమున శయనించిన దేవాదిదేవుడు నా హృదయములో నుండుగా నిండి వున్నాడు. వేంకటాద్రిపై కొలువై వున్నాడు. అంతేకాదు, చెప్పనలవి కాని విశాలమైన శ్రీరంగము అను నగరములో కొలువై, అందరి చేత సేవించబడుతున్నాడు.

47. కాలమంతా ప్రయత్నించినా, నీ గొప్పతనమును తెలుసుకున్నవారు ఎవరూ లేరు. ఎంత ప్రయత్నించినా, నీ రూపమును తెలుసుకున్నవారు ఎవరూ లేరు.పాలసముద్రమున శయనించిన నీవు వైకుంఠములో వున్నావు, భూమిపైన అవతరించావు. నాలుగు వేదముల సారములో ఇమిడిపోయి వున్నావు. చల్లని వేంకటాద్రిపై కూడా కొలువై వున్నావు.

48. దేవతలందరిలోకి గొప్ప బలవంతుడు, ఆ పద్మనాభుడు నన్ను సృష్టించి, తనను పూజించే భాగ్యమును ప్రసాదించిన నా స్వామి, కోరిన కోరికలను తీర్చే కల్పవృక్షము, నాకు అమృతముతో సమానమైనవాడు ఎవరో కాదు. భక్తుల యందు అభిమానము కలిగిన

భక్తసులుభుడు, వర్షించే నీలిమేఘము వంటి తిరుమల నగరములోని వేంకటగిరిపై కొలుపై వున్న వేంకటేశ్వరుడే, దేవతలను రక్షించే ఆ దామోదరుడు.

49. నిండైన తేటనీటి కొండచరియల జలపాతపు వేంకటాద్రిన, లెక్కలేని కళ్యాణగుణములు నిండిన దేవాదిదేవుడే నా స్వామి, ఆ మాయాలోలుడు సౌందర్యప్రకాశపు ఎర్ర తామరనేత్రుడు, ఎర్రని పండు అధరపు నీలమణిమాణిక్యము.

50. దేవతలకే దేవుడు ఆ వేంకటాచలపతి, అని నేను ఆ మాట అంటే, ఆ స్వామి యొక్క దివ్యతేజస్సంతా అక్కడే వుండిపోతుందేమో. బుద్ధి కొంచము కూడా లేని నీచుడను. నా లోపల ఆ స్వామి తన వెలుగును సగము వుంచాడు కదా.

51. సకల వేదముల అమృతమై, స్వచ్ఛమైన కళ్యాణగుణవంతుడై వున్న ఆ వేంకటాదీశుడిని, తేజోమయుడైన ఆ స్వామిని, సకలలోకములు సేవించే ఆదికారణుడు అని వేదవేత్తలు అంటే అది అతిశయమవదు.

52. తన నల్లని జుట్టుకు అందమైన ఆకుపచ్చని తులసియే తగినదని తలచి, ధరించిన స్వామి, మల్లయోధులను చంపిన ఆజానుబాహుడు పవళించిన ఆ విశాలమైన క్షీరసాగరములో, మనము స్నానము చేయవలెను, అను కోరికను తీర్చుకోవాలి, అని అనుకుంటే మనము బ్రతికున్నంతవరకు కొండ అంటే గొప్పదైన ఆ వేంకటాద్రియే, అని నిండుగా పాడుతూ ఆ వేంకటాద్రిపై నివసించే వేంకటేశ్వరస్వామిని ధ్యానించి, సేవించాలి.

53. కొండలపై నుంచి క్రిందపడే జలపాతపు సెలయేళ్లలో, ఏనుగులు నించొని,తన తొండముతో సెలయేటి నీటిని తీసుకొని, లాలాజలముతో నిండిన తన నోటిని శుభ్రముగా కడుక్కొని, ఆ తొండముతోనే తన శరీరమును, కాళ్లను కడుక్కొని, తియ్యని తేనె నిండిన

విచ్చిన పూలగుత్తిని తొండముతో తీసుకొని వెళ్లి, దివ్యమైన ఆకారపు వేంకటేశ్వరస్వామికి సమర్పించి, పూజించి సాష్టాంగ నమస్కారములు చేయును.

54. ఎడమ నుంచి కుడివైపుకి ఏడు గుర్రాల సూర్యుడి రథము నడుస్తుండగా, ఉత్తరమున వున్న వేంకటాచలమున ఎంతో ఇష్టముతో నివసించే కుంభనృత్యము చేయు స్వామి యుక్క కదులు పాదములను కీర్తించుటయే మన నోటికి లభించిన పరమ పురుషార్థము.

55. శ్రీదేవిని సింగారించిన శ్రీనివాసా, మోహనాకారా, నాలుగు వేదములను తెలిపిన నువ్వు, నీతిశాస్త్రములను  వివరించిన నువ్వు, ఎవరూ ఊహించనంత ఎత్తైన ప్రదేశములో, వెదుళ్ల పొదలతో నిండివున్న కొండ చరియల మధ్యన, విశాలమైన భూభాగములో, అందమైన పూలతోటలతో నిండిన చల్లని తిరుపతిలో, నిండైన మనస్సుతో వచ్చి చేరి వున్నావా స్వామి.

56. ఎక్కడో మారుమూల ఎత్తైన కొండ ప్రాంతాలైన విశాల తిరుమాలిరుంశోలైలోను, ఆ వేంకటాద్రిపైన, ఆ కొండలలో, ఆ కోనలలో, నీవు హాయిగా కొలువై వున్నావే, అంతేకాకుండా ఆ క్షీరసాగరపు నడిమధ్యన శయనించావే. అంత కష్టమైన చోటనే హాయిగా వున్న నీవు, నాపై అభిమానముతో సున్నితమైన నా చిన్ని గుండెలో కొలువై వుండలేవా స్వామి. నేను నిన్ను మనస్పూర్తిగా ప్రార్థిస్తున్నాను స్వామి,నన్ను వదిలి వెళ్లకు.

57. భూత భవిష్యత్తు వర్తమాన కాలములలో ,అన్ని వేళలా, తల్లి తండ్రి ప్రాణము అన్నీ నీవే, అయివున్నవు. అటువంటి నిన్ను నేను పొందితిని. విష్ణుమూర్తీ, ఆదికారణుడా, ముల్లోకములకు సర్వేశ్వరుడా, ఓ పరమాత్మా, చల్లని వేంకటాద్రిన వున్న వేంకటేశ్వరా, చల్లని తులసి వాసనలో నివసించే స్వామీ, ఇక నిన్ను విడిచి పెట్టగలనా.

58. భక్తుడినైన నేను అనుభవించే నా అమృతమా, దేవాదిదేవుడా, శత్రునాశక గరుత్మంతుడిని వాహనముగా కల అందమైన పండువంటి అధరపు సర్వేశ్వరా, పాపములతో వచ్చిన దుఃఖములను తీర్చే దివ్యౌషదమా, వేంకటాద్రిలోని నా స్వామీ, కలలోనైనా నీ దివ్య పాదములను ఒక్క క్షణమైనా చూడలేకపోతున్నందుకు సహించలేకపోతున్నాను.

59. నీ దివ్య పాదములను చూడాలనే అల్పబుద్దిని నేను కోరకుండా వదలను. నీలకంఠపు శివుడు, జ్ఞాని అయిన బ్రహ్మదేవుడు, ఇంద్రుడు, దేవతలందరూ కలిసి అభిమానించే వేంకటేశ్వరా, మాయచేసే శ్రీకృష్ణుడై వచ్చినట్లుగా , నా ముందుకు ఇప్పుడే రా,  స్వామి.

60. లోకమును మ్రింగిన పెద్ద నోరుకల అవధి లేని కీర్తివంతుడా, నా స్వామీ, నిత్యమైన గొప్పవాడా, భూలోకమునకే తిలకమై వున్న వేంకటాద్రిలోని నా స్వామీ, ఈ కళంకపు భక్తుడు నీ దివ్యపాదములను చేరు విధమును చెప్పవయ్య

61. ముక్కలై భస్మమై, మట్టిలో కలిసిపోవునట్లుగా, అతి భయంకరమైన రాక్షస కులమునంతా నాశనము చేయుటకే, కోపముతో జ్వలించు శ్రీచక్రమును, దక్షిణ హస్తమున వున్న దేవదేవుడా, బురద నిండిన చెలమలలోని తామరలు, ఎర్రని నిప్పురంగుతో వికసించిన వేంకటాద్రిలో వున్న వేంకటేశ్వరా, తీరని ఆర్తితో భక్తుడినై వున్న నాకు, నీ దివ్యపాదములను చేరు విధానమును ప్రసాదించవయ్యా.

62. ఈ భూమిని కొలిచిన రెండు తామర పాదములను ఎప్పుడెప్పుడు సేవించాలా, అని అందరూ అనుకుంటుండగా, దేవతలు మునులు ఎల్లవేళలా గుంపులు గుంపులుగా త్రికరణశుద్ధిగా కైంకర్యసేవను చేస్తూ, ప్రార్థిస్తూ, కీర్తించే వేంకటాద్రిలోని వేంకటేశ్వరా, నేను నీ దివ్యపాదములను పొంది నిజమైన భక్తుడిగా వుండిపోయేదెప్పుడో కదా.

63. కోకొల్లలుగా కోతులు తిరిగే వేంకటాద్రిపై, నిండుగా కొలుపై వున్న వేంకటేశ్వరా, సాయంసంధ్య కాంతిరంగుతో మెరిసే వస్త్రమును ధరించి , శ్రీరంగమున శేషశాయిపై కొలుపై వున్నావు. నీ అందమైన నాభి నుండి బ్రహ్మదేవుడిని సృష్టించితివి. అయ్యో, ఇంత మోహనకరమైన నీ దివ్య మంగళ విగ్రహమును చూసిన నా మనస్సు ఈ శరీరమును వదిలిపెట్టి నీ వద్దకు వచ్చి అక్కడే వుండిపోయినది.

64. మంచి వాసన కలిగిన ఉమ్మెత్త పువ్వులను, ములగపువ్వులను తెచ్చి, మూడు పూటలా, నీ పాదములపై పెట్టి ,నమస్కరిస్తున్నాను. ఎన్నిరోజులైనా నీవు నా పూజలకు కరగకపోతే, నాకు కోపము వచ్చి, నీవు పచ్చి అబద్ధాలకోరువి, అని నేను నిన్ను తిట్టక ముందే, నీవు తిరుపతిలో కొలుపై వున్న ఆ వేంకటేశ్వరస్వామిని, తేజోమయుడైన ఆ గోవిందుడిని నేను చేరునట్లుగా వికసించిన పూలగుత్తుల బాణములను సంధించు , మన్మధుడా.

65. కమ్మని వినసొంపైన రాగాలాపన చేయు కోకిలలారా, మీరు ఇప్పుడు ఎంతో మధురముగా పాడినా, మీ పాటలను వినే స్థితిలో నేను లేను. మహిమ కలిగిన వేంకటాద్రిపై నివసించే ఆ వేంకటేశ్వరస్వామి, గరుడవాహనధారి, దయతో నన్ను అనుగ్రహించి, నా వద్దకు వచ్చి, నా బాధను తీర్చినప్పుడు, నేను మనసారా మిమ్మల్ని పిలుస్తాను. అప్పుడు వచ్చి మీరు ఆడుతూ పాడుతూ వుంటే, మీ పాటలను తృప్తితీరా వింటాను.

66. భూమిపై నున్న సముద్రములలోని నీటిని త్రాగి, విశాలమైన ఆకాశములో, చాలా పెద్దగా వ్యాపించిన చల్లని వర్షపు మేఘములారా, బలిచక్రవర్తి నుండి భూమిని దానముగా తీసుకున్న వామనుడు కొలుపైన వేంకటాద్రి శిఖరముపై వ్యాపించి, అక్కడ వర్షిస్తున్న సమయము నందు, కరి మ్రింగిన వెలగపండు వలె, నా హృదయములోపలికి, నాకు తెలియకుండా

ప్రవేశించి, నా మనస్సును అపహరించి,  బాధపెడుతున్న ఆ శ్రీమన్నారాయణుడికి , నా మనోవ్యథను తెలపండి.

67. చల్లని నల్లని మేఘములారా, శంఖములతో నిండిన మహా సముద్రమును చిలికిన సర్వేశ్వరుడు, ఆ వేంకటాద్రిపైన కొలువై వున్నడు. ఆ పుండరీకాక్షుడి దివ్య పాదపద్మములను సేవించు ఈ సేవకురాలి విన్నపమును, ఆ స్వామికి విన్నవించండి. హృదయ భారముతో, నుదుటిన నిండిన చెమటతో, నుదుటి కుంకుమ చెదురునట్లుగా, ప్రాణములను అరచేత పెట్టుకొని, ఏదో ఒకనాడు నీవు వస్తావని నేను ఎదురుచూస్తూ నిలుచున్నాను,  అని చెప్పరా.

68. వర్షాకాలమున ఆకాశములో పయనించే నల్లని మేఘములారా, రాక్షసులతో యుద్ధము చేసిన శ్రీరాముడి పేరును తలుస్తూ, కీర్తిస్తూ, ఏదో ఒకరోజు తాను వస్తాడు ,అని వర్షాకాలములోని జిల్లేడు మొక్క యొక్క పండుటాకు వలె,  గిలగిలా కొట్టుకుంటూ, చాలాకాలముగా బాధపడుతూ, ఎదురుచూస్తున్నాను. వేంకటాద్రిపైన కొలువైన నా స్వామికి , ఈ విషయమును నా మాటగా తెలపండి.

69. మెరుపుల కాంతిని దాచుకున్న దట్టమైన వర్షపు నీటి నల్ల మబ్బుల్లారా,  తిరుమల యందు కొలువై, తన దివ్య వక్షస్థలమున లక్ష్మీదేవిని సింగారించుకున్న శ్రియఃపతిని, చల్లనైన నా గుండెలలోని బంగారపు హృదయఫలకమున నింపుకొని, ప్రతీరోజూ ఆశతో , ఆయన రాకకై ఎదురుచూస్తున్నాను. ఈ విషయమును సవివరముగా ఆ స్వామికి తెలపండి.

70. విశాలమైన ఆకాశమంతా ఆక్రమించుకున్న గొప్ప మేఘములారా, వేంకటాద్రిపైన మీరు గుమిగూడి,  తేనె నిండి వికసించిన పూలగుత్తులు చెల్లచెదురైనట్లు,  వర్షించే సమయములో, నారసిం హుడై పదునైన బలము గల గోళ్లతో హిరణ్యకశ్యపుడి శరీరమును చీల్చిన స్వామితో,

తాను దొంగిలించిన నా గాజులను, అవే బక్కచిక్కిన నా చేతినుండి జారి పడిపోయిన ఘల్లుఘల్లుమని చప్పుడు చేసే నా గాజులను,  నాకు ఇవ్వమని చెప్పండి.

71. మంచిముత్యపు జల్లులవలె వర్షించే గొప్ప మేఘములారా, వేంకటాద్రిపైన కొలువై వున్న శ్యామలవర్ణపు వేంకటేశ్వరస్వామి, అర్ధరాత్రి వరకు తన కామాగ్నితో, నన్ను బాధిస్తున్నాడు. తెల్లవారుఝామున దక్షిణపు చల్లని పిల్లగాలికి వేంకటాద్రిపై ఆ స్వామి విహరించు సమయమున, ఈ విరహపు వేదనలో నేను ఉండలేక పోతున్నాను,  అని మీరు చెప్పరా.

72. పెద్ద ఏనుగు ఆకారము వలె ఆకాశమున ఆవరించిన గొప్ప మేఘములారా, విరహపువేదనలో నేను మరణించినట్లయితే, ఆ తిరుమలలో సుఖముగా కొలువైన శేషశయనుడి మాటలు వట్టి అబద్దలు. తన భక్తులకు  ఎల్లవేళలా తానే గతి అని అంటూ, ఆ భక్తులను ఎల్లప్పుడు నేను రక్షిస్తాను,  అని పలికే స్వామి,  తానే సర్వస్వము ఆని అనే ఒక ఆడపిల్లను రక్షించలేక చంపెను, అని లోకములోని వారందరూ తలో రకముగా అనుకుంటారు.

73.విశాలమైన నీలి ఆకాశమున , తివాచీ పరచినట్లుగా, వ్యాపించి వున్న దట్టమైన వర్షపు మేఘములారా, తేటనీటి సెలయేళ్లు జలజలమని ప్రవహించే వేంకటాద్రి వైపుకు వెడుతున్నట్టున్నారు. ఆ సర్వేశ్వరుడికై నా హృదయము తల్లడిల్లుతూ, బెంగతో, నా కంటిలోని నీరు జలజలమని రాలుతూ, నా గుండెలపై నుంచి సెలయేరై ప్రవహిస్తున్నది. నా గుండెలోని బాధను తీర్చుటకై, ఒక్కసారి ఇక్కడికి రమ్మని, ప్రేమతో నిండిన నా విరహపు వేదనను ఆ వేంకటాద్రిపై కొలువై వున్న వేంకటేశ్వరస్వామికి వినిపించరా.

74. దయార్ద్ర హృదయపు వర్షపు మేఘములారా, బక్కచిక్కిన నా చేతినుండి మెరిసే బంగారపు మంచి గాజులు, బంగారము వంటి నా మంచి మనస్సు, ఆ మనస్సుకు ప్రశాంతతను ఇచ్చే మంచి నిద్ర అన్నీ నన్ను దీనురాలిని చేసి వదిలి వెళ్లిపోయాయి. నా వద్ద ఏమి లేక, నేను బలహీనురాలిని అయితిని. చల్లని సెలయేళ్లతో నిండిన వేంకటాద్రిన కొలుపై వున్న నా గోవిందుడు, నా వద్దకు వచ్చే వరకు, ఆ స్వామి కళ్యాణగుణములను పాడుతూ, నా ప్రాణములను రక్షించుకుంటూ వుండడానికి ప్రయత్నించెదను.

75. ఓ చల్లనైన నిండునీటి మేఘములారా, మైనముతో నిండిన కొవ్వొత్తిని వేడి కరిగించునట్లుగా, మట్టితో నిండిన నా ఈ బయటి శరీరము లోపలికి ప్రవేశించి, నన్ను పూర్తిగా వశపరచుకొని, నా మనస్సును కరిగిస్తూ, నన్ను బాధ పెడుతున్న సర్వేశ్వరుడు, స్వర్గలోకమునకు సరిసమానమైన యోగ్యత కలిగిన వేంకటాద్రిపై కొలుపై వున్న వేంకటేశ్వరుడు, పరుగు పరుగున వచ్చి నన్ను అక్కున చేర్చుకొనునట్లుగా, మీరు నాపై దయతో వర్షించరా.

76. ప్రజలందరిని సుఖపెట్టే భగవానుడా, ఎత్తైన చల్లని శిఖరముల వేంకటాచలముపై నున్న నా స్వామీ, చమత్కారుడా, దామోదరా, నా శరీరముపైన నీ చక్రాంకితముల గుర్తులను వేసుకొని, వాటితో నేను పెనవేసుకొని పోయితిని. ఇది నీ దయనే, అని నా అభిప్రాయము.

77. స్థంభము మధ్య నుంచి నారసిం హుడై అవతరించి, అవహేళన చేయు హిరణ్యకశ్యపుడి శరీరమును బద్దలు కొట్టిన నా స్వామీ, ఆదిశేషుడి పానుపుపై పవళించి మహిమాన్విత శ్రీ వేంకటద్రిపై నివసించే వేంకటేశ్వరుడా, నేను నీ భక్తుడను, నన్ను నీవు గుర్తుపెట్టుకో.

78. వచ్చినట్లుండి రానివాడా, రానివాడివలె వుండి వచ్చిన వాడా, ఎర్ర తామర కన్నులు, ఎర్రని పండు అధరము కలిగి , నాలుగు చేతులా నిండి వున్న అమృతమా, నా ప్రాణమా, రాత్రిని కూడా పగలు చేయగల చింతామణి కాంతులలో వెలిగే వేంకటాద్రిలోని వేంకటేశ్వరా, అయ్యో, నేను నీ భక్తుడను. ఒక్కక్షణమైనా నీ దివ్యపాదములను వదిలి వుండలేక పోతున్నాను.

79. పైలోకములలో తెల్లని ముత్యపు గొడుగు క్రింద, అధ్భుత సౌందర్యరాశి అయిన ఊర్వశి యొక్క పొందు లభించినను, నేను ఇష్టపడను. మహిమాన్విత దివ్య తిరుపతిలో గల ఎర్రటి పగడపు అధరపు సర్వేశ్వరుడి బంగారపు కొండపై, ఏదో ఒక విధముగా వుండిపోయినా కూడా నేను భాగ్యవంతుడినే అగుదును.

80. చెదరని సౌందర్యరాశులైన రంభ, ఊర్వశి, మేనకల వంటి అప్సరసలతో నిండిన స్వర్గలోకమును ఏలుకొనే వరమును కాని, భూలోకములోని రాజరికమును కాని నేను కోరను. తియ్యతేనియ పరిమళపు రంగు రంగుల పూలతోటలు కలిగిన తిరుపతి వేంకటాచలములోని సెలయేళ్లలోని చేపనై పుట్టే భాగ్యవంతుడను కావలెను.

81. సన్నని నాజూకైన మెరుపు తీగల నడుము కలిగిన రంభ, ఊర్వశి, మేనకల ఆటపాటలను నేను ఇష్టపడను. అన్నీ "తానే" అని తుమ్మెదలు కూడా ఆ వేంకటేశ్వరస్వామికై పాడుతూ తిరిగే ఆ తిరుపతి వేంకటాచలము నందు, ఆ స్వామి పాదస్పర్శతో పులకరించి పోయే పరమపావనమైన ఒక కొండ శిఖరము కావలెను, అను నా కోరిక తీరుటకై, గొప్ప తపశ్శక్తివంతుడను కావలెను.

82. స్వచ్ఛమైన మంచి పగడములు నిండుగా కలిగిన చల్లని పాలకడలిలో పవళించి వున్న శ్రీమన్నారాయణుడి దివ్య పాదపద్మములకు సేవ చేయుట కంటే, రాగయుక్తముగా తుమ్మెదలు గానము చేయు తిరుపతి వేంకటాచలముపై గల సంపెంగ తోటలలోని ఒక సంపెంగ పువ్వును అయివుండే భాగ్యవంతుడను కావలెను.

83. మదపుటేనుగు అంబారీపై కూర్చొని, ఆనందమును పొందే రాజభోగమును, రాచరికమును నేను కోరను. నన్ను రక్షించే సర్వేశ్వరుడు కొలువై వున్న మెరిసే వేంకటాచలముపై తంటక వృక్షమై జీవిస్తూ, తపస్సు చేసుకునే భాగ్యవంతుడను కావలెను.

84. ఆకాశమును పరిపాలించే ఏకైక చంద్రుడి వలె, ఈ భూప్రపంచమును అంతా ఏలుకునే సార్వభౌమత్వమును, కోకొల్లలైన సిరిసంపదలను, కీర్తిప్రతిష్టలను నేను కోరను. తేనెతో పరిమళించు పూలతోటలతో నిండిన తిరుపతి వేంకటాద్రిపై, ఒక అడవి వాగునై ప్రవహించే పవిత్రుడను కావలెను.

85. చంద్రుడిని తలపై ధరించిన శివుడు, బ్రహ్మదేవుడు, ఇంద్రుడు మొదలైన దేవతలకు అధికారములను ఇచ్చి, వాటికి సరిపడా గుణములను ఇచ్చి, తనను ఆశ్రయించే భక్తులకు గొప్ప యాగములను చేసిననంత పుణ్యఫలమును ఇచ్చే వేదవేద్యుడు అయిన వేంకటేశ్వరస్వామి కొలువై వున్న పరిమళించు చల్లని పూలతోటలతో నిండిన తిరుపతి వేంకటాద్రిపైకి ఎక్కే దారిలో,  ఒక దారిగా ఉండిపోయే భాగ్యవంతుడిని కావలెను.

86. బ్రహ్మదేవుడు, శివుడు, ఇంద్రుడు మొదలైన దేవతలందరూ, ఎల్లప్పుడు తిరిగే వైకుంఠపు వాకిలి యందు ప్రవేశించుట కంటే, మెరుపు వంటి కాంతి కలిగిన చక్రధారి

వేంకటాచలపతి ఉమ్మివేయు బంగారపు పాత్రను పట్టుకొని, ఆ స్వామికి దగ్గరగా వుండే భాగ్యవంతుడను కావలెను.

87. నాకు వచ్చే జన్మ అంటూ వుంటే, ఏడు ఆబోతులను జయించిన శ్రీకృష్ణుడికి సేవ చేసే భాగ్యమును నేను కోరుకుంటానే తప్ప, తాత్కాలికమైన ఈ సిరిసంపదలను, రక్తమాంసములు కలిగిన ఈ మానవ శరీరమును నేను కోరను కాక కోరను. వేంకటేశ్వరస్వామి కొలుపై వున్న తిరుపతి వేంకటాచలముపై వున్న స్వామిని సేవిస్తూ, కోనేటి నీటిలో ఒక కొంగనై పుట్టే భాగ్యవంతుడను కావలెను.

88. పూర్వజన్మల పాపఫలముతో ఈ భూలోకమున క్రూరమైన సంసార బంధనములో పడవేసే శ్రియఃపతీ, ఆశ్రిత వ్యామోహనుడా, ఆర్తజన రక్షకుడా, వేంకటేశ్వరుడా, స్వామీ, నిన్ను సేవించడానికి వచ్చే భక్తులు, దేవతలు, ఋషులు, మునులు, అప్సరసలు అందరూ ప్రవేశించే నీ గుడి వాకిట ఒక గడపగా వుండి, నీ పగడపు అధరమును ఎల్లవేళలా సేవించే భాగ్యమును ప్రసాదించు స్వామి.

89. కాలసమయమును తెలిసిన కోతులు సంచరించు, పూలవాగులలోని పువ్వులను కోసుకొని, ఆ స్వామి పేర్లను తలుస్తూ, ఆ పువ్వులను వేంకటేశ్వరస్వామి యొక్క మణిమయ ప్రకాశపు దివ్య పాదపద్మములపై వేసి, అలంకరిస్తూ, పూజించుటకు బయలుదేరు మంచి మనసా.

90. ఈ ప్రపంచములోను, పైలోకములోను మనకు సుఖమును ఇచ్చి, మోక్షమును ప్రసాదించు సత్యస్వరూపుడు, ఎర్రని బంగారపు శరీరచ్ఛాయ కలిగిన శ్రీమన్నారాయణుడు, విశాలమైన తోటలతో నిండిన శ్రీరంగములోను, తిరుమలలోను నల్లని రంగు ఆకారముతో

కొలువు తీరెను.  ఆ అద్వితీయుడిని తమ మనస్సులో తలిచే భక్తులకు, నేను శిరస్సు వంచి నమస్కరించెదను.

91. సారంగీ, తొందరగా పడవను నడుపు. ఈ సుందరముఖి శరీరపు కాంతి పూర్తిగా మారిపోకుండా, దీర్ఘ కిరీటము కల ఆ వైకుంఠనాథుడు భూమిపైన కొలువై వున్న తియ్యతేనియ ప్రవాహముతో తెల్లని ముత్యాల జలపాతపు సెలయేళ్లు నిండిన మహిమాన్విత తిరుమలకు చేరవలెను.

92. నిండు నీటి కడలితో నిండిన భూమిని పూర్తిగా మ్రింగి,అందమైన లేత మర్రి ఆకు చిగురుపై నిద్రించిన నా స్వామీ, ఐశ్వర్యకరమైన మహాకొండ శ్రీ వేంకటాద్రిపై నివసించే అత్యంత అపురూపమైన అద్భుత అమృతమా, నా స్వామీ, శ్రీ వేంకటేశ్వరా, ఈ భక్తుడిపై దయ చూపవయ్యా.

93. ఆశ్చర్యకారణుడా, మాధవా, నా స్వామీ, రాళ్లనుంచి తియ్యని తేనె కారి ప్రవహించి, కమలములతో నిండిన సెలయేళ్లుగా మారిన వేంకటాద్రిపై వున్న వేంకటేశ్వరా, పాపములను చేసిన పాపాత్ముడనయితిని. వేరే ఏ ఆలోచన లేక నిన్ను చేరాలనే ఒకే ఒక ఆశయముతో వున్నవాడిని.  నిన్నే అశ్రయించాలని వచ్చి చేరితిని. నన్ను నీ భక్తుడిగా స్వీకరించవయ్యా.

94. గుబురు వెదుళ్ల పొదలతో, వికసించి పరిమళించు పూలతోటలతో చుట్టిన వేంకటాద్రిపై వున్న వేంకటేశ్వరా, తల్లి తండ్రి భార్య పిల్లలు బంధువులు అంటూ ఇప్పటి వరకు ఈ సంసారములో పడి, కొట్టుకొనిపోతూ బాధపడితిని. నిన్ను పూజించి సేవించాలనే  ఒకే ఒక ఆలోచన కలిగి, నీచుడనైన నేను వచ్చి నిన్ను చేరితిని. నన్ను మన్నించి, నీ స్నేహ హస్తముతో, నీ సేవకుడిగా స్వీకరించవయ్యా.

95. చెట్ల కొమ్మలపై నుంచి తేనె కారి ప్రవహించు చల్లని తోటలు కలిగిన వేంకటాద్రిపై వున్న వేంకటేశ్వరుడా, నా స్వామీ, నిన్ను చూడాలనే ఆశతో, ఎన్నో జన్మలుగా, ఎన్నో నోములు నోస్తున్నాను. కాని ఈ జన్మలోనే నిన్ను చూడాలనే ఆశతో బ్రతుకుతూ, బాధపడుతున్నాను. ఆ బాధను భరించలేక వచ్చి నిన్ను ఆశ్రయిస్తిని.  ఈ జన్మలో నీ దర్శన భాగ్యమునకు తగిన వాడిని అయితిని.  నన్ను నీ భక్తుడిగా స్వీకరించవయ్యా.

96. పెద్ద పెద్ద కొండ శిఖరములతో చుట్టబడి, కుంకుమ భరిణ వలె మెరిసే వేంకటాద్రిపై వున్న వేంకటేశ్వరా, అతి ఘోరమైన పాపములను ఎన్నో చేసి అలసిపోయితిని.  నీ దివ్యపాదములను గురించి తెలుసుకొని, ఎన్నడూ సమర్థవంతముగా నేను పూజించలేదు. ఇక్కడకు వచ్చి నిన్ను ఆశ్రయిస్తిని.  నన్ను నీ భక్తుడిగా స్వీకరించవయ్యా.

97. భూమినంటుతూ వచ్చుచున్న విశాల మేఘములు, దారుల నిండా కప్పిన వేంకటాద్రిపై వున్న వేంకటేశ్వరుడా, మంచి కులములో పుట్టి పెరిగి, కష్టపడుతూ, చస్తూ, బ్రతుకుతున్నాను.  మంచి ఒక్కటి కూడా లేనివాడను. ఒక్క మంచి పని చెయ్యలేదు.  ఎంతో ఆర్తితో వచ్చి నిన్ను ఆశ్రయిస్తిని. నన్ను నీ భక్తుడిగా స్వీకరించవయ్యా.

98. భూమి, గాలి, నీరు, నిప్పు, మబ్బులు తిరిగే ఆకాశము అన్నీ అయివున్న నా స్వామీ, ఎత్తైన శిఖరములతో, ఆకాశము నిండా ఆవరించిన వేంకటాద్రిపైన, పరిమళములు నిండిన పువ్వులను ధరించిన వేంకటేశ్వరా, శరీరమంతా అలిసిపోయి, పుండు పడినట్లుగా, నేను బాధతో తల్లడిల్లుతున్ననూ, ఎంతో కష్టపడి నిన్ను ఆశ్రయిస్తిని. నన్ను నీ భక్తుడిగా స్వీకరించవయ్యా.

99. నా మాటలు నమ్ము మంచి మనసా, అందరూ అనుకుంటున్న మాటలను విని నీకు చెబుతున్నాను, విను. అందరూ ఆడి పాడి కీర్తిస్తూ, ఎంత నమస్కరించినా కూడా ఈ స్వామిని చూసే భాగ్యము పొందలేరు. పెద్ద తామరపువ్వులో వున్న బ్రహ్మదేవుడు, శివుడు, ఇంద్రుడు వచ్చి కీర్తించే వేంకటాద్రిపైన కొలుపై వున్న వేంకటేశ్వరస్వామికి, కుంభనృత్యమాడే గోపాలుడికి ఈ రోజున సేవ చేసే భాగ్యము నీకు లభించినది.

100. ఇంతకు ముందు ఈ భూమిపైన నివసించిన భక్తులు, అభిమానముతో సేవ చెయ్యగా, వారి తప్పొప్పులను చూడక, వారిని అనుగ్రహించి, వైకుంఠమున వుంచి, తన సేవాభాగ్యమును ప్రసాదిమంచిన స్వామికి, నా తండ్రికి, గోపీజన వల్లభుడికి, మబ్బులు త్రోసే ఎత్తైన వేంకటాద్రిపై వున్న వేంకటేశ్వరస్వామికి, ఆ దేవాదిదేవుడికి సేవచేసే భాగ్యము నీకు లభించినది.

101. పూలమాలలను తెచ్చి కీర్తించు భక్తులతో పాటు, వారి బంధువులను కూడా వైకుంఠమునకు తీసుకొని పెళ్లే స్వామిని చూసిన నా మంచి మనసా, వైకుంఠముతో పాటు, తుమ్మెదలు హాయిగా తిరిగే ఆ ఉత్తర వేంకటాద్రిని కూడా నిత్యనివాసము చేసుకున్న ఆ వేంకటేశ్వరస్వామికి ఈ రోజు సేవచేసే భాగ్యమును నీవు పొందితివి.

102. దేవతల మనస్సు వంటి నా మంచి మనస్సా, గొప్ప తపస్సంపన్నుల మనస్సులలో సంతోషముగా నిండి నివసించే మన తండ్రికి, ఆటవీకులు వేయు అగరు ధూపములతో నిండి వుండే వేంకటాద్రిపైన నివసించే వేంకటేశ్వరస్వామికి, బ్రహ్మచారి బ్రాహ్మణుడైన వామనుడికి ఈ రోజు సేవచేసే భాగ్యమును నీవు పొందితివి.

103. వీరు నా బంధువులు, వీరు నా వారు అని ఏమి లేని అద్వితీయుడు, అభిమానించే వారికి ఈ భూమిపైననే జన్మలను పోగొట్టే స్వామిని చూసిన నా మంచి మనసా, ఆటవీక స్త్రీలతో తుమ్మెదలు కూడా కురంజి రాగమును ఆలపించే వేంకటాద్రిపైన కొలువై వున్న మహిమాన్విత వేంకటేశ్వరస్వామికి ఈరోజు సేవచేసే భాగ్యమును నీవు పొందితివి.

104. ఇతడు మనకు కావలసినవాడు, కాడు కాడు అతడు మనకు కానివాడు, ఇతడు తక్కువవాడు, అతడు గొప్పవాడు అని అంటూ చెప్పే చెప్పుడు మాటలను వినక, నువ్వు కూడా చెప్పకుండా వుండే నా మంచి మనసా, వెదుళ్ల పొదల చిగురుటాకుల నుండి తెల్లని మంచు ముత్యములను రాల్చు వేంకటద్రిపైన, నిత్యనివాసముంటున్న ఈ వేంకటేశ్వరస్వామికి, ఈ గోవిందుడికి సేవ చేసే భాగ్యమును నీవు పొందితివి.

105. ఇతర మతముల వారి వాదనలు వినని నా మంచి మనసా, చమరీమృగములు గుంపులు గుంపులుగా చేరిన వేంకటాద్రిపైన, నిత్యనివాసమున్న ఈ వేంకటేశ్వరస్వామికి, వైకుంఠమున వున్న ఈ దేవాదిదేవుడికి, ఈరోజు సేవ చేసే భాగ్యము పొందితివి.

106. ఆహా, ఎంత అద్భుతము. తలకు శివుడికి వ్రేలాడుతున్నట్లున్న జడలతోనూ, అదే తలకు విష్ణుమూర్తి యొక్క పొడవైన అద్భుత కిరీటముతోను, చేతిలో శివుడి యొక్క ఆయుధము గొడ్డలితో పాటు విష్ణుమూర్తి యొక్క ప్రకాశించే చక్రము, నడుమునకు శివుడి యొక్క పాముతో పాటు ఆ శ్రీమన్నారాయణుడి అందెల బంగారు మొలత్రాడు చుట్టుకొని, అన్నివైపులా గలగలమని ప్రవహించే సెలయేళ్లతో నిండిన తిరుమలలో వున్న నా స్వామిని చూస్తుంటే, సాధక, సిద్ధులు అయిన ఆ విష్ణుమహేశ్వరులు ఇరువురు ఒక్కటై ఇక్కడే కొలువు తీరినట్లుగా వున్నది.

107. ఎటువంటి నాశనము లేని పరిపూర్ణ తేజోవంతుడా, నా స్వామీ, శ్రీ వేంకటాద్రిపై నివసించే వేంకటేశ్వరా, నా తండ్రీ, చింతామణీ, నువ్వు వచ్చి నా మనస్సు లోపల చేరి, స్థిరముగా కొలుపై వుంటివి. ఇక నేను నిన్ను ఎన్నడూ విడువని స్వామీ.

108. ఎక్కడో వైకుంఠములో దూరముగా వున్నవాడు, అందరి హృదయములలో దగ్గరగా వున్నవాడు, మాయాలోలుడు, మణుల ప్రకాశపు కాంతులలో, వెదుళ్ల చిగుళ్లపై మెరిసే ముత్యపు నీటిబిందువులతో నిండి వున్న మహా కొండ శ్రీ వేంకటాద్రిన నివసించే వేంకటేశ్వరుడు, నా గోవిందుడి దివ్య పాదముల సేవ తప్ప నేను మరొకటి ఎరుగను.

109. హద్దులేని వేదవేద్యుడు, ఆ వేంకటాచలపతి, దేవతలు శిరస్సు వంచి నమస్కరించే సర్వేశ్వరుడి దివ్యపాదములను ఆశ్రయించిన వారు, ధనము వున్నదని గర్వించరు, ఆ ధనము లేదని బాధపడరు. వారి జీవితములో ఎప్పటికి ధనము ముఖ్యము కాదు.

110. తిరుక్కణ్ణియూరు, శ్రీరంగము, తిరుమెయ్యము, కంచి, తిరుప్పేరై, తిరుపతి అను దివ్య నగరములలో కొలుపై వున్న భస్మాసురుడి బారి నుండి కపాలధారి శివుడిని కాపాడిన అద్వితీయుడిని కొలిచిన వారు తప్పక మోక్షమును పొందెదరు.

111. ఐశ్వర్యవంతుడైన ఆ వేంకటేశ్వరస్వామి , నిత్యనివాసుడై వున్న, ఎర్ర చేపలు ఆటలాడే సెలయేళ్ల వేంకటాద్రిని చేరమంటూ,  తిరుమంగై పురపు రాజు కలివైరి మరియు మిగిలిన ఆళ్వారులు కలిసి రచించిన ఈ అందమైన ద్రవిడ పాశురముల భావములను భయము లేకుండా, ధైర్యముగా చదవగలిగినవారు, నిశ్చయముగా ఓడలు తిరిగే మహా సముద్రములు కలిగిన ఈ భూమిపై గొప్పవారై, జీవిత తదనంతరమున ఆ వైకుంఠమునకు చేరగలరు.

అందరు ఆళ్వారుల దివ్య పాదములకు నమస్కారములు.

*****************************

అందరూ అభిమానించే ఆండాళ్ తల్లి, మన గోదాదేవి ఆచరించిన తిరుప్పావై వ్రత పద్యాల అర్థ రూపము.

.........

5. గోదాదేవి రచించిన తిరుప్పావై .

భగవంతుడిపై విరహవేదనలో కొట్టుమిట్టాడుతున్న గోదాదేవికి, ద్వాపర యుగములో శ్రీకృష్ణుడిని చేరాలని, గోపికలందరూ కలిసి ఆచరించిన కాత్యాయనీ వ్రతమును, మార్గళి వ్రతముగా చేయమని, ఆమె తండ్రి పెరియాళ్వారుడు చెప్పిరి. ఆ వ్రతమే ఈ తిరుప్పావై. అనగా దివ్యమైన ఐశ్వర్యకరమైన వ్రతము. ఈ ఐశ్వర్యము అన్నది మనము ఆచరించే మన మనస్సుకు సంబంధించినదై వుంటుంది. అంటే మన మనస్సు కోరుకునే ఈ ప్రపంచములోని సిరిసంపదలతో నిండిన ఐశ్వర్యము కావచ్చును, లేక పరమ పద వైకుంఠములోని మోక్షము కావచ్చును.

........................

1. రకరకాలైన మెరిసే బంగారపు ఆభరణములను సింగారించిన బాలికల్లారా, సంపదలతో సమృద్ధిగా నిండిన వ్రేపల్లె నందున్న లక్ష్మీదేవి వలె కళకళలాడే యువతుల్లారా, రండి. మార్గశిర మాసమున, శుక్ల పక్షమున, ఆకాశమునందు నిండు చంద్రుడు తన చల్లని తెల్లని పండు వెన్నెలలను వెదజల్లు శుభదినములలో, మనము విరహ వేదనలో కొట్టుమిట్టాడక, ఆ కృష్ణుడిలో లీనమయ్యే వ్రతమును ఆచరించుటకై మన మనస్సు, మన శరీరము శుద్ధి అగునట్లు స్నానము చేద్దాము. పదునైన బల్లెముతో ధేనుకాసురుడు వంటి క్రూరరాక్షసులను శిక్షించినవాడు, గోప కుల రాజు అయిన నందగోపుడి ముద్దుల కొడుకు, విశాలమైన కన్నులు కల సౌందర్యవతి యశోదాదేవికి అబ్బురాల గారాల ముద్దుబిడ్డడు, గంభీరమైన సిం హపు పిల్ల వంటి హుందా కలిగిన నల్లనివాడు అయిన శ్రీకృష్ణుడి ఎర్ర తామరల వంటి దివ్య నేత్రములు రెండూ సూర్యచంద్రులే. లోకములలోని వారందరూ అన్ని రకాలైన ప్రయోజనములను అనుభవించుటకు మరియు పరమ పురుషార్థమైన పరమ పద మోక్షమును పొందుటకు పూజించే ఆ శ్రీమన్నారాయణుడే ఈ శ్రీకృష్ణుడు. ఇతడే మన కోరికలను తీర్చువాడు. అందరము కలిసి ఆ భగవంతుడిని పూజించెదము రండి. ఇదియే ఇందులోని అభిప్రాయము.

2. ఈ లోకములోనే తరించాలని తహతహలాడే మానవులారా, మేము మా నోములో చేయునట్టి నియమములను వినండి. తెల్లవారుఝామునే నిద్ర లేచి, స్నానము చేసి, ఆ క్షీరాబ్ధి యందు ఆదిశేషుడిపై యోగనిద్ర పోతున్న ఆ సర్వేశ్వరుడి దివ్యపాదములను పూజించి, సేవించి, కీర్తించి కాని మేము ఏమి తినము, నేతితో చేసినవి తినము, పాలను త్రాగము. మేము ఆ స్వామిని పూజించకుండా కాటుకతో మా కంటిని అలంకరించము, పువ్వులను తలలో పెట్టము. ముందుగా మేము చేసేది ఆ స్వామి పూజ మాత్రమే, ఆ తరువాతే ఏదైనా. పెద్దలు చేయవద్దని చెప్పిన పనులను ఎప్పుడూ చెయ్యము. చెడ్డ మాటలు

చెప్పము. తగిన రీతిగా జ్ఞానులకు, బిచ్చగాండ్లకు దానధర్మములను చేస్తూ, ఈ మానవ జన్మలోనే తరించు మార్గమును వెతికి, సంతోషముగా ఆ దారిన నడిచెదము. ఇదియే ఇందులోని అభిప్రాయము.

3. మేము చేయు వ్రతమునకు నోము అని పేరుపెట్టి, ఆకాశమంత ఎత్తుకు ఎదిగి, లోకములన్నిటిని వామనుడై కొలిచిన ఆ పురుషోత్తముడి దివ్య నామములను అందరము కలిసి, ఒక చోటనే వుండి కీర్తిస్తూ, పూజ చేయడం వలన,దేశములో చెడు అన్న మాట ఒక్కటి కూడా లేకుండా పోయి, నెలకు మూడు సార్లు వానలు కురుస్తూ, పచ్చని పంటచేలతో సస్యశ్యామలమై, ఆ పంటల నడుమన వున్న నిండు నీటి చెరువులలో చేపలు ఎగిరెగిరి త్రుళ్లిపడుతూ, అందమైన ఎర్ర తామర పువ్వుల రేకల మీద చల్లని పిల్లగాలికి అందమైన తుమ్మెదలు నిద్రించుచుండగా, పచ్చిక బయళ్లలోని సాధుస్వభావపు ఆవులు గుంపులు గుంపులుగా పచ్చగడ్డిని కడుపారా తిని, నిండైన పొదుగులతో, మెడలోని గంటలు ఘల్లుఘల్లుమని సవ్వడి చేస్తూ, ఇళ్లకు వెళ్లి, పెద్ద పెద్ద కుండల నిండా పాలను ఇస్తూ, ఏ కొరత లేని అష్టైశ్వర్యములతో దేశము అభివృద్ధి చెందును. ఇదియే ఇందులోని అభిప్రాయము.

4. దట్టమైన ఓ కారుమేఘపు వరుణదేవా, ఈ వ్రతమును ఆచరించవలెను, అని అనుకున్న మేమందరము, ముందుగా స్నానము చెయ్యవలెను.ఏదో కొంత వానను కురిపిస్తావేమో, నీవు కురిపించు వానకి ఈ లోకములోని ప్రజలందరూ తడిసి ముద్ద అవ్వవలెను. అందుకే నీవు నీ శక్తి సామర్థ్యములను దాచుకోకు. నీవు చేసే ప్రతీ పనిలోను మాకు ఆ భగవంతుడి దివ్య లీలలే కనిపిస్తున్నాయి. నీవు నిండుగా నడిసముద్రములో మునిగి, ఆ నీటి ఆవిరిని గ్రహించి, నీలిరంగుతో నిండిన పెద్ద దట్టమైన మేఘములతో ఆకాశమంతా ఆవరించినప్పుడు, ఆ నీలమేఘశ్యాముడి శరీరకాంతి వలె కనిపించును. అందుకే సుందరమైన విశాలభుజములు

గల పద్మనాభుడి కుడిచేతిలోని కోటిసూర్య కాంతులతో ప్రకాశించు చక్రము వలె, నీవు కూడా ఈ ప్రపంచమంతా కాంతులు విరజిమ్ముతున్నట్లుగా, మెరవవలెను. రాక్షసుల గుండెలు అదురునట్లుగా ఆ శ్రీహరి ఎడమ చేతిలోని శంఖము యుక్క ధ్వని వలె దిక్కులు పిక్కటిల్లునట్లుగా ఉరమవలెను. అంతేకాకుండా కోదండరాముడి ధనస్సు నుండి వెలువడిన బాణవర్షము వలె ,ఆలస్యము చెయ్యకుండా, నీవు కూడా ఈ లోకమంతా సుఖపడునట్లుగా, భారీవర్షముతో వర్షించు. ఈ వానలో మేము మార్గళి స్నానము చేసి సంతోషించెదము. లోకకళ్యాణార్థమై చేయు మా వ్రతమునకు, నీవు కూడా సాయపడు. ఇదియే ఇందులోని అభిప్రాయము.

5. ఆశ్చర్యకరమైన పనులు చేస్తూ, చిద్విలాసముగా చిరునవ్వులు చిందిస్తూ, భగవత్ సంబంధము కలిగిన ఉత్తర మధురకు రాజై వెలుగుతున్న శ్రీకృష్ణుడిని, నిండు నీటితో ప్రవహించు పవిత్రమైన యమునానదీ తీరమున విహరించువాడిని, గోపకులము నందు ప్రకాశించు మంగళకరమైన మణిదీపము ఆ గోపకిశోరుడిని, తల్లి యశోదాదేవిని భక్తి పారవశ్యములో మైమరపించిన దామోదరుడిని, మన పవిత్రమైన మనస్సుతో కీర్తిస్తూ, శ్రీ మహా విష్ణువుకు చాలా చాలా ఇష్టమైన భక్తితో కూడుకున్న పువ్వులను అనగా అహింస, ఇంద్రియ నిగ్రహము, సర్వ భూత దయ, క్షమ, జ్ఞానము, తపస్సు, సత్యము, ధ్యానము అను పుష్పములను సమర్పించి, శరీర ఇంద్రియములు అన్నింటితోనూ సాష్టాంగ నమస్కారములు చేస్తూ, మనస్సులో ఎల్లవేళలా ధ్యానిస్తూ, మన నోటితో మాయాలోలుడా, మధురా నాయకా, యమునా తీర విహారీ, నంద వ్రజ మంగళ దీపమా, యశోదా గర్భ ప్రకాశమా, దామోదరా అంటూ ఆ స్వామి దివ్య నామములను కీర్తించిన చాలును. మనము ముందు చేసిన పాపములు, తరువాత రాబోయే పాపములు అన్నీకూడా , అగ్నిలో పడిన దూది వలె, కాలి

నాశనమగును. అందుకే ఆ భగవన్నామ సంకీర్తనలతో మన పాపములు పోగొట్టుకొనుటకు ఈ వ్రతమును చేయుదుము రండి, అని గోపికలను, ఇప్పుడు మనందరిని గోదాదేవి పిలుస్తున్నది. ఇదియే ఇందులోని అభిప్రాయము.

6. ఆ భగవంతుడి కథారసము అను అమృతము యొక్క రుచి చూసి ఎరుగని ఓ సాధ్వీమణీ, ఆ భగవంతుడి అనుభవమును తెలియక, ఇంకా నీవు నిద్రిస్తున్నవు. ఈ వ్రతమును ఆచరించుటకై లేచి రా. లోకములను రక్షించే పనిలో మునిగి, పాలకడలిలో ఆదిశేషుని పానుపుపై యోగనిద్రలో వున్న ఆ సర్వేశ్వరుడిని, తమ మనస్సులో వుంచుకున్న యోగులు, మునులు తెల్లవారుఝాముననే నిద్ర లేచి, వారి వారి నిత్యకృత్యములు ఆచరిస్తూ, ప్రకృతి సంబంధము వలన ఎటువంటి అహంకార మమకారములు వారికి కలగకుండా ఉండడానికై, వారు హరి హరి అని హరినామమును పలుకుతున్నారు. ఉదయకాలమున ఆ హరినామము మహాధ్వనియై నందవ్రజమంతా వ్యాపించి, మా చెవుల ద్వారా మా మనస్సుకు చేరి, ఆ శ్రీకృష్ణుడి విరహ జ్వాలలతో బీటలు వారిన మా మనస్సును చల్లబరచినది. ఆ తాపము ఉపశమించి మేము నిద్ర లేచితిమి. నీకు ఇంకా ఆ హరినామము వినబడ లేదా, నీవు కూడా లేచి వచ్చి, మాతో కలువు. తెల్లవారగానే పక్షులు కూడా నిద్ర లేచి, తమ కిలకిలారావములతో సందడి చేస్తూ, కూస్తూ, తమ ఆహార సంపాదనకై ఎగిరిపోతున్నవి. ప్రాతఃకాల ఆరాధనకై పక్షిరాజు గరుత్మంతుడికి అధిపతి అయిన ఆ శ్రీమన్నారాయణుడి ఆలయమున, తెల్లని శంఖము ఊదబడుచున్నది. ఆ గొప్ప ధ్వని నీకు ఇంకా వినపడలేదా. ఓ పిల్లా, లేచి రా. పూతన అను రాక్షసి యొక్క విషపు పాలను త్రాగిన నందకిశోరుడిని, బండిరూపమున వచ్చిన శకటాసురుడిని తన చిన్ని కాళ్లతో తన్నిన శ్రీకృష్ణుడిని కీర్తించవలెను. ఆ శ్రీకృష్ణపరమాత్మను దర్శించుకొను భాగ్యమునకై ,నీవు

కూడా తొందరగా నిద్ర లేచిరా, తల్లీ, అని మొదటి గోపికను లేపినది.  బాహ్య ఇంద్రియమైన చెవితో, మనలోని శ్రవణ భక్తిని మేల్కొలుపుటయే, ఇందులోని అభిప్రాయము.

7.భగవంతుడి కథరసము అను అమృతమును ఎట్లు సేవించవలెనో తెలియని ఓ పిచ్చిపిల్లా, లేచి రా. తెల్లవారెను, అని అంటూ కీచుకీచుమను ధ్వనితో, తమలో తాము మాట్లాడుకొను భరద్వాజ పక్షుల కిలకిలారావములు నీకు వినబడలేదా. ఆ పలుకులు, బ్రహ్మవేత్తలు తమ అనుభూతులను, అనుభవములను ఇతరులతో పంచుకున్నట్లుగా వున్నవి. ఈ బృందావనములో పుణ్య స్త్రీలు అయిన గోపికారమణులు తమ యొక్క ధర్మమును మరువక, తమ యొక్క భర్త, పిల్లల పనులను మరియు కుటుంబ విధులను పూర్తి చేసుకొని, కాసుల పేరు వంటి బంగారపు ఆభరణములతో అందముగా అలంకరించుకొని, అందమైన తమ జడలో పువ్వులు సింగారించుకొని, కవ్వముతో పెరుగును చిలుకుతున్న చప్పుడు నీకు వినబడలేదా. ఆ భగవంతుడి యొక్క స్వరూప, రూప, గుణ, విభూతులను అర్థవంతముగా తెలుసుకొని, మన మనస్సున నిండుగా వుంచుకొనుటయే పెరుగు. అ విథముగా తెలుసుకున్న పెరుగును, భగవంతుడికి సంబంధించిన జ్ఞానము అను కవ్వముతో, ఆ భగవంతుడికి ఇది చాలా ఇష్టము అనే త్రాడును కట్టి, చిలుకుట వలన, మనము ఏ పని చేసినా,

అది ఆ భగవంతుడికే చెందుతుంది అన్న ఆలోచన మనకు కలుగుతుంది. అదియే వెన్న. ఇదియే అమృతతత్వము.

ఓ నాయకురాలా, నీకు ఇటువంటి భగవంతుడి అనుభవము ఇంతకు ముందు కలిగే వుండును. నీ అనుభవమును ఇప్పుడు మాకు తెలిపి, మాకు నాయకురాలివై ఆ శ్రీకృష్ణుడిని

చేరుటకు సహాయమందించు. మనము ఏ రూపములో ఆ భగవంతుడిని తలుస్తామో, ఆ రూపములోనే

ఆ భగవంతుడు కనిపించును.మేము గుర్రము రూపములో వచ్చిన కేశి అను రాక్షసుడిని చంపిన కేశవుడిని కీర్తిస్తున్నప్పుడు, నీ మనస్సులోన ఆ భగవంతుడి రూపము మెదులుతోందని నీ తలుపు సంధులలో నుంచి, నీ ముఖములోని ఆనంద తేజస్సును చూసిన మాకు తెలుస్తున్నది. ఓ తేజశ్శాలినీ, తలుపులు తెరువు. నీ తేజస్సును చూసి మేము కూడా ఆనందించెదము ,అని రెండవ గోపికను నిద్ర నుండి మేల్కొలిపెను. మన మనస్సులోని తేజస్సును మేల్కొలుపుటయే, ఇందులోని అభిప్రాయము.

8. భగవంతుడి ధ్యానము నందు ఉత్సాహము కలిగిన ఓ పడతీ, నిద్ర నుంచి లేచి రా. మన మనస్సున సత్వగుణము అను సూర్యుడు ఉదయించగా, మనలోని రాజస, తామస గుణములు తగ్గి, తూర్పు తెల్లవారినది. తెల్లవారుఝామున మంచుతో నిండి వున్న పచ్చికను మేయుటకై, పశువుల కొట్టముల నుండి ఆవులు విడవబడినవి. తెల్లవారగానే వాటికి వేరొక ధ్యాస లేక, మేతకు వెళ్లుటయే, ఆ గోవుల యొక్క ప్రవృత్తి. అదే విధముగా మనము కూడా వేరొక ధ్యాస లేక, ఆ పరమాత్మను సేవించుటయే ప్రవృత్తిగా చేసుకొని, ఉదయముననే వ్రతము చేయు ప్రదేశమునకు వెళ్లవలెను. మేమందరము వ్రత ప్రదేశమునకు వెళ్లుటకు సిద్దపడి, నిన్ను పిలుచుటకై, నీ ఇంటికి వచ్చి, నీ వాకిలిలో నిలబడి వున్నాము. ఇకనైనా వెంటనే నిద్ర లేచి రావమ్మా.

ఆ సర్వేశ్వరుడు శ్రీకృష్ణుడి కళ్యాణగుణములను గానము చేస్తూ, మంగళ వాయిద్యములను వాయిస్తూ, ఆ శ్రీకృష్ణుడి సన్నిధికి వెళ్లవలెను.అహంకార భరితుడైన అశ్వాసురుడు అను రాక్షసుడిని చంపి, మల్లయోధులైన చాణూర ముష్టియోధులను సమ్హరించి, దేవతలకు కూడా

ఆదిదేవుడు అయివున్న దేవాదిదేవుడు ,ఆ శ్రీకృష్ణుడి సన్నిధికి వెళ్లి, తెల్లవారగానే , అందరికంటే ముందుగా మనము ఆ భగవంతుడిని సేవించినట్లయితే, అయ్యో, ఇంత చిన్నపిల్లలు, ఉదయముననే కష్టపడి లేచి, నా వద్దకు వచ్చారు, అని మనపై జాలితో వెంటనే మన పరిస్థితిని అర్థము చేసుకొని, ఆ శ్రీకృష్ణుడు మన వ్రతమునకు కావలసిన సాధనమైన వాయిద్యమును మనకు యిచ్చును. ఆ స్వామి, ఆయన యొక్క కైంకర్య సేవను, తన యొక్క విశిష్టమైన దయతో నిండిన ఫలితమును, మనకు ప్రసాదించును. కనుక ఆలస్యము చెయ్యక, వెంటనే నిద్ర లేచి రా, అని ఆండాళ్ తల్లి మనలో నిగూఢమై ఇమిడి వున్న ధ్యాన శక్తి అను మూడవ గోపికను మేల్కొలిపెను. ఇదియే ఇందులోని అభిప్రాయము.

9. మామగారి కూతురు ఓ మరదలా, తెల్లవారిపోయినా, నీవు ఇంకా నిద్ర లేవకుంటివి. నీవు మణిమాణిక్యములతో నిర్మించిన చాలా అందమైన పెద్ద మేడ యందు, చుట్టూ ప్రకాశించు దీపములు వెలుగుచుండగా, మంచి సువాసనల అగరు ధూపములు పరిమళించుచుండగా, సుతిమెత్తటి పానుపుపై మంచి నిద్రావస్థలో వున్నావా, లేచి రావమ్మా.
మణిమాణిక్యపూరితమైన మీ ఇంటి తలుపు గడియను తీయుము. నీవు ఈ బాహ్యప్రపంచమున సుఖసంపదలు అన్నిటిని అనుభవిస్తున్నావు. కాని ఈ భోగభాగ్యములే ఎప్పటికి మన జీవిత పరమావధి కాదు. దీనితో పాటు ఈ జన్మకు కారణమైన శాశ్వతసుఖమును తెలుసుకో. ఈ బాహ్య సుఖము అను మాయా నిద్ర నుండి లేచి శాశ్వత సుఖములను ఒసగు భగవంతుడిని కీర్తించుటకు లేచి రా. మేము చెబుతున్న ఈ భగవంతుడి విషయములు, భగవన్నామ సంకీర్తనములు నీకు వినబడుట లేదా.

ఓ అత్తగారూ, మీ కూతురిని నిద్ర లేపండి. ఏమిటి, సమాధానము చెప్పకున్నది. నీ కూతురు మూగదా లేక మా మాటలు వినపడని చెమిటిదా లేక అలసిపోయి వున్నదా లేక మీరు

బయటకు పంపకుండా కట్టుదిట్టములు చేసి కాపలా కాస్తున్నారా లేక బద్దకమా. చాలా సేపు నిద్ర పోవడానికి ఏమైనా మందు ఇచ్చారా లేక మంత్రము వేశారా. ఏమైనా మంత్రము వేసినచో, ఆ భగవంతుడి దివ్యనామములను కీర్తిస్తే ఆ మంత్రశక్తి నశిస్తుంది. ఆశ్చర్యకరమైన గుణములు కలిగిన శ్రియఃపతి ఆ వైకుంఠనాథుడి దివ్యనామములను మేము చక్కగా కీర్తించాము. మా బద్దకము అంతా పోయినది. ఇకనైనా ఆమెను నిద్ర లేపి, మాతో పాటు మా వ్రతమునకు పంపుము, అని ఆండాళ్ తల్లి సమాజములోని సంబంధ బాంధవ్యాల అమరికలో వున్న ఐక్యత వలన కలిగిన సిరిసంపదలను చూపుతూ, మనలోని బద్దకము అను నాలుగవ గోపికను మేల్కొలిపెను. ఇదియే ఇందులోని అభిప్రాయము.

10. అపూర్వమైన విలువైన వివిధ ఆభరణములు కలిగి, సుఖములో తేలియాడు ఓ తల్లీ, మా అందరి కన్నా ముందుగానే లేచి, చక్కగా నోమును నోచి, మంచి ఫలితమును పొందాలి, అని అనుకున్నావే. ఆ విధముగా చేయాలి అంటే, నీవు మాకన్నా ముందుగా నిద్ర లేవాలి కదా. కాని ఏమిటి, మేము వచ్చి నిన్ను ఎంత పిలిచినా, వాకిలి తలుపు అయినా తెరవలేదు. కనీసము సమాధానము అయినా చెప్పడం లేదు. ఇంకా నీవు నిద్ర లేవలేదా. అంత గాఢ నిద్ర పోతున్నావు ఏమిటి, కుంభకర్ణుడితో పోటీ పెట్టుకున్నావా. ఆ కుంభకర్ణుడు నీతో ఓడిపోయి, తన నిద్రను కూడా నీకు ఇచ్చాడా. తెలివి తెచ్చుకొని మేలుకో. రామావతారమున రాముడు, రావణాసురుడి తమ్ముడు అయిన కుంభకర్ణుడిని సం హరించెను. అదే విధముగా ఆ భగవంతుడిని సేవించినచో, నీలో దాగివున్న, కుంభకర్ణుడి నిద్ర తొలగును. నీవు తలుపులు తెరవక పోయినా ఫరవాలేదు. కనీసము మా మాట అయినా విని పలకవా. తొందరగా లేచి వచ్చి తలుపులు తెరువు. పరిమళించు తులసిమాలల కిరీటమును ధరించిన ఆ శ్రీమన్నారాయణుడిని మనమందరము కలిసి కీర్తించెదము. ఆ స్వామి ధర్మాత్ముడు. ఆయన

మనకు కావలసినవన్నిటిని ఇచ్చి, తన ఆశ్రయ స్థానమైనట్టి ఆ పరమపదమును ప్రసాదించును. లేచి వచ్చి మా వ్రతములో చేరుము, అని ఆండాళ్ తల్లి మనలో దాగి వున్న అశ్రద్ధను విడిచి, భగవంతుడిని ధ్యానించుము, అని ఐదవ గోపికను మేల్కొలిపెను. ఇదియే ఇందులోని అభిప్రాయము.

11. పాడిపంటలు పుష్కలముగా వున్న రేపల్లెలో సంతృప్తిగా గడ్డి మేసి, ఎప్పుడూ సమృద్ధిగా పాలు ఇచ్చు లేతవయస్సు గల ఆవులు మందలు మందలుగా వున్న గోపకులములోని గోపాలురు ఆరోగ్యవంతులై, ధీరులై, శూరులై కంసుడి రాజ్యమునకు వెళ్లి, ఎదిరించి, చంపిన బలరామకృష్ణుడి వలె శత్రువులపైకి వెళ్లి, ఎదిరించే శక్తిసామర్థ్యములు కలిగి వుండెదరు. వారు ధర్మాధర్మ విచక్షణతో, నీతినియమములతో, ఎటువంటి దోషములు లేని సమాజమును నిర్మించుకుందురు. అటువంటి గొప్ప గోకులమున పుట్టిన పాముకుబుసము వంటి సుతిమెత్తటి శరీరము కలిగి, పురివిప్పిన నెమలి వంటి కాంతులీను సహజసిద్ధమైన,అందమైన బంగారపు తీగవలె ప్రకాశించుదానా, నీ బంధువులు, స్నేహితులు అందరము కలిసి వచ్చి, నిన్ను పిలుచుటకు నీ వాకిలి ముందు నిలుచున్నాము. నీవు మాత్రము కదలక మెదలక, నిద్ర పోతున్నావు. ఎంత పిలిచినా, ఒక్కమాట అయినా మాట్లాడవు. మనము చేయు వ్రతమును మరచి, నీవు నిద్ర పోతున్నావు. ఓ భాగ్యవంతురాలా, లేచి రా. నాకేమిటి, నాకు అన్నీ వున్నాయి, ఆ లక్ష్మీదేవియే నాతో వున్నది, అటువంటప్పుడు ఆ వ్రతము చేయక పోయినా వచ్చే నష్టమేమి లేదు, అను నిర్లక్ష్యము నీకు కలిగినదా. ఆ భగవంతుడైన శ్రియఃపతిని సేవిస్తేనే కదా,ఆయనతో పాటు ఆ అష్టలక్ష్మి మనల్ని ఎప్పుడూ వదిలిపెట్టకుండా వుంటుంది. అందుకే నీవు వెంటనే నిద్ర లేచి, మాతో కలువు, అని ఆండాళ్ తల్లి మనలోని

నిర్లక్ష్యమును వెళ్లగొడుతూ, ఆరవ గోపికను మేల్కొలిపెను. ఇదియే ఇందులోని అభిప్రాయము.

12.`ఓ గొప్ప ఐశ్వర్యవంతుడి చెల్లెలా, తెల్లవారినది నిద్ర లేచి రా. మీ ఇంటి వద్ద ఆవులకు పాలు తీసేవారు ఇంకా రానందువలన, పాలతో నిండిన వాటి పొదుగులు బరువెక్కి, ఆ పాలు వాటంతట అవే కారి, మీ ఇంటి వాకిలి అంతా బురద బురద అయినది. ఆకాశము నుండి మంచు కురుస్తూ వుండడం వలన, మాకు నిలుచునేందుకు చోటు లేక, మీ ఇంటి చూరును పట్టుకొని నిలుచున్నాము. చాలా గొప్ప ఐశ్వర్యవంతుడైన మీ అన్న, ఇంతవరకూ, తన మనస్సులో భగవంతుడి గురించి ఆలోచనే లేని అతడు, మేము చేస్తున్న ఈ వ్రతమును గురించి తెలుసుకొని, ఆయన మనస్సు కరిగి మెత్తబడి, ఆవుల యొక్క పొదుగు నుండి వచ్చు పాలవలె, ఆర్ధ్రత పొందుచున్నది. అటువంటి మంచి గుణములు కలిగిన అన్నకి చెల్లెలిపై వున్న నీవు, ఇంకా నిద్రిస్తూనే వున్నావు. లేచి రా. రామావతార సమయమున దక్షిణ దిక్కున వున్న అందమైన లంకానగరమునకు రాజు అయిన రావణాసురుడిని చంపిన మనోహరుడైన ఆ సర్వేశ్వరుడు ,శ్రీరామచంద్రుడి కళ్యాణగుణములను పాడుతున్నాము. ఆ పాటలను విని, భగవంతుడిపై ఆసక్తి లేనివారు కూడా, ఆ భగవంతుడే సమస్తము అను విధముగా మారిపోతున్నారు. కాని నీవు మాత్రము నిద్ర లేవకుంటివి. ఏమిటి మాట్లాడడం లేదు. ఇదేమి గాఢ నిద్ర తల్లీ, ఈ వూరిలోని చుట్టుప్రక్కల వారందరూ లేచి, మన వ్రతము గురించి తెలుసుకున్నారు. ఇకనైనా నీవు నిద్ర లేచి వచ్చి మాతో కలువు, అని ఆండాళ్ తల్లి మనలోని భక్తిభావముతో కూడుకున్న ఆర్ధ్రతను, ఏడవ గోపికగా మేల్కొలిపెను. ఇదియే ఇందులోని అభిప్రాయము.

13. తామరపువ్వుపై తుమ్మెదలు వాలినట్లుగా వున్న కన్నులదానా, ఆ భగవంతుడిని చూడాలి, అనే ఆనందముతో, ఆ స్వామిని దర్శించుటకై నీ కన్నులు అటు ఇటు తిప్పడంతో, అసలే అందమైన నీ కన్నులు, అవి మరింత అందముగా వెలిగి పోతుండాలి. కాని నీవు ఈ విధముగా, నీ కళ్లను మూసి వుంచడం తగునా, నిద్ర లేచి రా. గురువు అను నక్షత్రము అస్తమించినది.  జ్ఞానమునకు ప్రతీక అయిన శుక్ర నక్షత్రము ఉదయించి, తెల్లవారినది. పక్షులు లేచి కూస్తూ, తమ ఆహారమునకై పోవుచున్నవి. భగవంతుడిని ఎప్పుడు చూస్తామా, అనే తాపత్రయముతో మా శరీరములు తాపముతో వేడెక్కుచున్నవి. పక్షి రూపముతో వచ్చిన బకుడు, అను రాక్షసుడిని చంపిన శ్రీకృష్ణుడి లీలలను గానము చేస్తూ, మిగిలిన వారందరూ స్నానము చేయుటకు నదికి వెళ్ళారు. నీవు కూడా భగవంతుడిని కీర్తిస్తూ స్నానము చేయుదువు గాని, నిద్ర లేచి రా. నీవు మాతో కలవక, కపటముతో ఒంటరిగా ఒక్కదానివే ఈ నోమును చేసుకోవచ్చు, అని అనుకుంటున్నావేమో, ఆ విధముగా నీవు చేసిన, ఆత్మను దొంగతనము చేసినంత నేరము అవుతుంది. కనుక నీవు వెంటనే నిద్ర లేచి మాతో వచ్చి కలువు, అని మనలోని జ్ఞానశక్తి, అను ఎనిమిదవ గోపికను మేల్కొలిపెను. ఇదియే ఇందులోని అభిప్రాయము.

14. ఓ పరిపూర్ణమైన వ్యక్తిత్వముతో విలసిల్లేదానా, తెల్లవారుటచే, మీతోటలో వున్న దిగుడు బావిలో ఉదయము పూట వికసించే ఎర్ర కమలములు విచ్చుకున్నవి. రాత్రిపూట వికసించిన నల్ల కలువలు ముడుచుకున్నవి. ఇటుకపొడి రంగు కాషాయపు రంగు కలగలపిన రంగు వస్త్రములను ధరించి, ఆలయ అర్చకులు తమ యొక్క దేవాలయములలోని దేవతామూర్తులను మేల్కొలిపి, వారికి అర్చన చేయుటకు, ఆలయ తలుపుల తాళపు చెవిని పట్టుకొని పోతున్నారు. నీవు మాత్రము ఇంకా నిద్ర లేవకుంటివి. నీవు అందరికన్నా

ముందుగా లేచి, మా వద్దకు వచ్చి, మా అందరిని నిద్ర లేపుతాను, అని రాత్రి చెప్పితివి. మాటలు బాగా నేర్చినదానవు. సిగ్గు లేదా, ఇంకా నీవు నిద్ర లేవలేదు. నిద్ర లేచి రా తల్లి. విశాలమైన చేతులలో తెల్లని శంఖమును, ప్రకాశించు చక్రమును ధరించిన సర్వేశ్వరుడిని, పద్మనేత్రుడు ఆ శ్రీకృష్ణుడిని సేవించి కీర్తించెదము. ఇకనైనా నీవు లేచి వచ్చి మాతో కలువుము. మనలోని పరిపూర్ణమైన వ్యక్తిత్వమును తెలుపుతూ, ఏ పని చేసినా ఆలస్యము చెయ్యకుండా అనుకున్న పనిని అనుకున్నట్లుగా చేయమని ఆండాళ్ తల్లి తొమ్మిదవ గోపికను మేల్కొలిపెను. ఇదియే ఇందులోని అభిప్రాయము.

15. ఓహో, పడుచుదనపు లేత చిలుకల మొలకా, ఇంకనూ నీవు నిద్రపోతున్నావా, లేచి రా. భగవంతుడికి ఇష్టమైనట్లుగా, తమ అహంకారమును తొలగించుకొని, భగవంతుడిపై ఆసక్తితో పరిపూర్ణులై అందరూ వచ్చియున్నారు. భగవంతుడికి ఇష్టమైన అన్నిటిలోను సమర్థురాలిపై వున్న నీవు, నీ చతురపు మాటలు, పాటలతో ఆ భగవంతుడిని కీర్తిస్తూ, నీవు మా ముందు వుంటావు అని అనుకుంటే, ఇంకా నీవు నిద్రనే లేవలేదు. తొందరగా లేచి రా. అందరూ వచ్చారో లేదో లెక్కపెట్టుకొని, కువలయ పీడనము అను మదించిన ఏనుగును చంపిన ఆ శ్రీకృష్ణుడిని, మాయాలోలుడిని కీర్తిస్తూ వ్రతమును చేసే ప్రధాన ఆలయమునకు వెళ్లవలెను. భగవంతుడి విషయమును రుచి చూసినవారు ఎదుటివారు చిన్నవారా, పెద్దవారా, గొప్పవారా లేక పేదవారా అను తారతమ్యములను చూడక అందరిని ఒకే విధముగా గౌరవించవలెను, అని అంటూ ఆండాళ్ తల్లి పదవ గోపికను నిద్ర నుండి మేల్కొలిపెను. ఇదియే ఇందులోని అభిప్రాయము.

16. నందగోపాలుడి భవనమును కాపాడు ద్వారపాలకులారా, భవనముపై జండా రెపరెపలాడుతో ఎగురుతుండగా, పచ్చటి తోరణములు కట్టిన మంగళకరమైన వాకిలిని కాపలా

కాయువారా, శ్రీకృష్ణుడిని సేవించుటకు మేమందరము స్నానము చేసి, పవిత్రమైన మనస్సుతో మా నాయకుడైన నందగోపాలుడి ఇంటికి వచ్చాము. మీరు నిద్ర లేచి, మణి మాణిక్యములతో నిండియున్న తలుపు గడియను తెరువుము. ఆశ్చర్యకరమైన గుణములు కలిగిన నీలరత్న మణివర్ణుడు ఆ శ్రీకృష్ణుడు గొల్లపిల్లలమైన మాకు నోము నోచుకోవడానికి కావలసిన వాయిద్యములను ఇస్తాను అని నిన్ననే మాట ఇచ్చి వున్నాడు. శ్రీకృష్ణుడిపై మాకు ప్రేమ ఎక్కువ అయినది. అందుకే ఆ శ్రీకృష్ణుడిని నిద్ర లేపుటకు మేమందరము వచ్చాము. మీరు వద్దు, అని అనక ఆ తలుపులను తెరవండి అని ఆండాళ్ తల్లి గోపికలతో కలిసి ద్వారపాలకులను మేల్కొలిపెను. ఇదియే ఇందులోని అభిప్రాయము..

17. అందరికి లేదు అనకుండా, సమృద్ధిగా అన్నమును, వస్త్రములను దానము చేయు నందగోపాలా, లేవండి. మీరు ఇచ్చు దానమును గ్రహించుటకు, మాకు మేమే ఎవరూ పిలవకుండా మీ ఇంటికి వచ్చాము. దానము తీసుకునేవారు వుంటేనే కదా, ఇచ్చే దాతకు పేరు వచ్చేది. మాకు అన్నీ తానే అయివున్న మీ కృష్ణుడిని మాకు చూపి, మా విరహ వేదన అనే దాహాన్ని తీర్చండి అని ఆ నందగోపాలుడిని మేల్కొలిపెను. ఆ నందుడి అనుమతితో యశోదా దేవిని లేపుతున్నారు. భగవంతుడిని కొడుకుగా కన్న మంగళ మణి దీపమా, స్త్రీలోకమునకే తలమాణిక్యమైన కులదీపమా, నీవు నిద్ర నుంచి లేచి రావమ్మా. చిగురు వంటి యశోదా, నీ మనస్సు చాలా సున్నితము. ఎవరైనా బాధపడితే నీ ముఖము లేతచిగురు వలె వాడిపోవును. స్త్రీల కష్టసుఖములు స్త్రీలకే తెలుస్తాయి. ఆకాశమంత ఎత్తు ఎదిగి, మూడు అడుగులతో ముల్లోకములను కొలిచిన ఆ త్రివిక్రముడి కళ్యాణగుణములే మాకు జీవనాధారము. మా మనస్సు ఆ స్వామి దర్శనమునకై పరితపిస్తున్నది. మా బాధను అర్థము చేసుకొని, నీవు నిద్ర నుంచి లేచి, ఆ స్వామి మంగళకర సౌందర్య రూప దర్శనమును

మాకు ప్రసాదించు అని యశోదా దేవిని మేల్కొలిపెను. బంగారు కడియమును నీ దివ్య పాదమునకు ధరించిన బలదేవా, ఆదిశేషుడి అవతారమా, రామావతారమున లక్ష్మణుడిగా, కృష్ణావతారమున బలరాముడిగా స్వామిని క్షణమైనను విడువకుండా సేవించుచున్నావు. స్వామి వద్ద కలిగే మధురానుభూతిని అనుభవించిన నిన్ను అతి దీనముగా అర్థిస్తున్నాము. నీవు నిద్ర లేచి, మమ్మల్ని శ్రీకృష్ణుడితో చేర్చుటకు సహాయపడు అని ఆండాళ్ తల్లి గోపికలతో కలిసి బలరాముడిని మేల్కొలిపెను. ఇదియే ఇందులోని అభిప్రాయము.

18. మదించిన ఏనుగును కూడా తన భుజబలముతో ఆపగలిగే శక్తి కలిగిన నందగోపాలుడి యొక్క  కోడలా, ఓ నీళాదేవీ, పరిమళములు వెదజల్లు జుట్టు కలదానా, లేచి తలుపులు తెరువు. మీ మామగారు ఉదార స్వాభావులు. నీవు కూడా మీ మామగారి వలె మా కోరికను తీర్చుము.  నీ అందమైన జుట్టు యొక్క దివ్య పరిమళముల చేత ఆ శ్రీకృష్ణుడిని వశపరచుకున్న నిన్ను చూస్తే,  మాకు చాలా ఆనందము కలుగుతోంది. తలుపులు తెరచి, మాపై దయ చూపుము. నీ కాటుక కన్నుల చాటు నుంచి స్వామిని మాకు చూపించు. నాలుగు దిక్కుల నుండి తెల్లవారినదని కోళ్లు కూస్తున్నాయి. మీ తోటలోని మాధవీలత పందిరి మీద కోయిల కూడా కూస్తున్నది. బంతుల వంటి గుండ్రని వ్రేళ్లు కలిగిన ఎర్ర తామర పువ్వుల వంటి నీ సుతిమెత్తని చేతులతో తలుపులు మెల్లగా తెరవమ్మా. నీ చేతికి గల అందమైన గాజులు గలగలమని చప్పుడు చేయునట్లుగా, నీవు ఆనందముగా తలుపులు తెరువుము. మనకు ప్రియమైన శ్రీకృష్ణుడిని మేము దర్శించి, సేవించు భాగ్యమును మాకు కలుగ చేయి తల్లీ, అను ఆండాళ్ తల్లి గోపికలతో కలిసి లక్ష్మీదేవిని మేల్కొలిపెను. కాని ఆమె లేవలేదు. ఇదియే ఇందులోని అభిప్రాయము.

19. నలువైపులా దీపములు గుత్తులు గుత్తులుగా వెలుగుచుండగా, ఏనుగు దంతముతో చేయబడిన మంచముపై అందము, చల్లదనము, మెత్తదనము, మంచి పరిమళము, తెలుపుదనము అను ఐదు చక్కటి గుణములు కలిగిన మెత్తటి పరుపుపై పరిమళించు అందమైన పువ్వులను జడలో పెట్టుకున్న నీళాదేవితో పవళించి వున్న విశాల వక్షస్థలము కలిగిన ఓ శ్రీకృష్ణా, తెల్లవారినది. నీవు నిద్ర లేచి మాతో ఒక్కమాట అయినా మాట్లడవయ్యా, అని ఆండాళ్ తల్లి తన స్నేహితులతో కలిసి బ్రతిమలాడి లేపిననూ, ఆ శ్రీకృష్ణుడు లేవక పోయేసరికి, మళ్లీ నీళాదేవిని లేపుతున్నారు. కాటుకను పెట్టుకున్న విశాలమైన అందమైన కన్నులు కలిగిన ఓ రాధా, నీవు నీ విభుడి ఎడబాటును ఎంత మాత్రమూ భరించలేక, స్వామిని లేవనీయకున్నావు. మేము ఇంతమందిమి వచ్చి లేపిననూ, లేవకపోయిరి. ఇది నీకు తగదమ్మా. నీవు స్నేహశీలివి, ప్రేమమూర్తివి. ఈ లోకమంతా ఆ స్వామి కంటిచూపులో వుంటే, కాటుకతో నిండిన నీ కంటి చూపులో ఆ స్వామి నిలిచి వున్నారు. మీరు ఇరువురు నిద్ర లేచి మాకు దర్శనమీయండి. మమ్మల్ని రక్షించమని స్వామికి చెప్పి, అనుగ్రహించు తల్లీ, అని ఆండాళ్ తల్లి గోపికలతో కలిసి లక్ష్మీదేవిని మేల్కొలిపెను. ఇదియే ఇందులోని అభిప్రాయము.

20. ముప్పై మూడు కోట్ల దేవతలకు రాక్షసుల వలన కలిగిన భయమును పోగొట్టిన సర్వేశ్వరుడా, నీవే సర్వస్వమూ అని భావించే మమ్మల్ని రక్షించలేవా స్వామీ. మనసా వాచా కర్మణా ఒకే విధముగా వుండే నీతి మార్గము కలవాడా, అందరిని సమానముగా రక్షించే స్వభావము కలిగిన ఆశ్రిత రక్షకుడా, రక్షించుటయే స్వభావముగా గల నీవు, నీవారిమి అయిన మమ్మల్ని రక్షించకుండా వున్నావు. శత్రువులకు భయము కలిగించే నిర్మలమూర్తీ, నిద్ర నుంచి లేచి రా స్వామీ అని ఆండాళ్ తల్లి శ్రీకృష్ణుడిని లేపినది. కృష్ణుడు

లేవకపోయేసరికి, దయామయురాలు అయిన నీళాదేవిని నిద్ర లేపుతున్నారు. ముచ్చటైన కుంకుమభరిణ వలె  సన్నని నడుము కలిగి, పగడపురంగుతో, సౌందర్యములోను, గుణగణములలోను పరిపూర్ణురాలివై వున్న ఓ లక్ష్మీస్వరూపురాలా, నిద్ర నుంచి లేచి రా తల్లి. మా నోమునకు కావలసిన వస్తువులు అయిన అద్దము, వస్త్రములను ఇచ్చి, మా నోముకు మూల పురుషుడు అయిన ఆ దేవాదిదేవుడు శ్రీకృష్ణుడిని లేపి, మాకు పూజించే భాగ్యమును ప్రసాదించు తల్లి. ఆ స్వామి యొక్క స్వరూప జ్ఞానము అనే అనుభవములో మునిగి, ఆ స్వామిలో లీనమయ్యే స్నానము అనే భాగ్యమును ప్రసాదించు అని ఆండాళ్ తల్లి గోపికలతో కలిసి ప్రార్థిస్తూ, నిద్రలేపుతున్నారు. ఇదియే ఇందులోని అభిప్రాయము.

21. ఆండాళ్ తల్లి ప్రార్ధనకు నీళాదేవి మేల్కొని వచ్చి, గోపికలారా, మీరు భయపడకండి. మనము అందరము కలిసి ఆ స్వామిని లేపెదము అని శ్రీకృష్ణుడిని లేపుతున్నారు. పాల పొదుగుల నుండి తీసిన పాలతో కుండలు కుండలుగా నిండి పొంగిపోయేలా ఎక్కువ పాలు ఇచ్చే శ్రేష్టమైన ఆవుల మందను కలిగిన నందగోపుడి ముద్దుల సుపుత్ర రత్నమా, ఓ కన్నయ్య, మేలుకోవయ్యా. వేదములలో కీర్తించబడు పరబ్రహ్మ స్వరూపమా, మహిమాన్విత సంపద కలిగిన ఓ జ్యోతీస్వరూపమా, ఓ పరంజ్యోతీ, నిద్ర లేచి రా స్వామీ. మేము నిన్ను విడువలేక, భక్తి పారవశ్యము వుప్పొంగిపోగా, నీ దివ్య పాదములను ఆశ్రయించి, నిన్ను కీర్తిస్తున్నామయ్యా. నీ వేణుగానము వలన, నీ చేతి స్పర్శ వలన, ఆవులు అపరిమితమైన పాలు ఇస్తున్నాయి. అటువంటి గోసంపద కలిగిన నందకుమారా, లేచి రావయ్యా. ఆశ్రితరక్షకుడవై వున్న నీవు, సాధు రక్షణ కోసమే ఈ లోకములో స్వయముగా గోకులములో పుట్టావు. నీవు రక్షించే భక్తుల యొక్క శత్రువులు, వారి శక్తిని అంతా పోగొట్టుకొని, నీ దివ్య పాదములను ఆశ్రయించినట్లుగా, మేము కూడా మా అహంకార మమకారములను

పోగొట్టుకొని, నీ దివ్య మంగళకర విగ్రహమును మా కన్నులారా, తృప్తితీరా చూడాలి అని, నీ కళ్యాణ గుణములను కీర్తిస్తూ, నీకు మంచి జరగాలి అని మంగళాశాసనములు చేస్తూ, నీ దగ్గరకు వచ్చాము. స్వామీ, నీవు లేచి వచ్చి మమ్మల్ని రక్షించు అని ఆండాళ్ తల్లి గోపికలతో కలిసి మేల్కొలుపుతున్నారు. ఇదియే ఇందులోని అభిప్రాయము.

22.ప్రకృతి రమణీయతతో నిండి, చాలా విశాలముగా వున్న, ఈ గొప్ప భూమండలము నందు వున్న పెద్ద పెద్ద రాజులు మేమే గొప్పవారము అను అహంకారమును, అహంభావమును విడిచిపెట్టి, నీ దయాదాక్షిణ్యములకై వచ్చి, నీ సిం హాసనము చుట్టూ చేరి వుండగా, వారిని నీవు అనుగ్రహించావే. అందుకే మేము కూడా వారి వలె నీ సన్నిధికి వచ్చి వున్నాము. సూర్య కిరణములు సోకగానే మెల్లమెల్లగా వికసించే తామరపువ్వుల వలె, సుందరములైన నీ కళ్లు మెల్ల మెల్లగా తెరచుకొని, మమ్మల్ని ఆనందింపచెయ్యి స్వామి. ఒక చిరు గంటలాగా, విచ్చిన తామర పువ్వులాగా,ముద్దులొలుకు నీ సోగకన్నులను అరమోడ్పుగా విప్పి, మాపై అనుగ్రహముతో ప్రేమగా దయ చూడు స్వామి. నీ వికసిత నయన కమలములతో ఒక్కసారి మమ్మల్ని చూడు స్వామి. సూర్య చంద్రులు ఒక్కసారే ఆకాశములో ఉదయించినట్లుగా ఉండే నీ రెండు దివ్య నేత్రములతో మావైపు ఒక్కసారి చూసి కటాక్షించు స్వామి. నీ కరుణా కటాక్షములతో మా పూర్వ జన్మ పాపకర్మలు అన్నీ పటాపంచలు అయిపోతాయి. అందుకే నీ చల్లని చూపులతో మమ్మల్ని చూడు స్వామి, అని ఆండాళ్ తల్లి గోపికలో కలిసి ప్రార్థిస్తూ, మేల్కొలుపుతున్నారు. ఇదియే ఇందులోని అభిప్రాయము

23. నల్లని అవిసెపువ్వు వంటి శరీరపు కాంతి కలిగిన ఓ శ్రీకృష్ణా, నీలముతో నిండిన అతసీపుష్పములాగా మెరిసే నీలమణి కాంతి కలిగిన చక్కనివాడా, స్వామీ, వర్షాకాలములో గుహలో నిద్రించే మృగరాజులాగా మేల్కొని, రెండు కాళ్లను ముందుకు చాపి,

నిగడదన్నునట్లుగా జూలును విదిల్చి, శరీరమును నలువైపులా కదిలించి, తీక్షణముగా ఒళ్లు విరుచుకొని, సాగి నిలబడి గట్టిగా గర్జిస్తూ, గుహ బయటకు వచ్చు సిం హము వలె గంభీరమైన ఆకారము కలిగిన ఓ శ్రీ కృష్ణా, నీవు కూడా నీ భవనము నుండి మృగరాజువలె బయటకు వచ్చి, వీర సిం హాసనముపై కూర్చొని, దయతో మా ప్రార్థనను ఆలకించి, మేము వచ్చిన పనిని విని, నీ దయాదృష్టితో మమ్మల్ని అనుగ్రహించు స్వామి. నీవు నీ మందిరము నుండి బయటకు వచ్చునప్పుడు, నీ అందమును చూసి ఆనందించవలసినదే కాని వర్ణించడము ఎవరి తరమూ కాదు.  ఆబోతు నడకలోని ఠీవి, ఏనుగు నడకలోని గాంభీర్యము, పెద్దపులి నడకలోని చురుకుదనము, సిం హము నడకలోని వైభోగము అంతా నీ నడకలో మేము చూసి ఆనందించునట్లుగా, నీ భవనము నుండి బయటకు వచ్చి, మమ్మల్ని అనుగ్రహించు స్వామి. నీవు వచ్చి రక్షించే వరకు వేచి వుండే ఓపిక, సహనము మాకు వున్నాయి. నీ ఎడబాటును భరించలేక మేమే నీ వద్దకు వచ్చాము. నీ దర్శనమును కలిగించి మమ్మల్ని అనుగ్రహించు, అని గోపికలతో కలసి ఆండాళ్ తల్లి ఆ భగవంతుడిని ప్రార్థిస్తున్నారు.

24. గోపికలతో కలిసి ఆండాళ్ తల్లి కోటిమన్మథాకారుడైన ఆ సర్వేశ్వరుడి యొక్క జగన్మోహన రూపమును చూడగానే వారు మైమరిచి పోయిరి. ఎదురుగా ఆ స్వామి యొక్క దివ్య మంగళ స్వరూప సౌందర్యము తొణికిసలాడుతూ కనిపించే సరికి, ఆనంద పరవశులై వారు వచ్చిన పనిని మరిచిపోయిరి.  భక్తి భావము ఎక్కువ అయి, అయ్యో, స్వామీ, ఇంత సుకుమార సుందర దివ్య పాదములతో నిన్ను నడిచి రమ్మన్నామే, నీ కాళ్లు ఎంత కందిపోయాయో. వామనావతార సమయమున మూడు అడుగులలోని ఒక అడుగుతో భూమిని కొలవడము వలన ఆ భూమిపై వున్న చెట్లు, పుట్టలు, కొండలు, గుట్టలు అన్నీ నీ

పాదమునకు గుచ్చుకొని, అప్పుడు ఇంకెంత కందిపోయాయో. అందుకే వామనావతారమున ఈ లోకములన్నిటిని కొలిచిన నీ దివ్య పాదములకు రక్ష కావలెను. అందుకే నీ దివ్య పాదములకు మంగళము. రాముడివై లంకకు వెళ్లి, రావణుడితో పాటు రాక్షస జాతిని చంపిన నీ భుజశక్తి జాగ్రత్తగా వుండవలెను. అందుకే నీ విశాల భుజములకు మంగళము. చిన్ని కృష్ణుడివై శకటాసురుడిని తన్ని, చంపిన నీ దివ్య పాదములకు మంగళము. దూడరూపమున వచ్చిన వత్సాసురుడను రాక్షసుడి నాలుగు కాళ్లు పట్టుకొని, వెలగపండు రూపములో వున్న కపిత్తాసురుడను రాక్షసుడి మీదకు విసిరి, ఇద్దరిని ఒకేసారి చంపినప్పుడు, నీ శక్తినంతా కూడగట్టుకొని, భూమిపై అదిమిపెట్టి నిలుచున్న నీ దివ్య పాదములకు మంగళము. గోవర్ధనగిరిని నీ చిటికెన వ్రేలిపై గొడుగుగా ఎత్తిపట్టి, గోకులమును కాపాడిన నీ కళ్యాణగుణములకు మంగళము.

అమ్మో, ఇన్నిసార్లు ఆ స్వామికి మంగళము చెబుతున్నాము. ఇంకేమైన వుందా, మన దిష్టి మళ్లీ ఆ స్వామికి తగులుతుంది. అందుకే స్వామీ, నీ విజయానికి సహాయపడే నీ చేతిలోని బల్లెము, ఆ వేలాయుధమునకు మంగళము. స్వామీ, ఇన్నిసార్లు నీకు మంగళము చెబుతున్నామని అనుకోకు. మా కోరిక తీరిన తరువాత కూడ మేము ఈ విధముగానే నీకు మంగళము పాడెదము. ఇది మా బాధ్యత. నిన్ను కీర్తించి, నీవు ఇచ్చు వాయిద్య విశేష రూప పూరుషార్థమును తీసుకొనుటకై మేము నీ సన్నిధికి వచ్చాము. మమ్మల్ని అనుగ్రహించు స్వామి,అని ఆండాళ్ తల్లి గోపికలతో కలిసి ఆ భగవంతుడిని ప్రార్థిస్తున్నారు. ఇదియే ఇందులోని అభిప్రాయము.

25. ప్రకాశించు శంఖుచక్రాదులతో సర్వేశ్వరుడు అవతరించిన రాత్రి, చెరసాలలో చీకటిలో మగ్గుతున్న తల్లిదండ్రులను విముక్తులను చేసే రాత్రి, యమునానది దారి ఇచ్చిన రాత్రి,

కంసుడి చావుకు మూలమైన రాత్రి, ఆ సమయమున దేవుడే నాకు కొడుకుగా పుట్టాలి అని అనుకున్న దేవకేదేవికి కుమారుడిపై పుట్టి, ఒక్కరాత్రి కూడా అక్కడ వుండక, అదేరోజు రాత్రి యశోదాదేవికి కొడుకుపై పెరిగిన నల్లనివాడా, ఒకరి కడుపున పుణ్యఫలముగా, ఇంకొకరి ఇంట నోముఫలముగా గారాల అల్లరి కృష్ణయ్యగా జన్మించినావు. సర్వ లోకములకు, సర్వ భూతములకు తల్లి, తండి అన్నీ తానే అయివున్నవాడు నాకు కొడుకుగా పుట్టాడు, నేను ధన్యురాలిని అని మురిసినది దేవకీదేవి. సమస్త జీవరాశులను తన కనుసన్నలలో నిలుపుకొని, రక్షించి, శిక్షించే పరమాత్మను అదిలించి, బెదిరించి చేతికి కర్రను, చద్దిమూటను ఇచ్చి, ఆవుల వెంట అడవికి పంపిన యశోదాదేవి, సాయంత్రము ఆవుల వెంట తిరిగి వస్తున్న నీ అందచందములను, నీ లీలలను చూసి, మురిసిపోతూ, నా అంత భాగ్యవంతురాలు ఈ లోకములోనే లేదు అని పరవశించినది ఆ యశోదాదేవి. దేవకీదేవి కడుపు పంటగా, యశోదాదేవి కంటి పాపగా పెరిగిన నా స్వామీ, దానికి కారణము నీ ఆశ్రితవ్యామోహమే కదయ్యా. భక్తులందరూ నిన్ను చూసి ఆనందించాలి అని అనుకుంటే, నీవేమో దాగి దాగి పెరిగావు. నిన్ను చంపాలని ప్రయత్నించిన దుష్టబుద్ధి గల ఆ కంసుడి దగ్గరకు నీవే వెళ్లి చంపావు.

స్వామీ, ఎన్నిరోజుల నుంచో నీ విరహ వేదన వలన కలిగిన బాధ, నిన్ను చేరాలి అని పడిన శ్రమ అంతా, నీ దర్శన భాగ్యము వలన క్షణకాలములో మటుమాయమయ్యి మా శరీరము, మనస్సు దూదిపింజము వలె తేలిక అయ్యి, ఆనందపరవశముతో పులకరించి పోతున్నది. లోకములోని అందరూ లక్ష్మీదేవిని పొందాలి అని అంకుంటే, ఆ మహాలక్ష్మి మాత్రమూ నిన్నే పొందాలి అని అనుకున్నది. అంత గొప్ప భాగ్యము కలిగిన నీ ఆశ్రిత వాత్సల్య కళ్యాణగుణముల వలన ఇంతదూరము నీ వద్దకు రాగలిగాము. నీవు మా గురించి

ప్రత్యేకముగా మళ్లీ జన్మించక్కరలేదు. ఎవరినీ చంపవలసిన పని లేదు. నీ దివ్య మంగళ విగ్రహము యొక్క సేవాభాగ్యమును కలగచేసి, పర అను వ్రత సాధనమును మాకు ఇచ్చినచో, మేము దానిని తీసుకొని ఆనందించెదము, అని గోపికలతో కలిసి ఆండాళ్ తల్లి అడిగెను. ఇదియే ఇందులోని అభిప్రాయము.

26. మాలే, మణివణ్ణా/, గాజుపాత్రలోని దీపమువలె, నీ శరీరపు నీలరత్న మణిమయ ప్రకాశము వలన, నీ పెదవులపైన వున్న చిరునవ్వు వలన, నీ హృదయములో మా మీద నీకు వున్న అభిమానము, ఎంతవుందో మాకు తెలుస్తోంది. భక్తుల మీద నీకు వున్న అభిమానమును తెలుసుకొని, నీవు తప్పక దర్శనము ఇస్తావనే నమ్మకముతో నీ భువన మోహన దివ్య మంగళ విగ్రహ సౌందర్యమును చూడాలనే ఆశతో ఇన్ని లక్షలమందిమి నీ సన్నిధికి వచ్చాము. భక్తి జ్ఞాన వైరాగ్యములతో నిండిన భగవంతుడి యొక్క అనుభవములో ఆనందముగా మునిగి తేలుటయే ఈ మార్గళి స్నానము అని మా పెద్దలు మాకు చెప్పారు. ఏ వరములను, కోరికలను కోరకుండా నిన్నే చేరాలి అనే ఆశతో మా పెద్దలు చేసిన ఈ వ్రతమునే మేము కూడా ఆచరించాము. పర అనే మోక్షమును ఇచ్చు దేవుడివి నీవే, అని మా పెద్దలు చెప్పగా, నిన్ను నమ్మి వచ్చాము. మా వ్రతమునకు కావలసిన వస్తువులను మేము అడుగుతున్నాము. నీ పాంచజన్య శంఖము వలె ఈ భూమి అంతా దద్దరిల్లేటట్లు పెద్ద శబ్దము చేసే పాలనురుగు వంటి తెల్లని శంఖము కావాలి. ఎందుకంటే యమునానదికి స్నానానికి వెళ్ళే ముందు, మంగళకరమైన ఈ శంఖధ్వని వుంటే మా వ్రతమునకు చాలా మంచిది.

చీకటిలో యమునానదికి వెడతాము కాబట్టి, నీ సుదర్శనచక్రపు కాంతి కలిగిన మంచి దీపపు కాంతి కావలెను. అదే విధముగా నీకు, నీ భక్తులకు ఎటువంటి కీడు కలగకూడదు అని అంటూ, వేదమంత్రములు చదివే భాగవతోత్తములు మరియు మంగళవాయిద్యములు

కావలెను, మేమంతా కలిసి ఒకే చోట వ్రతము చేస్తున్నాము కాబట్టి అందరికీ ఆ ప్రదేశము తెలిసేటట్లు ఒక జెండా కావలెను. అక్కడ మంచుపడకుండా చాందినీ అనే గొడుగు కావలెను, అని అడిగిరి. ఇన్ని వస్తువులు ఇవ్వడము చాలా కష్టము అని శ్రీకృష్ణుడు అనగా, చిన్ని పొట్టలో పదునాలుగు లోకములను పెట్టుకొని, చిన్న మర్రి ఆకుపై పవళించిన నీకు కష్టము, అసాధ్యము అన్నది ఉంటుందా స్వామీ. నీ దయ వుంటే, నీవు తలచుకుంటే, అసాధ్యము అంటూ ఏది లేదు. మమ్మల్ని రక్షించాలి అని నీవు అనుకుంటే, ఈ వస్తులన్నిటిని మాకు ఇప్పించు స్వామి అని ఆండాళ్ తల్లి గోపికలతో కలిసి ఆ భగవంతుడిని ప్రార్థిస్తున్నారు. ఇదియే ఇందులోని అభిప్రాయము.

27. గోపికలతో కలిసి ఆండాళ్ తల్లి అడిగిన వస్తువులన్ని అందరికి వినడానికి మామూలుగా కనిపించినా, అంతర్గతముగా వారు వస్తువులను కాకుండా తననే కోరి వచ్చారు అని శ్రీకృష్ణుడు గ్రహించెను. ఈ వస్తువులు మీకు ఇస్తే సరిపోతాయా, అని అడిగెను. ఇవి స్నానమునకు ముందు కావలసినవి, స్నానము అయిన తరువాత ఇంకా కొన్ని కావాలి అని ఆండాళ్ తల్లి అన్నది. ఆ మాటలు విని, అబ్బో, నేను మీ సర్వస్వాన్ని తీసుకోవాలి అని అనుకుంటే, మీరే నా సర్వస్వాన్ని తీసుకొని, నన్నే జయించారే, అని శ్రీకృష్ణుడు అనగా, స్వామీ, నిన్ను తలవము, నిన్ను కొలవము అని అంటూ నీకు దూరముగా వుండి నిన్ను తిట్టేవారిని సులభముగా జయించి ఓడించగలవు. కాని మేము నీ భక్తులము. నీవు తప్ప మాకు ఎవరు లేరు అని అనుకునే మమ్మల్ని, నీవు ఏ విధముగాను ఓడించలేవు. గోవులను కాపాడే గోవిందుడా, నీ వేణుగానమును విని పరవశులమై, మేము గోవిందా, గోవిందా అని నిన్ను కీర్తించకుండా వుండలేక పోతున్నాము. నీ నామముతో మా నోరు తడిసి, సార్థకమైనది. రామావతారములో సీతమ్మవారి ద్వారా హనుమంతుడికి హారమును కానుకగా

ఇచ్చి, సన్మానించినావు. అదే విధముగా ఈ లోకములోని వారందరూ మమ్మల్ని చూసి మెచ్చుకునేటట్లుగా, నీవు మా అమ్మ నీళాదేవి ద్వారా మమ్మల్ని సన్మానించు.

కట్టుకోవడానికి పట్టుచీరలు, చేతికి గాజులు, భుజములకు వంకీలు, చెవులకు దుద్దులు, మాటీలు, తలకు చేమంతి బిళ్ల, కాళ్లకు పట్టీలు ఇవన్నీ స్నానము అయిన తరువాత మేము అలంకరించుకోవడానికి మా అమ్మ నీళాదేవితో ఇప్పించు. మేము కొత్త బట్టలు కట్టుకొని, ఆభరణములతో అలంకరించుకొని వచ్చిన తరువాత, నెయ్యి చేతిలో నుంచి మోచేతిలో వరకూ కారుతూ వుండే పాయసాన్నమును, నీతో కలిసి హాయిగా ఆనందముగా తినే భాగ్యమును ప్రసాదించు స్వామి, అని ఆండాళ్ తల్లి గోపికలతో కలిసి భగవంతుడిని ప్రార్థించినది. ఇదియే ఇందులోని అభిప్రాయము.

28. మీరు అడిగిన భాగ్యమును మీకు ప్రసాదించాలి అంటే, దానికి కావలసిన యోగ్యత, అర్హత, అధికారము మీకు ఉన్నాయా, అని శ్రీకృష్ణుడు అడిగెను. స్వామీ, నిన్నే కీర్తిస్తూ వచ్చాము. మాపై నీకు దయ కలుగుతుంది, అనే ఆశతో వచ్చాము.ఇంతకన్న అర్హత ఏమి లేనివారము అని గోపికలు తెలిపెను. పోనీ ఏమైనా చదువు, జ్ఞానము వున్నాయా, అని అడగగానే, ఆవులను మేపుతూ, పాలు తీసి బ్రతికేవారము. వాటి సేవకే మాకు సమయము సరిపోతుంది. భక్తితో పూజలు చేసే అవకాశము వుండదు, అన్నారు గోపికలు. పోనీ తిరుపతి, శ్రీరంగము వంటి పుణ్యక్షేత్రములు, లేక ఏమైనా దేవాలయములలోని దేవుడి దర్శనము చేసుకున్నారా, అని శ్రీకృష్ణుడు అడిగితే, స్వామీ, ఆవులను మేపుతూ అడవిలో తిరిగేవారము. ఆవులు ఎటుపోతే, అటు వెడతాము. అక్కడ గడ్డి వుంటుంది కాని ఏ గుడి వుండదు, అన్నారు గోపికలు. ఆ అడవులలోనే కదా, మునులు ఆశ్రమాలను నిర్మించుకొని తపస్సు చేస్తుంటారు. పోనీ వాటినైనా చూశారా, అని కృష్ణుడు అడగగా, మేము అడవులలోకి

తపస్సు చేసుకోవడానికి వెళ్లదం లేదయ్యా సామీ, చద్ది అన్నం మూటకట్టుకొని, పచ్చ గడ్డి ఎక్కడ వుంటే అక్కడికి ఆవుల వెనుకనే, ఏ జంతువూ వాటి మేదకు రాకుండా, కాపలా వుంటూ, వాటిని మేపుతుంటాము.

ఆశ్రమంలో కూర్చుంటే ఎట్టా సాగుతుందయ్యా. మేము తీసుకొని వెళ్లిన చద్దన్నం కూడా మేము శుభ్రముగా స్నానము చేసి తినము. ఎప్పుడు ఆకలి వేస్తే అప్పుడే, ఎక్కడ వుంటే అక్కడే కూర్చొని తింటాము. ఇది కేవలము మా జీవితములో, మేము పొట్టపోసుకొని బ్రతికే పని మాత్రమే, అన్నారు అమాయకముగా గోపికలు. మీకు ఇప్పటి కర్మయోగము లేకపోయిన భక్తి, జ్ఞాన యోగములు ఏమైనా వున్నాయా, అని కృష్ణుదు అడగగా, ఏ జ్ఞానము లేని అమాయకపు గోపకులమున పుట్టాము, అని గోపికలు బదులు ఇచ్చారు. అది విని, శ్రీకృష్ణుడు, ఏ పుణ్యము లేకపోతే మీరు కోరిన ఫలితము ఎలా వస్తుంది, అని అనగానే, స్వామీ, మాకు మేముగా సంపాదించుకున్న పుణ్యము ఏ మాత్రము లేదు, అన్నాము కాని, మాకు, మా వంశానికి అనుకోకుండా వచ్చిన పుణ్యానికి ఏ మాత్రము కొదవలేదయ్యా. సాక్షాత్తు ఆ పుణ్యస్వరూపుడవైన నిన్ను, కల్పవల్లి యశోదాదేవి పెంచి, ఆ పుణ్యాన్ని మా అందరికి పంచినది. ఈ లోకములో ఇంతకన్న పుణ్యము ఇంకొకటి లేదు. మాకన్నా అర్హత వున్న భాగ్యవంతులు ఎవరూ లేరు. పుణ్యములకే పుణ్యము అయిన నీవు, నీ అంతట నీవే, కావాలని జ్ఞానహీనులము, అయిన మా గోపకులమున పుట్టావే అంటే, ఇంతకు ముందు మేము తగినంత పుణ్యము చేసే వుండవచ్చు కదా. ఇదియే మా యోగ్యత. స్వామీ, మన మధ్య సంబంధము,  మధ్యలో వచ్చి మధ్యలో పోయేది కాదు, పుట్టుకతోనే వచ్చినది. ఇదియే మా అధికారము.

మన సంబంధము సూర్యుడికి, వెలుతురుకి వున్న సంబంధము. సూర్యుడు లేనిదే వెలుతురు వుండదు. భగవంతుడు లేనిదే జీవులమైన మేము వుండము. సకల కళ్యాణ గుణ పరిపూర్ణుడా, ఏ కొరత లేని గోవిందుడా, ఓ కృష్ణా, మేమందరము గొప్ప గొప్ప తపస్సులు, యజ్ఞములు, యాగములు, పూజలు, పునస్కారములు చేసి నిన్ను పెందే శక్తి లేనివారము, అల్పులము. కాని నువ్వు, గోవర్ధనగిరిని చిటికెన ప్రేలిపై ఎత్తి పట్టుకున్నప్పుడు, మేము భయముతో దూరముగా నిలుచున్నప్పుడు, నీవే దగ్గరకు పిలిచి, నేను గంధర్వుడను, దేవుడిని, రాక్షసుడిని కాను. నన్ను చూసి భయపడకండి. నేను మీ బంధువుని, మీరు దగ్గరకు రండి, అని నువ్వే చెప్పావు. మరచిపోయావా, అని గోపికలు అనగానే, ఓహో, ఇప్పుడు మీకు బంధుత్వము గుర్తుకు వచ్చినదా. మరి నన్ను దేవాదిదేవా, నారాయణా, పద్మనాభా అని పిలిచి, నన్ను పరాయివాడిని చేసినప్పుడు, ఈ బంధుత్వమును మరచిపోయారా. ఓ, అదా నీ కోపము స్వామి. ఏదో చిన్నపిల్లలము, భక్తిభావము ఎక్కువై, నీకు నచ్చని పేర్లతో నిన్ను పిలిచాము. మమ్మల్ని క్షమించు, అని ఆండాళ్ తల్లి అన్నది. సరే మిమ్మల్ని క్షమిస్తాను, కాని మీకు ఈ ఫలమును ఏ విధముగా ఇచ్చారు అని ఎవరైనా అడిగితే, ఆ మాట శ్రీకృష్ణుడు అనే లోపలే, స్వామీ, నువ్వు ఇవ్వదలచుకున్నచో అడ్డుపడేవారు ఎవరున్నారు. మేము నీ సొత్తు. నీవు మా స్వామివి, అని గోపికలతో కలిసి ఆండాళ్ తల్లి మనకు సమస్తమూ ఆ భగవంతుడే అని నిష్కర్షగా నిర్ధారణ చేస్తూ తెలిపినది. ఇదియే ఇందులోని అభిప్రాయము.

29. స్వామీ, మేము సుకుమారులము, పైగా చిన్నపిల్లలము. అయినా ఇంత చలిలో, చాలా చీకటిలో, ఎంత కష్టమైన వచ్చి, నిన్ను సేవించాము. నీవు వైకుంఠము నుండి గోకులానికి ఒక్క జన్మకు మాత్రమే వచ్చావు. కాని మేము నిన్ను జన్మ జన్మలకూ సేవించాలని నీ

సన్నిధికి వచ్చాము. నీవు వైకుంఠములో వున్నంతవరకూ జన్మ లేనివాడవు. అక్కడ నీకు అనంతుడు, గరుత్మంతుడు మొదలైనవారు ఎంతోమంది సేవలు చేస్తారు. కాని ఇప్పుడు జన్మలు లేని నువ్వు, గోకులములో పుట్టావు. అందుకే నీకు సేవలు చెయ్యాలని మేము వచ్చాము. మేము మా బంధువుల నందరిని వదిలిపెట్టి, పెద్దలు పెట్టిన నియమ నిబంధనలను, కట్టుబాట్లను సడలించుకుంటూ, నీ సేవచేస్తూ, నిన్నే పొందాలని వచ్చిన మా ఆర్తిని చూసి, మాపై దయతో నీవు కరిగిపోవాలి. మమ్మల్ని పిలిచి నీవు ఆజ్ఞాపించి, మా చేత నీకు దగ్గరగా వుండే నీ అంతరంగ సేవలు అయిన ప్రసాదపాత్రను తీసుకొని రావడం, హారతిని ఇవ్వడము, ఉత్తరీయమును అందించడము, గాలి కొరకు వింజామరను వీచడం, తాంబూలము అందించడము మొదలగు ఏకాంత సేవలను మా చేత చేయించుకోవాలి, అని గోపికలు అడగగా, శ్రీకృష్ణుడు, అలాగే మీకు నచ్చిన సేవలు చేద్దురు కాని, ముందు మీరు అడిగిన పర అనే వాయిద్యమును తీసుకోండి ఇదిగో.

వెంటనే గోపికలు, మా వాళ్లందరిని వదిలిపెట్టి, నిన్ను చేరాలని సంకల్పించిన మా మీద, ఎవరికీ అనుమానము, సందేహము రాకుండా, వారెవరూ మాకు అడ్డుపడకుండా మాత్రమే మేము ఆ వాయిద్యమును అడిగాము. అంతేకాదు, అప్పుడు నీ మీద భక్తితో మా హృదయములోని భావాన్ని మేము సూటిగా వివరించలేక పోయాము. కాని ఇప్పుడు చెబుతున్నాము. ఏనాటికి మేము నీతోనే వుండిపోవాలి. నీవు ఎక్కడ వుంటే, మేము అక్కడే సేవలు చెయ్యాలి. నీకు మెలుకువలోను, నిద్రలోను సర్వసేవలని చేసే లక్ష్మణుడి వలె మేము ఎల్లప్పుడు నీ చెంతనే వుండిపోవాలి, అని ఆండాళ్ తల్లి తన పాల వంటి స్వచ్ఛమైన మనస్సును ఆ భగవంతుడి పాదములపై పెట్టి, ఆ భగవంతుడిపై వున్న భక్తి అనే వెన్నను

చిలికి, తను ఆస్వాదించి ఆనందించి, ఆ ఆనందమును మనను కూడా అనుభవించమని చెప్పినది. ఇదియే ఇందులోని అభిప్రాయము.

30. ఆండాళ్ తల్లి భక్తికి మెచ్చి, శ్రీరంగములో కొలుపై వున్న ఆ వైకుంఠనాథుడు శ్రీరంగనాథుడే స్వయముగా పల్లకీని పంపి, ఆమెను వివాహమాడెను. తనతో పాటు ప్రతీ దేవాలయములోను ప్రతిష్ట చేసెను. అందుకే ఈ 30వ పాశురములో ఫలశ్రుతిగా, ఈ తిరుప్పావై వ్రతమును ఆచరించినా లేక ఈ 30 పాశురములను మనస్ఫూర్తిగా చదివినా కలిగే ఫలితమును గురించి తెలిపారు. కూర్మావతార సమయమున మందర పర్వతముతో, వాసుకీ అనే పామును త్రాడుగా చేసుకొని, దేవతలు రాక్షసులు అలలతో నిండియున్న పాలసముద్రమును చిలికినప్పుడు, అమృతముతో పాటు ఉద్భవించిన లక్ష్మీదేవిని పొందిన మాధవుడు, బ్రహ్మరుద్రులను సృష్టించిన సర్వేశ్వరుడు, రేపల్లెలో శ్రీకృష్ణుడిగా అవతరించినప్పుడు, వివిధ ఆభరణములను ధరించిన చంద్రముఖులైన గోపికలు, తమ సర్వస్వమూ ఆ శ్రీకృష్ణుడే అని ఆ స్వామిని సేవించి, ఆ స్వామికి శుభము కలగాలి అని మంగళమును పాడి, పరతత్వము, పరమపదము అయిన ఆ వైకుంఠమునకు వెళ్లు మార్గమును చూపు పర అనే వాయిద్యమును ఈ లోకములోని ప్రజలందరి కొరకు మరియు తమ కొరకు అడిగి, ఆ భగవంతుడి యొక్క సేవాభాగ్యమును పొందిరి.

ఇప్పుడు అదే విధముగా, విల్లిపుత్తూరు నగరములో, తామర పూసల మాలను మెడలో ధరించిన భట్టనాథుడు అను పెరియాళ్వారుడి కూతురు అయిన ఆండాళ్ తల్లి మన గోదాదేవి అంధ్రప్రదేశ్, తమిళనాడు రాష్ట్రములు కలిసి వున్నప్పటి భాష అయిన ద్రవిడ భాషలో ముప్పై పాశురములను మాలగా కట్టి, ఆ పాశురమాలను ప్రజలకు ఇచ్చి, తన సర్వస్వమూ తానే అనుకున్న ఆ సర్వేశ్వరుడిని వివాహమాడెను. ఎవరు ఈ ముప్పై పాశురములను క్రమము

తప్పకుండా,  ప్రతీ సంవత్సరము  మార్గశిర మాసమున  పండు వెన్నెలల యందు వచ్చే ధనుర్మాసమున వ్రతముగా చేస్తారో, వారు తప్పకుండా, ఆనాడు గోపికలు, ఈనాడు ఆండాళ్ తల్లి  పొందిన  ఫలితమునే  పొందెదరు. అంతే కాకుండా వ్రతములా  చెయ్యలేనివారు, మనస్ఫూర్తిగా చదివినచో వారికి ఆ పుండరీకాక్షుడు, పర్వత శిఖరముల వంటి చేతులు కలిగిన శ్రీవల్లభుడు,  చతుర్భుజుడు అయిన  ఆ  శ్రీమన్నారాయణుడు ఎల్లవేళలా వారికి ఆనందమును, సుఖసంతోషములను ప్రసాదించును.

గోదాదేవి దివ్య పాదములకు నమస్కారములు.

*******************

6.  గోదాదేవి వివాహమాడిన ఆ శ్రీరంగములోని శ్రీరంగనాథుడిని

చూసిన అనుభూతి పద్యాల అర్థ రూపము.

..............

అక్కడ శ్రీరంగములో ఆ శ్రీరంగనాథుడు ఎలా శయనించి వున్నడో తొండరడిప్పొడి ఆళ్వారు చెబుతున్నారు.

1.పడమటి దిక్కున శిరస్సును వుంచి, తూర్పు దిక్కున పాదములను చాపి, ఉత్తరపు వారికి వీపు చూపిస్తూ, దక్షిణ దిక్కున వున్న లంకను చూస్తూ, ఆదిశేషుడిపై శయనించిన సముద్రవర్ణపు సర్వేశ్వరుడు, నా స్వామి  శ్రీరంగనాథుడిని చూసిన ఆనందములో,  నా శరీరము కరుగుతున్నది. అయ్యో, ఈ ఆనందములో ఏమి చేయాలో నాకు తోచడం లేదు.

*****************

తిరుప్పాణాళ్వారు రచించిన అమలనాదిపిరాన్ .

....................

2. పరమపావనమైన పవిత్రమూర్తీ, ఆదిమధ్యాంత రహితుడా, దేవాదిదేవా, నీ భక్తులకు నన్ను దాసుడిగా చేసిన దోషరహితుడా, అందమైన అరవిరిసిన పూలతోటలతో నిండిన కమనీయ వేంకటాద్రిపై కొలువై వున్న వేంకటేశ్వరుడా, హేయగుణరహితుడా, శేషశయ్యపై శయనించిన శేషశయనుడా, వైకుంఠములోని శ్రీమన్నారాయణుడా, ఈ భూమిపై పెద్ద ప్రహారీ గోడల నడుమ పెద్ద పెద్ద ప్రాకారపు గాలి గోపురములతో నిండిన శ్రీరంగమునందు శ్రీరంగనాథుడిగా మమ్మల్ని తరింపచేయుటకే కొలువై వుంటివా. ఎంత గొప్ప భాగ్యము స్వామి. సుందరమైన నీ దివ్య మంగళ విగ్రహమును తిలకించిన నా కన్నులు ఎంత గొప్పవి. నా కన్నులలో నీ దివ్య పాదపద్మములను ఎప్పుడూ విడువక భద్రముగా దాచుకొనెదను.

3. బ్రహ్మాండమైన ఆకాశమును అంటునట్లుగా పెరిగి, ఆకాశములోని నక్షత్రములను అద్భుతమైన కిరీటముగా ధరించి, వామనుడవై లోకములన్నిటిని కొలిచితివి. రాముడవై ధృడమైన కోదండమను విల్లుతో యుద్ధమున ఎదురు నిలిచి, రావణుడు మొదలగు క్రూర రాక్షసులను చంపితివి. శ్రీరంగనాథా, ఇప్పుడు పరిమళ సువాసనలు వెదజల్లు అందమైన తోటలు కలిగిన శ్రీరంగములో, పీతాంబరధారివై కొలువై వున్న సుందరమైన నీ దివ్య మంగళ విగ్రహమును దర్శించిన నా మనస్సు సంతోషముతో కరుగుచున్నది. అది నన్ను విడిచి, నీ దగ్గరకే వచ్చుచున్నది.

4. కోకొల్లలుగా కోతులు తిరిగే వేంకటాద్రిపై నిండుగా కొలువై వున్న వేంకటేశ్వరా, శ్రీరంగమున సాయంసంధ్య కాంతిరంగుతో మెరిసే వస్త్రమును ధరించి శేషశాయిపై కొలువై వుంటివి. నీ అందమైన నాభి నుంది బ్రహ్మదేవుడిని సృష్టించితివి. ఇంత మోహనకరమైన నీ దివ్య మంగళ విగ్రహమును చూసిన నా మనస్సు, నా శరీరమును వదిలిపెట్టి, నీ వద్దకు వచ్చి అక్కడే వుండిపోయినది.

5. తుమ్మెదలు తియ్యగా రాగాలాపన చేస్తూ, నెమళ్లు పురివిప్పి, పులకరించి ఆడుతూ తిరిగే విశాలమైన సుందర వనములు కలిగిన శ్రీరంగములో కొలువై వున్న శ్రీరంగనాథా, యశోద నిన్ను త్రాడుతో రోటికి కట్టినప్పుడు కలిగిన ఒరిపిడికి, నీ కడుపుపై పడిన ఉదరబంధనపు మచ్చ, అందమైన నీ దివ్య శరీరమునకు మరింత అందమును తెచ్చినది. నీ సుందరమైన దివ్య మంగళ విగ్రహము నా మనస్సులో స్థిరముగా నిలిచిపోయినది.

6. ఏ జన్మలో నేను ఏ ఘోరతపస్సు చేసితినో, నాకు తెలియదు. కాని భారమైన నా పూర్వజన్మ పాపకర్మలను పోగొట్టి, నన్ను నీ భక్తుడిగా చేసుకొంటివి. అంతేకాక, లక్ష్మీదేవికి నిలయమై, నిండైన బంగారు ఆభరణములతో ప్రకాశించు నీ పవిత్రమైన వక్షస్థలమును దర్శించే భాగ్యమును ప్రసాదించితివి. శ్రీరంగనాథా, భక్తుడికి ఇంతకన్నా గొప్ప భాగ్యము వున్నదా. ధన్యుడనయితిని స్వామీ.

7. అందమైన రంగురంగుల సీతాకోక చిలుకలు గుంపులు గుంపులుగా తిరుగు తోటలు కలిగిన శ్రీరంగమున శయనించిన శ్రీరంగనాథా, మోహినీ అవతారుడవై భస్మాసురుడి నుంచి శివుడిని రక్షించితివి. యశోదా దేవికి అండ పిండ బ్రహ్మాండములను చూపించిన నీ నోటిని, నాకు చూసే భాగ్యమును ప్రసాదించితివా స్వామీ.

8. చేతులలో సుడిగల శంఖము, ప్రకాశించు చక్రము, మెడలో పరిమళించు తులసిమాలలు, తలపై నిండైన అద్భుత కిరీటమును ధరించి, పెద్ద పర్వతము వంటి ప్రకాశవంతమైన దివ్య శరీరమును కలిగి, శేషశయ్యపై ఒక పక్కకి ఒరిగి, వయ్యారముగా పడుకున్న శ్రీరంగనాథా, చిద్విలాసము చిందించు నీ పగడపు అధరమును చూస్తుంటే, నా మనస్సు పరవశించి పోతున్నది.

9. ఆదికారణుడవు నీవు, నరసిం హావతారములో అతి బలవంతుడవై, దేవతలందరూ జయించలేని హిరణ్యకశ్యపుడి వక్షమును చీల్చితివి. శ్రీరంగనాథా, కరుణతో నిండి, మిలమిల మెరిసే నీ విశాలమైన పెద్ద కన్నులు నన్ను, గుచ్చి గుచ్చి చూస్తున్నాయి. నీ కరుణా కటాక్షములను పొందిన నేను, చాలా అదృష్టవంతుడిని.

10. ప్రళయకాలమున లోకములను ఏడింటిని మ్రింగి, పెద్ద మర్రి ఆకుపై, సాటి లేని బాలుడవై పడుకున్న శ్రీరంగనాథా, శ్రీరంగములో శేషశాయివై శయనించిన నీవు, అమితమైన అందముతో తేజోవిరాజితుడవైతివి. సాటి లేని నీ దివ్య మంగళ సౌందర్య శరీరపు కాంతితో, నీ మెడలో మెరిసే విలువైన వజ్ర వైఢూర్య మణిహారములు, ముత్యాలసరములు పోటీపడలేక పోతున్నాయి. ఏమి భాగ్యము స్వామి నాది, కలలో అయినా ఊహించనంత అదృష్టము. ఇంత అందమైన, అద్భుతమైన, మంగళకరమైన నీ దర్శన భాగ్యమును భరించుట, నా హృదయమునకు కష్టమవుతున్నది. అనుకోకుండా దొరికిన ఇంత గొప్ప భాగ్యమును ఒక్కసారిగా అనుభవించడం వలన, నా ఈ చిన్ని గుండె తట్టుకోలేక విలవిలలాడుతున్నది.

11. మేఘవర్ణుడా, వెన్న తిన్న చిన్నికృష్ణుడా, నా మనస్సులో కొలువై వున్న నా స్వామీ, శ్రీరంగశయనుడా, నీవు అండ పిండ బ్రహ్మాండాపధివి,నా అమృత భూతుడివి. నీ దర్శన భాగ్యముతో నా జన్మ చరితార్థమైనది. భువన మోహన సుందరుడవైన నిన్ను చూసిన ఈ

కళ్లు వేరొకటిని చూచుటకు ఇష్టపడుట లేదు. ఇంత అందమైన అద్భుత సౌందర్య సంపదలో, నన్ను నేనుగా కరిగించుకునే భాగ్యమును ప్రసాదించు స్వామీ.

తిరుప్పాణాళ్వారుడి దివ్యపాదములకు నమస్కారములు.

*********************

## 7. ఆళ్వారులు రచించిన పాశురాలలోని అద్భుతమైన పద్యాల అర్థ రూపము.

....................

1. ముందు భగవంతుడి గురించి ఆరు పద్యాల అర్థమును చూద్దాము. ఆ తరువాత

2. శ్రీకృష్ణుడు చిటికెన వ్రేలిపై ఎత్తిన గోవర్ధన గిరి అందాన్ని చూద్దాము.

3. నమ్మాళ్వారు అనుగ్రహించిన కడల్ జ్ఞాలంలోని పది పద్యాలలో వున్న భగవద్గీతాసారాన్ని చూద్దాము. ఈ పది పాశురాలలోని గొప్పదనము ఏమిటంటే, ఒకటే పదము, ప్రతీ వాక్యానికి ముందు పదమై, ఆ పాశురములో ఎనిమిదిసార్లు వస్తుంది. ఒక పాశురమును కూడా చూద్దాము.

4. అంతేకాదు, నమ్మాళ్వారు ఆ భగవంతుడి యొక్క ఘటనాఘటన సామర్థ్యములను గురించి ఎంత గొప్పగా వర్ణించారో, తన నల్ కురవుంలోని పది పద్యాల భావాలను గమనిస్తే తెలుస్తుంది. అందుకే ఆయన అనుగ్రహించిన తిరువాయిమొజి అంత అద్భుతమైన కావ్యఖండముగా రూపొందినది.

5. పెరియాళ్వారుడు అనుగ్రహించిన శ్రీకృష్ణుడి వేణుగాన సమ్మోహనా పద్యాల అర్థ రూపము.

6. ఆ భగవంతుడిని పొందిన తిరుమంగై ఆళ్వారుడు, తన శిలైయిలంగ పొన్నాజిలోని తొమ్మిది పద్యాలలో, ఒక కూతురు పడుతున్న ఆర్తిని తెలుపుతూ, ఒక తల్లి పడే ఆవేదనను చూపిస్తూ, ఎంత గొప్పగా ఆ భగవంతుడిని వర్ణించారో.

7. భగవంతుడు తనను మెచ్చి వచ్చునా, అని మన ఆండాళ్ తల్లి తన తెల్లియార్ లోని పది పద్యాలలో జాతకచక్రమైన కూడిక చక్రాన్ని అడుగుతున్నది. అప్పటి రోజులలో కూడిక చక్రమనే జాతక చక్రము అమలులో వుండేదట. ఈ జాతక విధానములో నేలపై కొన్ని గీతలను గీసి, ఆ గీతలను లెక్కించి, తొమ్మిదితో భాగించగా శేషము సరి సంఖ్య వచ్చినట్లయితే, మనము అనుకున్న పని జరుగునని, శేషము బేసి సంఖ్య వచ్చినచో జరగదని అప్పటి ప్రజల నమ్మకము. ఆ విధానమునే మనము ఇక్కడ చూద్దాము.

8. ఆఖరి మూడు పద్యాలలో ఎటువంటి పరిస్థితులలోనైనా సరే, ఆ భగవంతుడినే ఆశ్రయిద్దామని, తెలిపే పద్యాలతో ఈ భాగాన్ని ముగిద్దాము.

..............................................

భగవంతుడి గురించి తెలిపే పద్యాల అర్థ రూపము.

1. క్షీరసముద్రమున శయనించిన శ్రీమన్నారాయణుడా, నీవు వైకుంఠములో వున్నావు. నాలుగు వేద శాస్త్రములలో ఇమిడి వున్నావు. భూమిపైన వున్న తిరుమల వేంకటాద్రిపైన కొలువై వున్నావు. అయినా సరే, అన్నివైపులా వ్యాపించి వున్న నీ రూపమును కాని, నీ గొప్పతనమును కాని ఎంతకాలము ప్రయత్నించినా ఎవ్వరూ తెలుసుకోలేరు.

2. శ్రీమన్నారాయణుడా, నీవు అన్ని లోకములను సృష్టించితివి. అన్నిటిని నీలోనే ఇముడ్చుకుంటివి. తిరిగి నీవు ఈ లోకములోనే అవతరించితివి. అన్ని లోకములూ నీ శరీరమే అనునట్లుగా వున్న నీ అసాధారణ విశ్వ రూపమును, ఆశ్చర్యకరమైన నీ లీలలను ఎవరు తెలుసుకోగలరు.

3. శ్రీమన్నారాయణుడా, అద్భుతమైన నీ దివ్య శరీరపు రంగు తెలుపు, నలుపు, పసుపు అని మాకు తెలియదు. జ్ఞానవంతురాలైన ఒక్క ఆ సరస్వతీదేవి మాత్రమే లక్ష్మీపతివి అయిన నీ వైభవమును చక్కగా కీర్తించగలదు.

4. శ్రీమన్నారాయణుడా, వైకుంఠములోని క్షీరసాగరములో శేషశయ్యపై శయనించిన పరవాసుదేవ మూర్తివై, సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధుడను ఈ ప్రపంచములోని మూడు వ్యూహ మూర్తులవై, ప్రకృతి పురుషుడు అవ్యక్తము కాలము అని అందరికి తెలిసిన నాలుగు మూర్తులవై, విలక్షణ రూపములైన మత్స్య కూర్మ వరాహ రామకృష్ణాది దశావతారముల అద్వితీయ మూర్తులవై, పుణ్యము అనే ఒకే ఒక రూపము కలిగిన నీవు, అనేక పుణ్య క్షేత్రములలో స్వయంభువుడవై వెలసితివి. అంతే కాకుండా, వేదములలోని మంత్రముల అర్ధము తెలియని వారి కొరకు, నీవు అన్ని ప్రదేశములలోను, అందరూ నిన్ను కొలిచి తరించే విధముగా, అన్ని దేవాలయములలోని దేవతా మూర్తులుగా కొలువై వుంటివా దేవా, ఆదిదేవా.

5. చెవి, నోరు, కన్ను, ముక్కు, శరీరము అని శరీరభాగములైన ఐదు ఇందియములై, భూమి, గాలి, నీరు, నిప్పు, ఆకాశము అను పంచ భూతములై గొప్పవైన జ్ఞానము, యాగము, ధర్మము అన్నీ తానే అయివున్న శ్రీమన్నారాయణుడిని, వరాహావతారుడై వెలిసిన ఆ భగవంతుడిని చేరు ఉపాయము మీకు తెలుసునా?

6. మనలోని పంచేంద్రియములను అదుపులో పెట్టుకొనుట, అను తలుపులను గట్టిగా మూసి, జ్ఞానము అనే పెద్ద తాళమును వేసి, వేదములను చక్కగా అర్థము చేసుకొని, ఆచరించువారు భువన మోహన సౌందర్య సుకుమార కళ్యాణ గుణ సంపదాకారుడు, సముద్రవర్ణుడైన ఆ శ్రీమన్నారాయణుడిని చేరి ఎల్లప్పుడూ ఆనందమును అనుభవించెదరు.

.......................

శ్రీకృష్ణుడు తన చిటికెన ప్రేలిపై ఎత్తిన గోవర్ధన గిరి అందాన్ని తెలిపే పద్యాల అర్థ రూపము.

................

7. ఇంద్రుడు పగతో వర్షమును కురిపించినప్పుడు, నైవేద్యముగా వండిపెట్టిన అన్నపు గుట్టను, పెరుగు బావిని, నేతి తొట్టిని అన్నిటిని స్వీకరించిన గోవర్ధన గిరిని, అలల మెరుపుతో కూడిన సముద్రవర్ణపు శ్రీకృష్ణుడు తన చిటికెన ప్రేలిపై ఎత్తినప్పుడు, ఆ పర్వతము ఏ విధముగా వున్నదంటే, గుండ్రని విశాలమైన కన్నులు కలిగిన అమాయకపు లేడిపిల్ల, వేటగాడి వలలో చిక్కినప్పుడు, దానిని పట్టుకొని వచ్చి, వేటగాడు తన భార్యకు ఇవ్వగా, ఆమె ఆ లేడిపిల్లను చాలా జాగ్రత్తగా తన ఒడిలో పెట్టుకొని, దూది వుండలను పాలలో ముంచి, పాలు పట్టినప్పుడు, ఆ లేడి పిల్ల వున్నట్లుగా వున్నది, చిన్నికృష్ణుడు ఎత్తిపట్టుకున్న ఈ గోవర్ధనమనే గొడుగు.

8. ఇంద్రుడి ఆజ్ఞతో ఆకాశమంతా దట్టముగా కమ్ముకున్న బలమైన నీలి మేఘములు కోపముతో విడువబడినవై వచ్చి, ఏడు రోజులు కుండపోతగా వర్షించినప్పుడు, ఆ వానను అడ్డగించుటకై మధుసూధనుడు ఎత్తిపట్టుకున్న గోవర్ధన గిరి ఏ విధముగా వున్నదంటే, ఆపదను సహించని ఒక ఈనిన ఆడ ఏనుగు, తన పిల్లను సిం హము వెంబడించి దగ్గరగా

వచ్చినప్పుడు, తన పిల్లను కాళ్ల మధ్య వుంచుకొని, ఎదిరించి యుద్దము చేసే విధముగా వున్నది, చిన్ని కృష్ణుడు ఎత్తిపట్టుకున్న ఈ గోవర్ధనమనే గొడుగు.

9. కాటుకతో సింగారించిన పెద్ద కన్నుల పుణ్య గోపికలు, గోపాలురు, ఆలమంద ఏక కంఠముతో మొరపెట్టి "మమ్మల్ని రక్షించు" అని చిన్నికృష్ణుడిని అర్థించినప్పుడు, ప్రకాశించే చక్రహస్తముతో ఆ స్వామి ఎత్తిపట్టిన గోవర్ధన గిరి ఏ విధముగా వున్నదంటే, తమ స్త్రీలను, గరిక మేయు లేళ్ల గుంపును రక్షించే కొండజాతివారు బాణమును విడుచు సమయము నందు విల్లును ఎక్కుపెట్టినప్పుడు, ఆ విల్లు ఒంగిన విధముగా వున్నది, చిన్నికృష్ణుడు ఎత్తిపట్టుకున్న ఈ గోవర్ధనమనే గొడుగు.

....................

భగవద్గీతా సారాన్ని తెలిపే పద్యాల అర్థ రూపము.

....................

ఒక పాశురము

కాంగిన్ర నిలమెల్లాం యానే ఎన్నుం

కాంగిన్ర విశంబెల్లం యానే ఎన్నుం

కాంగిన్ర వెంతీఎల్లం యానే ఎన్నుం

కాంగిన్ర ఇక్కాత్తెల్లం యానే ఎన్నుం

కాంగిన్ర కడల్ ఎల్లం యానే ఎన్నుం

కాంగిన్ర కడల్ వణ్ణన్ ఏరక్కొలో

కాంగిన్ర ఉలక త్తీరక్కు ఎన్ శొల్లుకేన్

కాంగిన్ర ఎన్ కారిక్కై శెయ్ కిన్రవే.

*********************

10. సముద్రమును, భూమిని సృష్టించినది నేనే అనును. సముద్రమునకు,భూమికి అంతర్యామిని నేనే అనును. సముద్రమును, భూమిని నాలో కలుపుకున్నది నేనే అనును. సముద్రమును, భూమిని విడదీసినది నేనే అనును. సముద్రమును, భూమిని మ్రింగినది నేనే అనును. సముద్రమునకు, భూమికి అధిపతి అయిన ఆ శ్రీకృష్ణుడిని నా బిడ్డ చూసినప్పుడు, సముద్రములోని భూమిపై వున్న నా కుమార్తె పొందిన అవస్థను, సముద్రములోని భూలోక వాసులైన మీకు, ఏ విధముగా చెప్పను.

11. నేర్చుకునే వేదవిద్యకు మూలము, నిర్వాహకుడను నేనే అనును. నేర్చుకునే వేదవిద్యను రూపొందించినది నేనే అనును. నేర్చుకునే వేదవిద్య తాత్పర్యము, ఫలితము కూడా నేనే అనును. నేర్చుకునే వేదములలో ప్రతిపాదించిన వేదవేద్యుడైన ఆ శ్రీకృష్ణుడిని నా బిడ్డ చూసినప్పుడు, నేర్చుకునే వయస్సు గల నా కుమార్తె పొందిన అవస్థను, నేర్చుకునే వేదవిద్యలు గల మీకు, ఏ విధముగా చెప్పను.

12. కనిపించే ఈ భూమి, ఆకాశము, అగ్ని, వాయువు, సముద్రము అన్నీ నేనే అనును. కనిపించే సముద్రవర్ణుడైన ఆ శ్రీకృష్ణుడిని నా బిడ్డ చూసినప్పుడు, కనిపించే నా కుమార్తె పొందిన అవస్థను, కనిపించే మీకు, ఏ విధముగా చెప్పను.

13. అందరూ చేసే పనులు, చేయగలిగిన పనులు అన్నీ, నేనే అనును. చేసేవారితో పనులు చేయించునది, నేనే అనును. ఇంతకు ముందు చేసిన పనులు, నేనే అనును. చేసిన వాటి ఫలితమును తీసుకునేది కూడా నేనే అనును. ఎర్ర తామర కన్నుల ఆ శ్రీకృష్ణుడిని నా బిడ్డ చూసినప్పుడు, చిన్న లేడికూన వంటి ఎర్రదొండపండు అధరపు నా కుమార్తె పొందిన అవస్థను, పుణ్యాత్ములైన మీకు, ఏ విధముగా చెప్పను.

14. కదిలే భూమిని రక్షించునది, నేనే అనును. కదలని గోవర్ధనగిరిని ఎత్తినది, నేనే అనును. కదిలే రాక్షసులను చంపినది, నేనే అనును. ఉపాయముతో ఐదుగురు పాండవులను కాపాడినది, నేనే అనును. సంకల్పించి, కదిలే కడలిని చిలికినది, నేనే అనును. చలింపని సముద్రవర్ణుడైన ఆ శ్రీకృష్ణుడిని నా బిడ్డ చూసినప్పుడు, నా బంగారు తల్లి తన చలించే మనస్సులో పొందిన అవస్థను, చలింపని లోకులైన మీకు, ఏ విధముగా చెప్పను.

15. వెదుళ్ల గుంపుతో నిండిన గోవర్ధనగిరిని ఎత్తినది, నేనే అనును. ఎద్దుల గుంపును చంపినది, నేనే అనును. ఆవుదూడల గుంపును మేపినది, గోవుల గుంపును కాసినది, నేనే అనును. గోపాలకుల గుంపులో గొప్పవాడిని, నేనే అనును. దేవతల గుంపుకు నాయకుడైన ఆ శ్రీకృష్ణుడిని నా బిడ్డ చూసినప్పుడు, విల్లు వంటి కనుబొమ్మల నా కుమార్తె పొందిన అవస్థను, ఈటెకన్నుల మీకు, ఏ విధముగా చెప్పను.

16. ఈ లోకములో నాకు బంధువులు ఎవరూ లేరు, అనును. కాని అందరూ నాకు బంధువులు, అనును. అందరిని బంధువులుగా చేయునది, నేనే అనును. బంధువులు కాని వారిని శత్రువులుగా చేయునది, నేనే అనును. నన్ను ఆశ్రయించిన వారికి బంధువును నేనే, అనును. సాటిలేని ఆశ్చర్యుడైన ఆ శ్రీకృష్ణుడిని నా బిడ్డ చూసినప్పుడు, నా కుమార్తె పొందిన అవస్థన చూసి, నేను పడిన బాధను, బంధువులైన మీకు, ఏ విధముగా చెప్పను.

17. వేదములలో చెప్పబడే త్రినేత్రపు శివుడు, చతుర్ముఖ బ్రహ్మ, దేవతలు, ఇంద్రుడు, ఉపదేశించే వసువులు, అందరూ, నేనే అనును. వేదప్రతిపాద్యుడైన మేఘవర్ణపు శ్రీకృష్ణుడిని నా బిడ్డ చూసినప్పుడు, సుందర సుకుమారపు తీగవంటి నా కుమార్తె పొందిన అవస్థను, ఈ ప్రపంచములో చెప్పబడే లౌకిక జ్ఞానులైన మీకు, ఏ విధముగా చెప్పను.

18. క్రూర పాపములు ఏవీ అంటని వాడను నేను, అనును.  క్రూర పాపములను జరిపించునది, చేయించునది మరియు ఆ పాపముల నుండి రక్షించునది నేను, అనును. క్రూర రాక్షసుడైన రావణాసురుడిని నాశనము చేసినది, నేనే అనును. క్రూరుడైన గరుత్మంతుడిని వాహనముగా చేసుకున్న ఆ శ్రీకృష్ణుడిని నా బిడ్డ చూసినప్పుడు, తీగలా కంపిస్తూ నా కుమార్తె పొందిన అవస్థను, క్రూర మృగములు తిరిగే లోకములో వున్న మీకు, ఏ విధముగా చెప్పను.

19. సుందరమైన స్వర్గము, సుందరము కాని నరకము, సుందర ప్రకృతికి మూలము, సుందరమైన దానికన్నా గొప్పదైన మోక్షము, సుందర జ్ఞానానందకర ప్రాణుల ఆత్మలు, అన్నీ, నేనే అనును. సుందరమైన మేఘవర్ణపు శ్రీకృష్ణుడిని నా బిడ్డ చూసినప్పుడు, మెరిసే అందమైన ముత్యాల హారము మెడలో గల నా కుమార్తె పొందిన అవస్థను, అందమైన మీకు, ఏ విధముగా చెప్పను.

.....................

భగవంతుడి ఘటనాఘటన సామర్థ్యాలను గురించి రచించిన పద్యాల అర్థ రూపము.

...................

20. స్వర్గము - నరకము, ఐశ్వర్యము - దరిద్రము, ప్రేమ - పగ, అమృతము - విషము వంటివి అన్నీ అయివున్న శ్రీమన్నారాయణుడు, అన్ని లోకములలోను వ్యాపించి వున్న ఆ సర్వేశ్వరుడు, నన్నేలు నా స్వామిని, సిరిసంపదలతో కళకళలాడు తిరువిణ్ణకరము అను నగరములోని దేవాలయములో ఉప్పిలి అప్పనస్వామిగా నేను చూసితిని.

21. ఈ ప్రపంచములో కనిపించే సుఖము - దుఃఖము, సంతోషము - బాధ, ఆగ్రహము - అనుగ్రహము, వెలుగు - నీడ అన్నీ అయివున్న శ్రీమన్నారాయణుడు, వేరెవరూ తెలుసుకోలేని కష్టతరమైన దుర్లభుడు, నన్నేలు నా స్వామి నిర్మలమైన అలలతో నిండిన మంచినీటి చెరువులు గల తిరువిణ్ణకరమను దివ్యనగరములో ఉప్పిలి అప్పన స్వామిగా కొలువై వున్నాడు.

22. దుష్ట శిక్షణ - శిష్ట రక్షణ చేస్తూ, తన దివ్య పాదములను ఆశ్రయించువారిని రక్షిస్తూ, వారిని తరింపచేయు ఆ శ్రీమన్నారాయణుడు, భక్త సులుభుడు, నన్నేలు నా స్వామి, దక్షిణ దిక్కున వున్న తిరువిణ్ణకరమను నగరములో ఉప్పిలి అప్పన స్వామిగా కొలువై వున్నాడు.

23. నిజము - అబద్ధము, నలుపు - తెలుపు, సత్యము - అసత్యము, బాల్యము - వృద్ధాప్యము, నూతనము - పురాతనము అయివున్న శ్రీమన్నారాయణుడిని, అందమైన తోటలు గుడి గోపుర ప్రాకారములతో నిండి వున్న తిరువిణ్ణకరమను నగరములో కొలువై వున్న ఉప్పిలి అప్పన స్వామిని దర్శించండి.

24. నగరములు - దేశములు, జ్ఞానము - అజ్ఞానము, చీకటి - వెలుతురు, భూమి - ఆకాశము అయి వున్న శ్రీమన్నారాయణుడిని, శిఖరపు మేడలు చుట్టిన తిరువిణ్ణకరమను

నగరములో కొలువై వున్న ఉప్పిలి అప్పనస్వామిని పూజించిన వారికి గొప్ప పుణ్యము కలుగును.

25. పుణ్యము - పాపము, సంశ్లేషణము - విశ్లేషణము, జ్ఞాపకము - మరుపు, ఉన్నవి - లేనివి ,అన్నీ అయివున్న శ్రీమన్నారాయణుడు, పెద్ద పెద్ద అందమైన ఎత్తైన మేడలు కల తిరువిణ్ణకరమను నగరములో కొలువై వున్న ఉప్పిలి అప్పన స్వామి యొక్క కరుణా కటాక్షములను పొందండి.

26. ముల్లోకములు - వైకుంఠము, ఐశ్వర్యకరమైన లక్ష్మీదేవి - దరిద్ర దేవత అయిన జ్యేష్ఠాదేవి, ప్రీతి - అప్రీతి, కీర్తి - అపకీర్తి అయి వున్న శ్రీమన్నారాయణుడు, దేవతలు  భక్తులు ఆదరాభిమానములతో సేవించు తిరువిణ్ణకరమను నగరములో కొలువై వున్న పరంజ్యోతి, ఉప్పిలి అప్పన స్వామి, నా మనస్సులోకి వచ్చి చేరి నిలిచిపోయెను.

27. తేజోరూపముతోను - మురికిరూపముతోను, వైభవముగా నివసించు అంతర్యామిగా - కపటములు చేయు స్వామిగా వున్న పరంజ్యోతి అయిన శ్రీమన్నారాయణుడు, తిరువిణ్ణకము అను నగరములో కొలువై వున్న ఉప్పిలి అప్పన స్వామి యొక్క దివ్య పాద పద్మములను చేరుటయే,  అందరికి తరుణోపాయము.

28. ఎండ - నీడ, చిన్న - పెద్ద, పొట్టి -పొడుగు, కదిలేవి - కదలనివి, అన్ని రకాల స్వభావములై - ఏ స్వభావము లేనివాడై వున్న శ్రీమన్నారాయణుడు, తుమ్మెదలు ఆడుతూ పాడుతూ, గుంపులు గుంపులుగా తిరిగే,  తిరువిణ్ణకరమను నగరములో కొలువై వున్న ఉప్పిలి అప్పనస్వామి యొక్క దివ్య పాద పద్మములు మాత్రమే మనల్ని రక్షించును.

...................

శ్రీకృష్ణుడి వేణుగాన సమ్మోహనా పద్యాల అర్థ రూపము.

....................

29. ఎడమ బుగ్గన కుడిచేతిని చేర్చి, రెండు చేతులతో వేణువును పట్టుకొని, కనుబొమ్మలు దట్టమై నూదురు పైకి లేవగా, కుండవలె పొట్ట ఉబ్బగా, నోటిని పుక్కిలించి, గోవిందుడు వేణువును ఊదినప్పుడు, ఆ వేణుగానమునకు స్త్రీలు, తమ తమ పూలకొప్పులు జారిపోతున్ననూ, తమ చీర కుచ్చిళ్లు జారిపోతున్నా, వాటిని పట్టించుకోకుండా, తమను తాము మరిచిపోయి, ఒక చేతితో చీర కుచ్చిళ్లు పట్టుకొని, సరిచేసుకుంటూ, పరవశముతో వచ్చి, తుమ్మెదల వలె కదులు కన్నులు గల లేళ్లు, నెమళ్ల వలె గోవిందుడి చుట్టూ చేరి నిలిచిపోయిరి.

30. గోవిందుడు తన సన్నని నాజూకైన వ్రేళ్లతో, వేణువుని పట్టుకొని, ఎర్రటి కన్నులు గుండ్రముగా తిప్పుతూ, చెమటతో తడిసిన కనుబొమ్మలు కదుపుతూ, ఎర్రని అధరముతో వేణువును ఊదినప్పుడు, ఆ వేణుగానమునకు పక్షుల గుంపులు, తమ తమ గూళ్లు వదిలిపెట్టి వచ్చి, గోవిందుడి చుట్టూ చేరి, కాడ తెగిన పువ్వుల వలె పడి వుండగా, మరి పశువుల గుంపులు కాళ్లు జాపుకొని, తలలు వంచి, చెవులు రిక్కించి, ఆ వేణుగానమును పరవశముతో వినసాగెను.

31. ఎర్రటి తామరపువ్వును చుట్టు ముట్టిన తుమ్మెదల వలె, గుండ్రని ముఖముపై వ్రేలాడు నల్లని జుట్టుతో, దట్టమైన నీలి మేఘపు చిన్ని కృష్ణుడు వేణువుతో ఊదుతున్న వేణుగానమును విని, లేళ్లగుంపు గడ్డి మేయుటను మరిచి, తెలివిలేనివై, మేయు గడ్డిని నోటి

చివర నుండి జార్చుకుంటూ, అటు ఇటు కదలక, ప్రక్కకు కూడా అడుగు వేయుట మరిచి, చిత్రించిన బొమ్మల వలె నిలుచుండిపోయెను.

32. మెరిసే మంచి బంగారపు అంచు కలిగిన పట్టు పీతాంబరమును గట్టిగా కట్టుకొని, అమూల్యాభరణమూర్తి, నల్లని నెమలి కన్నుల గోవిందుడు, గోపశ్రేష్ఠుడు, అద్వితీయుడు వేణువును ఊదినప్పుడు, చెట్లనుండి తేనె పొంగి ధారలై ప్రవహించుచుండగా, పై కొమ్మలు క్రిందకు వేలాడుతూ, కింద వుండే కొమ్మలు శ్రియఃపతి నిల్చున్నవైపుకు వంగి, పూలన్నిటిని గోవిందుడిపై రాల్చసాగెను.

33. ఈ భూమి పైన గొప్పదైన జంభూద్వీపమున సుఖముగా జీవించు మానవులారా, ఇది ఒక అద్భుతము, వినండి. పవిత్రమైన కుడి సుడి శంఖమును చేతిలో గల శ్రీమన్నారాయణుడు ఈ భూమిపైన శ్రీకృష్ణుడై అవతరించగా, తన పవిత్ర అధరము నుండి వేణుగానము వెలువడగా, ఆ వేణుగానము విని, గోపికల హృదయములు ఉత్సాహముతో ఉరకలు వేస్తూ, తమ శరీరపు హద్దును మరిచి, అందరూ ఒకరిని ఆనుకొని మరిఒకరు దారముతో కట్టబడిన పూలమాల వలె వచ్చి, తలలు వంచి, పరవశముతో ఆ వేణుగానమును వింటూ, గోవిందుడి చుట్టూ నిలుచుండిపోయిరి.

34. వైకుంఠపు అధిపతి అయిన శ్రీమన్నారాయణుడు, వసుదేవుడి కుమారుడైన వాసుదేవుడు, నందరాజుకు యువరాజైన గోపాలుడు, గోవిందుడు వేణువును పట్టుకొని ఊదినప్పుడు, ఆ వేణుగానమునకు దేవతా స్త్రీల మనస్సులు కరిగి, వారి కలువ కన్నులు అనంద పరవశముతో నీరు కారగా, పట్టుకుచ్చు వంటి ఒత్తైన కొప్పులు జారగా, ముఖములు చెమటతో నిండి తడవగా, త్వర త్వరగా వచ్చి, చెవి యొగ్గి, ఆ వేణుగానమును వింటూ, మైమరచి నిలుచుండిపోయిరి.

35. ధేనుకుడు, ప్రలంబుడు, కాళీయుడు అను రాక్షసులను చంపి,  అడవి వెంట ఆవుదూడలను మేపుతూ తిరిగిన నల్లని చిరుతడు, శ్రీకృష్ణుడు వేణువును ఊదినప్పుడు, ఆ వేణుగానమునకు అప్సరసలు తిలోత్తమతో పాటు రంభ, ఊర్వశి, మేనకలు తమ తమ ఆటపాటలను విడిచిపెట్టి, దేవలోకము నుండి భూలోకమునకు వచ్చి, నోరు మెదపక, గోవిందుడి చుట్టూ బొమ్మల వలె నిలుచుండిపోయిరి.

36. ముల్లోకములలోని చెడ్డరాజులు భయపడునట్లుగా, నారసిం హుడై, హిరణ్యకశ్యపుడి అహంకారమును పోగొట్టి, అతడిని చంపిన మధుసూదనుడి  నోటి వెంట వెలువడిన అద్భుతమైన వేణుగానము వినబడిన వెంటనే, గొప్ప వీణాగానము చేయు తుంబురుడితో సహా నారదుడు, తమ తమ వీణలతో వీణాగానము చేయుట మరిచి,  పరవశించి పోగా, కిన్నెర జంటలు నాట్యము చేయుట మరిచిపోయి, గోవిందుడి చుట్టూ వచ్చి నిలుచుండి పోయిరి.

37. ఎర్రటి విశాల నేత్రములు, ధృఢభుజములు కల దేవకీదేవి బిడ్డ, దేవతల సిం హము, పరమపదనాథుడైన శ్రీకృష్ణుడు వేణువును ఊదగా, ఆ వేణుగానము విన్నవారు పరవశులై, అద్వితీయపు ఆనందసాగరమున మునిగి తేలగా, ఆకాశమున సంచరించు గాన గంధర్వులు ఇంత అద్భుత గానము "మా వలన కాదు" అని తల్లడిల్లి,  గోవిందుడి అమృతపు గానపు వలలో కట్టబడి వచ్చి,  చుట్టూ చేరి,  నిలుచుండి పోయిరి.

38. భూమిపైన ఒక అద్భుతము జరుగుతున్నది వినండి.  ఆవుదూడలను మేపే చిన్న గోపపల్లెలో,  శ్రీకృష్ణుడు వేణువును ఊదగా, ఆ వేణుగానము దేవలోక పర్యంతము చేరి వినిపించగా, దేవతలందరూ తమ తమ యజ్ఞ హవిస్సులను తినుట మరిచి, వ్రేపల్లె

నిండునట్లుగా వచ్చి, గోవిందుడి చుట్టూ చేరి, వారు తమ చెవులతో ఇంపైన వేణుగాన రసమును త్రాగి, సంతోషముతో పులకరించి పోయిరి.

.........................

ఒక కూతురు పడుతున్న ఆర్తిని తెలుపుతూ, తల్లిపడే ఆవేదనా పద్యాల అర్థ రూపము.

...........................

39. వేదశాస్త్రములు చదివిన వేదాంతులు నివసించే తిరుక్కణ్ణపురములో కొలువై వున్న భక్తవత్సలుడు, ఆ శ్రీకృష్ణుడిని చూసిన నా బిడ్డ, తనను తాను మరిచి, తన ఒంటి మీది వోణి ముందుకు పడుతున్నా గమనించక, ఆ స్వామినే ఆర్తిగా చూస్తూ "ఆహ్, ఎంత అద్భుత సౌందర్యమో, ఆజానుబాహుడు, అదిగో ఆ స్వామి నాలుగు చేతులలో మెరిసే సుందరచక్రము, కాంతులు వెదజల్లే శంఖము, ధృడమైన ఖడ్గము, విల్లు, గద వున్నాయి చూడండి.

40. నల్లని పర్వతము వలె తిరుక్కణ్ణపురములో కొలువై వున్న స్వామి భక్తవత్సలుడిని చూసిన నా బిడ్డ, శత్రువులను సం హరించిన విల్లు ఒక చేతిలో, సుందరమైన చక్రము మరియొక చేతిలో వున్నది చూడండి. ఆయనకు సాటి వేరొకరు లేరు, అని అనుచున్నది.

41.తేనె నిండిన పద్మములు కల మంచినీటి చెరువులు వున్న తిరుక్కణ్ణపురములో కొలువై వున్న భక్తవత్సలుడిని చూసిన నా బిడ్డ, తామరపువ్వులే ఆయన దివ్య పాదములు, పంకజమే ఆ స్వామి సుందర హస్తములు, కలువ కన్నుల లక్ష్మీదేవియే విశాలమైన ఆయన ఎత్తైన సుందర వక్షస్థలమున కొలువై వున్నది. అ స్వామి ధరించిన విలువైన దివ్య మణులతో ప్రకశించు కిరీటము, మెరిసే బంగారు నగలు, మణిహారములు ఎంత

అద్భుతముగా వున్నాయో చూడండి. అవి నా మనస్సుని హత్తుకున్నాయి. అవి నా మనస్సు నుండి విడిపోకున్నవి, అని అనుచున్నది.

42. పచ్చని వరిచేలు చుట్టిన తిరుక్కణ్ణపురములో కొలుపై వున్న భక్తవత్సలుడిని చూసిన నా బిడ్డ, వేయిపేర్ల మహిమాన్వితుడు, మహానుభావుడు, సర్వ సుందరుడు, బంగారపు మకర కుండలములు గల అష్టభుజుడు పెద్ద నిండు నీటి నీలి వర్షుక మేఘమై, విశాలమైన పెద్ద పర్వతము వలె వున్నాడు, అని అనుచున్నది.

43. వేదశాస్త్ర పారాయణులు, అగ్ని హోత్రికులు నివసించు తిరుక్కణ్ణపురములో కొలుపై వున్న భక్తవత్సలుడిని చూసిన నా బిడ్డ, ఆ స్వామి కట్టుకున్న బంగారపు అంచు కల ఎర్రటి పట్టుపీతాంబరము చాలా అందముగా వున్నది. ఆ స్వామి దివ్య శరీరము నల్లనిదైననూ ఆ శరీరపు కాంతి చూడడానికి దివ్య మణిమయ మరకతమో లేక వర్షించు నీలిమేఘపు కాంతియో తెలియకున్నది.

44. సత్ బ్రహ్మణులు, సత్ సాంప్రదాయము కల మానవులు నివసించే తిరుక్కణ్ణపురములో కొలుపై వున్న భక్తవత్సలుడిని చూసిన నా బిడ్డ, భువన మోహన అద్భుత సౌందర్య సుకుమారుడైన ఆ స్వామి గరుత్మంతుడిని ఎక్కి, ఇటువైపే వస్తున్నాడు. స్త్రీగా పుట్టిన నాకు, ఒక్కసారైనా ఆయన వక్షస్థలము యొక్క బిగికౌగిలి లభించిన చాలు, నా జన్మ తరిస్తుంది, అని అనుచున్నది.

45. తిరుక్కణ్ణపురములో ప్రశాంతముగా కొలుపై వున్న భక్తవత్సలుడిని చూసినవారు, వెంటనే ఆ స్వామి భక్తులగుదురు. అటువంటి ఆ స్వామిని చూసిన నా బిడ్డ, దివ్య మణుల కిరీటము కల ఆ శ్రీమన్నారాయణుడి మెడలోని అందమైన రంగు రంగుల పూలు, మాలగా

కట్టిన వనమాల మంచి సువాసనలతో పరిమళించు చున్నది అని అనుచున్నది. ఆ స్వామి అంటే నాకు చాలా చాలా ఇష్టం. ఇంతకు ముందే ఆ స్వామిని ఎక్కడో చూసిన అనుభూతి నాకు కలుగుతున్నది. అందుకే ఆయనను ఇప్పుడు వదిలి వుండలేను, అని నా బిడ్డ పలవరించుచున్నది. అయ్యో, నేను ఏమి చెయ్యను, అని తల్లి తన బిడ్డ ఆర్తిని తెలుపుతున్నది.

......................

జాతకచక్రమును అడుగుతున్న పద్యాల అర్థ రూపము.

......................

46. మా సర్వస్వమూ నీవే, అని భక్తులు భక్తి పారవశ్యముతో నమస్కరించు తిరుమాలిరుంశోలై నగరములో కొలువై వున్న ఆ శ్రీమన్నారాయణుడు, సుందర బాహునాథుడైన అజగర్, తను పడుకున్నప్పుడు, తన దివ్య పాదపద్మములను ఒత్తుటకు, నన్ను అంగీకరించునో లేదో నీవు కూడి చెప్పు, ఓ కూడిక చక్రమా.

47. దట్టమైన అరణ్యము నిండిన వేంకటాద్రి శిఖరముపైనున్న తిరుమలలో కొలువై వున్న వేంకటేశ్వరస్వామి, తిరుక్కణ్ణపురములో కొలువై వున్న భక్తవత్సలుడు, ఈ భూమిపై అభిమానముగా అవతరించిన వామనుడు, ఆ శ్రీమన్నారాయణుడు పరుగు పరుగున వచ్చి, నా చేయి పట్టుకొని, తన పక్కన కూర్చో పెట్టుకొనునో లేదో నీవు కూడి చెప్పు, ఓ కూడిక చక్రమా.

48. సుందర తేజోముఖి దేవకీదేవికి గొప్ప పుత్రుడైన కళ్యాణగుణ సంపన్నుడు, వసుదేవుడి యొక్క యువరాజు, బ్రహ్మరుద్రాదులు ఋషులు మునులు భక్తులు పూజించే ఆ శ్రీకృష్ణుడు నన్ను చేరవచ్చునో లేదో నీవు కూడి చెప్పు, ఓ కూడిక చక్రమా

49. గోపికలు, గోపాలురు భయపడునట్లుగా, చెట్లతో నిండిన ఎత్తైన గుట్టను ఎక్కి, మంచినీటి సరస్సులోకి దూకి, కాళీయుడిని వశపరచుకొని, దాని పడగపై నాట్యమాడిన అసాధ్యుడు ఆ శ్రీకృష్ణుడు నన్ను చేరవచ్చునో లేదో నీవు కూడి చెప్పు, ఓ కూడిక చక్రమా.

50. బంగారపు మేడలతో నిండిన వీథులతో చుట్టిన మథురానగరమున, కంసుడిని వెతుకుతూ వచ్చి, వీథి మధ్యలో అలంకరించి వున్న పెద్ద మదపుటేనుగును చంపిన ఆ శ్రీకృష్ణుడు నన్ను చేరవచ్చునో లేదో నీవు కూడి చెప్పు, ఓ కూడిక చక్రమా.

51. రెండు పెద్ద పెద్ద మద్దిచెట్లు విరుగునట్లుగా, వాటి మధ్యకు రోటిని దొర్లించుకుంటూ వెళ్లిన చిన్నికృష్ణుడు, కంసుడిని చంపిన కీర్తి ప్రతిష్టలు గల మథురాధిపతి, భక్తులను కాపాడు ఆ శ్రీకృష్ణుడు నన్ను చేరవచ్చునో లేదో నీవు కూడి చెప్పు, ఓ కూడికచక్రమా.

52. నిందించిన శిశుపాలుడిని, ఎద్దులను, బకుడను పక్షిని, జయశీల అను ఈటె గల బలుడిని, కంసుడిని చంపిన ఆ శ్రీకృష్ణుడు నన్ను చేరవచ్చునో లేదో నీవు కూడి చెప్పు, ఓ కూడిక చక్రమా.

53. భక్తి నిండిన మనస్సులోన, ఆర్తి కలవారిని ఆదరించువాడు, పరిమళములు వెదజల్లు తోటల ద్వారకానగరపు అధిపతి, ఆవు దూడలను మేపుతూ తిరిగే గోపాలుడు, గోవిందుడు, గోరక్షకుడైన ఆ శ్రీకృష్ణుడు నన్ను రక్షించడానికి వచ్చునో లేదో నీవు కూడి చెప్పు, ఓ కూడిక చక్రమా.

54. పూర్వము బలిచక్రవర్తి చేసిన గొప్ప యాగమునకు అందమైన పొట్టి వామనుడై వెళ్లి, మూడడుగుల భూమిని దానముగా తీసుకొని, పై లోకములను ఒక పాదముతోను, భూమిని మరియొక పాదముతోను కొలిచిన ఆ శ్రీకృష్ణుడు నన్ను చేరవచ్చునో లేదో నీవు కూడి చెప్పు, ఓ కూడిక చక్రమా.

55. నాలుగు వేదముల సారమైన స్వామి, నాలుగు వేదములు ప్రతిపాదించే ఆ భగవంతుడు, గజేంద్రుడిని రక్షించిన సుందర సుకుమారుడు, అందమైన గోపికల మనస్సులలో తిరుగువాడు, నన్ను చేరవచ్చునో లేదో నీవు కూడి చెప్పు, ఓ కూడికచక్రమా.

.........................................

ఎటువంటి పరిస్థితులలోనైనా ఆ భగవంతుడినే ఆశ్రయిద్దాము అని తెలిపే పద్యాల అర్థ రూపము.

..................................

56. ఎర్రటి కన్నుల సర్వేశ్వరుడు, పుణ్యము పాపము అను రెండూ అయివున్నవాడు, మహదాదులైన భూమి, సముద్రము, గాలి, ఆకాశము, అగ్ని అన్నీ తానే అయివున్న ఆ శ్రీమన్నారాయణుడిని అవసానదశ అనగా ముసలితనములో వదలక తప్పక పట్టుకో మనసా.

57. వినసొంపైన మధురగానములో ఇమిడి వున్న స్వభావమై, పాలల్లో కలిసివున్న నెయ్యివలె, ఈ ప్రపంచమున అంతర్యామిగా వుంటూ, ఇంత అని ఊహించరాని అనంతమైన ఆకాశము వలె పెద్ద విశ్వరూపము కలిగి, కంటికి కనిపించే దీపపు వెలుగు వలె వుంటూ, ఉజ్వలమాన ప్రకాశవంతమైన తేజస్సు కలిగి, భూమి గిరులు అలలతో నిండిన సముద్రము

అన్నీ తానే అయివున్న ఆ శ్రీమన్నారాయణుడు, వేదవిద్యలు తెలిసిన వారికి చల్లదనమును కురిపించు చల్లని పున్నమి చంద్రుడి వంటి కన్నులతో నిండివున్న ఆ భగవంతుడు, భక్తవత్సలుడైన తిరుక్కణ్ణమంగన పురములో కొలువై వున్న స్వామిని కన్నులారా దర్శించి సేవించి ధన్యుడనైతిని.

58. ఓ శ్రీమన్నారాయణుడా, నాకు ఎటువంటి కష్టమైన పరిస్థితులు ఎదురైననూ సరే, నేను వదలక, నీ దివ్య పాదపద్మములనే కోరి పూజించెదను. పాడినచో, నిత్యము నీ గుణగణముల కీర్తనలనే పాడెదను. తలచినచో, అందమైన చక్రమును చేత పట్టుకొనివున్న నిన్నే తలుచు, నీ భక్తులనే తలచెదను.

అందరు ఆళ్వారుల దివ్య పాదములకు నమస్కారములు.

*******************

ఆళ్వారుల ఆలోచనలలోని వివరాలను తెలిపే అందమైన మాటల పద్యాల అర్థ రూపము.

ఎక్కడో దూరముగా వున్న అడవులలో, ముక్కు మూసుకొని, కొన్ని వందల సంవత్సరములు తపస్సు చేస్తుంటే, వస్తుందో, లేదో, తెలియని మోక్షము గురించి ఆలోచించడము కన్నా, అందరి మధ్యలో హాయిగా, సుఖ సంతోషములతో బ్రతుకుతూ, మన వాళ్లను జాగ్రత్తగా చూడు, అని ఆ భగవంతుడిని అడుగుతున్నప్పుడు, ఆ భగవంతుడు వుండే దారిని చూస్తూ, ఆ దారిలో భగవంతుడా అని ఆయనను ఆశ్రయిస్తూ, అడుగులు వేసుకుంటూ, పూర్తి గమ్యాన్ని చేరడమే మోక్షమని, అందరు ఆళ్వారులు చెప్పారు.

నాస్తిక వాదము శృతిమించుతున్నప్పుడు, అన్యమత ప్రచారములు విపరీత ధోరణులతో, విచ్చలవిడి అవుతున్న సమయములో, 7, 8 శతాబ్దాల మధ్య కాలములో పుట్టిన ఈ ఆళ్వారులు, ఈ లోకములో సుఖసంతోషములను ఇచ్చి, పైలోకములోని మోక్షాన్ని ఇవ్వగలిగే దేవుడి గురించి ప్రచారము చేశారు. అవే ద్రవిడ వేదములు. ఒకప్పుడు ఉత్తర భారతదేశములో సంస్కృత వేదములు, దక్షిణ భారతదేశములో ద్రవిడ వేదములు విలసిల్లేవి.

ఇదే ఆళ్వారులందరి ఆలోచన.

*************

8. భగవంతుడి వర్ణనను తెలిపే పద్యాల అర్ధ రూపము,

9. పురుషార్ధములైన ధర్మ అర్ధ కామముల గురించి, చిన్న పిల్లలకైనా అర్ధమయ్యేటట్లు రచించిన పద్యాల అర్ధరూపము,

10. పురుషార్ధములైన మోక్షము గురించి, ఎటువంటి వారికైనా, అర్ధమయ్యేటట్లు రచించిన పద్యాల అర్ధ రూపము,

11. మోక్షాన్ని ఇచ్చే భగవంతుడు ఎవరు, అంటూ చెప్పిన పద్యాల అర్ధ రూపము.,

12. మోక్షము నిచ్చే భగవంతుడు ఎలా వుంటాడు, అని చెప్పిన పద్యాల అర్ధ రూపము,

13. మోక్షము నిచ్చే భగవంతుడిని ఎలా చూడాలి, అని చెప్పిన పద్యాల అర్ధ రూపము,

14. ఆ భగవంతుడిని కొలిస్తే తప్పక మోక్షమునిస్తాడు, అని చెప్పిన పద్యాల అర్ధ రూపము,

15. దీనముగా ఆ భగవంతుడిని ఎలా ప్రార్ధించాలో, చెప్పిన పద్యాల అర్ధ రూపము,

16. ఏ విధముగా మనస్సు పెట్టి పూజించాలో, తెలిపిన పద్యాల అర్థ రూపము.

*********************

8. భగవంతుడి వర్ణనను చూద్దాము.

తిరుమజిశై ఆళ్వారు రచించిన తిరుచ్ఛందవిరుత్తము.

...............

మోక్షప్రదాత అయిన ఆ శ్రీమన్నారాయణుడి భువన మోహన సౌందర్య కళ్యాణ గుణ సంపదలను ఇందులో వివరించారు.

.............................

1.పంచభూతములలోని ఈ భూమి యందు వుండు శబ్దము, స్పర్శ, రూపము, రుచి, వాసన అను ఐదు గుణములై మరియు నీటి యందు వుండు శబ్దము, స్పర్శ, రూపము, రుచి అను నాలుగు గుణములై మరియు నిప్పు యందు వుండు శబ్దము, స్పర్శ, రూపము అను మూడు గుణములై మరియు గాలి యందు వుండు శబ్దము, స్పర్శ అను రెండు గుణములై మరియు ఆకాశమునందు ఉరిమే శబ్దము ఒక్కటై, వివిధ రకములైన దేవతలందరికి ఆత్మ అయి వున్న నిన్ను, నీవు వుండే విధమును, తెలుసుకొనుట ఎవరికి సాధ్యము?

2.పాపము, ముసలితనము, చావు, శోకము, ఆకలి, దాహము, అసత్యము, వ్యర్ధము అను ఎనిమిది రకాలైన హరించే గుణములు లేని జ్ఞానము, శక్తి, బలము, ఐశ్వర్యము, వీర్యము, తేజస్సు అనే అద్భుతమైన ఆరు కళ్యాణ గుణములను కలిగి వుండి, జ్ఞానులకు సత్యమై, అజ్ఞానులకు అసత్యమై, ఈ ప్రపంచములో వున్న అందరిలోను స్పర్శ, శబ్దము, రుచి,

చూపు, పలుకు అను ఐదు రూపములుగా కొలుపై వున్న గోవిందుడా, మాయాలోలుడా/ అద్యయనము, అధ్యాపనము, దానము, ప్రతిగ్రహము, యజనము, యాజనము అనే ఆరు వైదిక కర్మలలో వసంత, గ్రీష్మ, శరత్, హేమంత, శిశిర ఋతువులు అను ఆరు ఋతువులలోను ఆగ్నేయం, అగ్నిషోమీయం, ఉపాంశయాజమనే రెండు విధములైన ఇంద్రియాగ్నులు, ఐంద్రాగ్ని అనే ఆరు అగ్నులతో అగ్నిహోత్రము చేస్తూ దేవ, పితృ, భూత, మనుష్య, బ్రహ్మ యజ్ఞములు అను ఐదు యజ్ఞములతో ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము అనే ఐదు ఆహుతలతోను గార్హాపత్యము, ఆహావనీయము, దక్షిణాగ్ని, సభ్యం, అవసభ్యం అనే పంచాగ్నుల్లను తమ శరీరములో నిలుపుకొని, అతిశయమైన జ్ఞాన వైరాగ్యములతో దైవచింతన, దైవప్రార్థన, భక్తిపారవశ్యము అనే మూడు విధముక్తిలైన భక్తితో వివేకము, విమోకము, అభ్యాసము, క్రియ, కళ్యాణము, అనవసాదము, అనుద్ధర్షము అనే సప్త వివేకములను కలిగి వుండి, అనేక మతముల వారు నిన్ను కొలుస్తున్నారు.

3.పంచభూతములకు, ఐదు జ్ఞానేంద్రియములకు, ఐదు కర్మేంద్రియములకు, చేతనాచేతనములకు అంతరాత్మయై వాటిలోని శబ్దము, రూపము, స్పర్శ, రుచి, వాసన అనే పంచతన్మాత్రలై ప్రకృతి, పురుషుడు, భగవంతుడు అనే మూడు రూపములై, అన్నిటిలోను మనస్సొక్కటియై వున్న ఆదిదేవుడా/ అప్రాకృత పంచశక్తులకు జ్ఞానేంద్రియ, కర్మేందియములై, పరమ పద వైకుంఠమున కొలువై వున్న నిన్ను, భోగస్థానము, భోగోపకరణము, దేవతలు, మునులు, మోక్షమును పొందిన ముముక్షువులు అను వారికి నిర్వాహకుడవై వున్న నిన్ను తెలుసుకొనుట ఎవరికి సాధ్యము.

4. అక్షరములలోని ముప్పై మూడు హల్లులు, పదహారు అచ్చులు, ఐదు 'ళ ' కారాదులతో కూడిన వేదత్రయ మూర్తివై, ద్వాదశ మంత్రాక్షరీ ప్రతిపాద్యుడవై, జ్యోతీర్మయమయైన ఓంకార ప్రణవ నాదమై, నాశనము లేని అకార వాచ్యుడవై, నిత్య నిర్వాహకుడవై వున్న నీవు, నా హృదయములోనికి ప్రవేశించుట ఎంత సులభమో స్వామీ.

5. ఈ మాయా ప్రపంచములోని అన్ని రకములైన జీవుల శరీరములన్నిటికి అంతరాత్మయై, అన్నిటిలోను కలిసి వున్న నిన్ను గురించి, స్వామీ ఇది నీ స్వభావము, అని చెప్పుట ఎప్పుడూ, ఎవరికీ సాధ్యపడని కారణభూతుడా/ నీ నాభి నుండి ముందుగా చతుర్ముఖ బ్రహ్మని సృష్టించిన ఆదిదేవుడవు, నీవే కదా.

6. స్వర్గము వంటి మేరుపర్వతమును, స్వర్గము వంటి భూమిని, ఆకాశములోని స్వర్గమును, ఆకాశము నుండి ప్రవహించు గంగను, ఆకాశమందుండు మేఘములను, ప్రకాశించే వెలుగు కిరణములను, గాలిలోని వాయువులను, సరైన పద్ధతిలో నియంత్రిస్తూ, అన్నిటిని ఒకటి చేసి, అంతటా నిండి వుండే స్వభావము, నీకే వున్నది.

7. జీవులన్నిటిలోను ప్రధానమైన ఆత్మ ఒకటి అయి, అప్రధానపు మంచి చెడ్డలు అయిన జ్ఞానము అజ్ఞానము అనే రెండు రూపములై, మూడు కాలములలోను, సముద్రములతో నిండిన ఈ భూమండలమునకు నిర్వాకుడవై, అంతే కాకుండా త్రేతాగ్నులై, గోపాలుడవై వున్న ఆశ్చర్యుడా/ ఆ త్రినేత్రుడైనా నిన్ను కీర్తించగలరా.

8. ఆదిమూలమైన బ్రహ్మదేవుడికి, అండమనే పరమ పద వైకుంఠమునకు, గొప్పవారైన బ్రహ్మాండాది దేవతలకు నిత్య నిర్వాహకుడవై, అధిపతివై వున్న నీవు, మొదటివాడైన బ్రహ్మ

యొక్క పుట్టుకను, మరణమును గురించి చెప్పగలవు. కాని ఆది కాల నిర్వాహకుడవైన నీ గురించి, ఎవరు చెప్పగలరు.

9. జటాఝూటధారి శివుడు నమస్కరించు పాదములు గల పరమ పావనుడా/ గుణవంతులైన వేదవేత్తలు, సామగాన యజ్ఞము చేయువారు, శ్రవణ భక్తితో నిన్ను పూజించువారు, శాస్త్రవిధిగా నమస్కరించు పరమ భక్తులు, అందరూ నిన్ను సులభముగా సేవించ గలిగిన గుణము, నీ వద్దనే వున్నది.

10. తన యందే తరంగించు అలలతో నిండిన తెల్లని నురుగుల సముద్రము, తన యందే పొంగి లేస్తూ, మరలా తన యందే కలిసిపోవునట్లుగా, ఈ మాయా జంగమ ప్రపంచమంతా నీ యందే పుట్టి, మరలా నీ యందే కలిసి నశిస్తున్నది.

11. అన్నిటికి ఆత్మవై వున్నావని, వేదములలో తెలపబడిన నీ గురించి, వేదములు కూడా చెప్పలేనంత జ్యోతిర్మయ స్వరూపుడవైన నీ గుణగణముల గురించి, వేదముల ప్రకారము లోకములన్నిటిని సృష్టించమని, నీవు పుట్టించిన బ్రహ్మదేవుడు కాని, వేదములలో గొప్పవారైన దేవతలు కాని, ఎవరైనా సరే, మంచి అర్ధవంతమైన మాటలతో వివరముగా చెప్పగలరా.

12. లోకములను నీవు సృష్టించితివి. నీలోనే ఇముడ్చుకుంటివి. తిరిగి ఈ లోకములోనే అవతరించితివి. ఒక్కచోట కాదన్నట్లుగా ఈ లోకమంతా నీ శరీరమే అయినట్లుగా, అసాధారణ విశ్వ రూపముతో నీవు వుండుట చేత, నీ ఆశ్చర్యకరమైన పనులను తెలుసుకొనుట, ఏ లోకములలోని వారికీ సాధ్యము కావట్లేదు.

13. అసలు నిన్ను తెలుసుకొనుట ఎవరికి సాధ్యము. నీవు ఇటువంటివాడవు, అని చెప్పుట ఎవరికీ తెలియదు. ఎవరైనా, నీ దయతోనే, నీ గురించి తెలుసుకోగలరు. సన్నని నడుము గల నప్పిన్న రాధ భర్త, అని కొందరు అంటుంటారు. నీ గురించి తెలిసిన చాలా మంది, తాము ఎరిగిన వివిధ రకాలైన పేర్లను, ఊర్లను, అవతారములను చెబుతారు.

14. అప్రాకృత దివ్య కాంతులతో విరాజిల్లే విశ్వరూపుడవై, కూర్మరూపుడవై, తులసి మాలలను ధరించి లోతైన క్షీరసాగరమున శయనించిన ఆదిదేవుడా/ నీవు చేయు పనులకు సరిపడా పేర్లను చెప్పు సమర్థులము, మేము కాకపోయినా, ఏదైనా నీవు సామ వేద ప్రతిపాద్యుడవైన చక్రమును ధరించిన చక్రపాణివే కదా.

15. శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిష్యము, కల్పము అను ఆరు వేదాంగములతో పాటు ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదము అను నాలుగు వేదములలోను ఇమిడివున్న నీవు, విశాల క్షీరసాగరమున, ఎర్రని కన్నుల ఆదిశేషుడి పడగలపై, నిండైన ఐశ్వర్య సంపదతో, పవళించిన తెల్లని శంఖ వర్ణపు దివ్య శరీరపు శాంఘుపాణివి కావా.

16. దేవలోకములలోని అన్ని ప్రదేశములలోను, మానవ లోకములోని భూమి, గాలి, నీటిలో నివసించే అన్ని జీవజాతులలోను, అంతర్యామిగా తేజోవంతుడై అవతరించి, అన్ని లోకములలోను నిండి వుండి, విరిగి పోలేని పర్వత సమూహము వలె వున్న నీ గొప్పతనము గురించి, నీ గురించి, శాశ్వతముగా నిండివున్న వేదములలో చెప్పబడు మాటల వలన గాని, మనస్సు వలన గాని తెలుసుకోవచ్చును.

17.ఏకరూపమైన పరవాసుదేవ మూర్తివై, బ్రహ్మ విష్ణు మహేశ్వరులు అను త్రిమూర్తులై, ప్రకృతి పురుషుడు అవ్యక్తము కాలము అను నాలుగు విధములైన రూపములై, పుణ్యమే రూపమై వున్న భోగమూర్తీ/ లెక్కింపరాని అనేక రూపములను కలిగి, పాల సముద్రమున శేషశయ్యపై శయనించిన నీ అర్చారూపమును గురించి, తెలుసుకొనుట ఎట్లో, తెలుపు ఆదిదేవా.

18. మంటలు రేపే రెండు వేల కళ్ళు, వేడిగాలులు విడుస్తూ, విషమును చిందించే వేయినోళ్లతో, బుసకొట్టే పడగల ఆదిశేషుడు, ఇసుమంత కూడా ఆవేశపడకుండా, చల్లదనమును కురిపిస్తూ, భక్తి పారవశ్యముతో మెరిసే నిండైన అందముతో, చక్కగా తయారుచేసిన చల్లని పానుపు వలె, క్షీరసముద్రపు నీటిపై చుట్టుకొని వుండగా, నీవు దానిపై పవళించుట, చాలా ఆశ్చర్యముగా వున్నది సముద్రవర్ణుడా.

19. ప్రళయకాలమున హంస రూపముతో, వేదములను కాపాడితివి. హంసకు విరోధి అయిన పక్షి బకుడి నోటిని చీల్చితివి. అంతేకాకుండా, ఆ పక్షినే గరుడధ్వజముగా చేసుకొని, గరుత్మంతుడిని వాహనముగా నడిపితివి. కాని, అదేమి విచిత్రమో స్వామీ, ప్రకాశించే చక్రమును ధరించిన నీవు, గరుడజాతికి విరోధి అయిన ఆదిశేషుడి పానుపుపై పవళించుట, అభినందించవలసిన విషయమే.

20. కూర్మ రూపుడవై చల్లని నీటిలో సుఖించిన కేశవా/ పడిపోతాను, అనే ఎటువంటి భయము లేకుండా, సముద్రజలముపై అనంతుడిని పడకగా చేసుకొని, క్షీరసాగరమున నీవు శయనించినప్పుడు, గొప్పవారైన బ్రహ్మాది దేవతలు వచ్చి, నిన్ను ఏ విధముగా కీర్తించారో, మాకు తెలిసేటట్లుగా చెప్పవా.

21. శ్రీరంగనాథా/ ఇంత పెద్ద భూమి కదిలిపోయేటట్లు, మందర పర్వతముపైనున్న వృక్షములన్నీ విరిగిపోయేటట్లు, ఆ మందరపర్వతమును తీసుకొని వెళ్లి, తరంగించు క్షీరసముద్రమున వుంచి, వాసుకిని చుట్టి, నీ వీపు ఒరుసుకోపోవునట్లుగా చిలికినప్పుడు, దేవతలు రాక్షసులు ఏమి చేసిరి. వానర సేనను అభిమానముతో స్వీకరించిన నా స్వామీ, అప్పటి విశేషములను ఇప్పుడు స్పష్టముగా చెప్పవా.

22. సృష్టికి ముందు ప్రళయకాలమున సప్త ద్వీపములను ఇష్టముతో మ్రింగి, తరువాత సాటిలేని చిన్ని బాలుడవై, మర్రి ఆకుపై పడుకున్న ఆదిదేవుడా/ తుమ్మెదలు చేరే, చల్లని తులసి మాలలు కలిగిన వక్షస్థలముపై, అందమైన పూలరాణి లక్ష్మీదేవిని సింగారించినవాడా, భూదేవికి నాథుడా.

23. నలువైపులా వ్యాపించునట్లుగా, నిండైన స్వరముతో, నాలుగు వేదములను నాలుకపై వుంచుకొని, కీర్తించే జ్ఞానులు గొప్పగా పూజించే, పాలసముద్రమున పవళించిన పద్మనాభుడా/ తెల్లని రంగుతో గొప్ప సిం హరూపుడవై పెరిగి, పదునైన దంతముల హిరణ్యకశ్యపుడి శరీరములోనికి చేతిగోళ్లను గుచ్చినది నీవే కదా.

24. నృసిం హమైన దేవదేవా, సముద్రము వంటి శరీరము గల నీలిమేఘువర్ణుడా/ తేనె నిండిన మృదువైన పుష్పమున వున్న లక్ష్మీదేవిని, నీ వక్షస్తలమున నిలుపు కుంటివి. గంగనీరును సృష్టించిన పాదపద్మములు గల స్వామీ, అందమైన నీ చేతులలో శంఖము, చక్రము, గద, ధనస్సు, ఖడ్గమును ధరించితివి కదా.

25. బ్రహ్మదేవుడి వద్ద వరమును పొందిన కోరపండ్ల రాక్షస రాజు, హిరణ్యకశ్యపుడి గుండెలను నీ చేతులకు వున్న గోళ్లతో చీల్చావు. వామనుడవై వచ్చి, యాచించి తీసుకున్న భూమినే, నీ ఇంద్రజాల మహిమతో నీ కడుపులో దాచుకున్నవు. నీ ఆలోచనలతో, నీవు ఎప్పుడు, ఏమి చేస్తావో, ఎవరికి తెలుసు.

26. స్త్రీ పురుష నపుంసక నిర్వాహకుడవై, రస శబ్ద స్పర్శ రూప వాసనలతో, ఎన్నో విధాలుగా కనిపించే ఒకటే ప్రకృతికి అధికారివై, పశువులను మేపిన గోవిందుడా/ ఆశ్రయించని వారికి చెడ్డవాడివై, ఆశ్రయించిన వారికి మంచివాడవై, మూడడుగులు ఆశించిన బ్రహ్మచారివై, మాయా రూపముతో వచ్చిన మాయాలోలుడా,

27. ఆకాశమును దాటిన జ్యోతీస్వరూపుడా, స్వయంప్రకాశక జ్ఞాన స్వరూపుడా, వేదములు కూడా వివరించలేని పరమ పదమున వున్న పాపనాశకుడా, సర్వేశ్వరా/ పొట్టి బ్రహ్మచారివై యాచించి వెళ్లి, ఊహించని విధముగా, నీవు భూమిని కొలిచినప్పుడు, నువ్వు పెట్టిన హద్దును ఎవరు చూడగలిగారు.

28. సృష్టించిన భూమిని, వరాహమై నీటి నుండి విడదీసి, వామనుడవై కొలిచి, ప్రళయకాలమున మ్రింగి, కృష్ణుడవై నోటిలోన చూపి, భూమిపై నున్న సముద్రజలమునకు రాముడవై అడ్డుకట్టి, కూర్మరూపుడవై క్షీరసముద్రమును చిలికి, ఆ క్షీరసముద్రపు అలలపైననే శయనించిన స్వామీ, అనేక ఆయుధములను చేతులలో కలగిన శక్తియుక్తుడా/ పొగరు నిండిన మాలి, సుమాలి అను నీచులు, యమలోకమునకు వెళ్లునట్లు, నీ గొప్ప విశాల హస్తములతో ఆయుధమును ప్రయోగించితివి కదా కృష్ణా.

29. పరాత్పరుడవై,  సముద్రజలమున పవళించి, వక్షస్థలమున లక్ష్మీదేవిని ఉంచుకొని, ఆశ్రితులను రక్షిస్తూ, ఆనందించక, ఈ మనుష్యజాతిలో ఎందుకు పుట్టావు,  స్వామీ. జ్ఞానస్వరూపుడా/ ఏ ఒక్కరూ నీ అనుగ్రహ విధానము, ఇది అని తెలుసుకోలేకున్నారు.

30. దేవతలను మనుష్యులను ఏడుపర్వతములను ఏడు సముద్రములను ఆరగించి, మర్రి ఆకుపై పడుకున్న పుండరీకాక్షుడా, గొప్ప కోదండమనే విల్లు కలవాడా/  తేనె నిండి, పరిమళించు చల్లని తులసిమాలలను ధరించిన కృష్ణుడవై, గూని కలిగిన కుబ్జను, పైకి ఎత్తి, లేవదీసి అందాల రాశిగా చేసితివి కదా.

31. కాలనేమి అను రాక్షసుడి పాలిట కాలయముడా, లెక్కింపరాని కీర్తివంతుడా, లోకములు ఏడింటిని ఆరగించి,  సాటిలేని బాలుడవైన పద్మనాభుడా,  సముద్రపు నీరు భయముతో వేడెక్కునట్లు విల్లును ఎక్కుపెట్టిన వీరాధివీరా/ నీ పాదములను ఆశ్రయించు భక్తుల మనస్సు తృప్తిపడునట్లుగా, మోక్షమును ఇచ్చే స్వామివి,  నీవే కదా.

32. భూమిని దానముగా ఇచ్చిన బలిచక్రవర్తికి, ఈ భూమిపైన కొంచెమైనా చోటు లేకుండా, భూమిని కొలిచిన పద్మనాభుడా/ ఘోషించే సముద్రముపై నుంచి వానర సైన్యముతో లంకకు వెళ్లి, అక్కడి రాక్షసులు నశించునట్లు,  భయంకరమైన బాణములను ప్రయోగించిన గొప్పవాడవు నీవే కదా.

33. మెరిసే బంగారపు మేని కాంతితో, మధురమైన పలుకులు పలికే నప్పిన్న రాధ యొక్క హృదయనాథుడా, నిత్య కళ్యాణగుణవంతుడవైన బంగారపు ఛ్చాయ  కలిగిన పుండరీకాక్షుడా/ మెరిసే పండ్ల రావణాసురుడు చచ్చునట్లుగా, క్రూరమైన బాణమును వేసి, అతడి తమ్ముడు విభీషణుడికి దయతో పట్టాభిషేకము చేసినది నీవే కదా.

34. ఆది అంతము అనంతము అయివున్న నీవు,   అండ పిండ బ్రహ్మాండమునకు నిర్వాహకుడవై వున్న నీవు, శాస్త్రప్రకారము అంతటా సర్వేశ్వరుడవై ప్రకాశించు నీవు, యజ్ఞ యాగాదులతో ఆరాధ్యుడవు, వేదవేద్యుడవు, నిత్య లీలావిభూతికి నిర్వాహకుడవు అయిన నీవు, సర్వమునకు కారణమైన నీవు, గొల్లవాడవు అగుట, ఆశ్చర్యమా లేక  అద్భుతమా.

35. నీటిలో తిరిగే మీనమై, కూర్మమై, చక్రధారివైన పరమ పురుషా/ ఎంతో అభిమానమును చూపిన, సన్నని తీగవంటి పాము నడుము కల గొల్లభామ, యశోదదేవి వద్ద అతిశయముతో పిల్లవాడివై పెరిగితివి. అది తలుచుకుంటే, ఎంత ఆశ్చర్యముగా వున్నదో, నా స్వామీ.

36. బంగారపు నగలు ధరించిన గొల్లభామ, యశోదకు పుత్రుడవై, శకటమును తన్ని, పక్షి రూపమున వచ్చిన రాక్షసుడిని చంపి, రాక్షసి పూతన చచ్చునట్లుగా, ఆమె ఇచ్చిన పాలను త్రాగిన నోటితోనే,  నీవు కాలి అందియలు ఘల్లు ఘల్లుమను గోపికల అధరామృతపానమును చేసితివి. ఎంత ఆశ్చర్యము,  స్వామీ.

37. సాటిలేని వరాహమై వున్న వామనుడా/ యశోద పాలను త్రాగిన నోటితోనే,  రాక్షసి పూతన ఇచ్చిన పాలను త్రాగి, భూమిని మ్రింగిన నోటితోనే వెన్నను మ్రింగి, చెట్టుపై నున్న వెలగపండు పైకి రాక్షసుడిని విసిరి, విరబూసిన కురంద వృక్షముపై నున్న రాక్షసుడిని ఎదిరించి చంపి, కేశి అను రాక్షసుడి నోటిని చీల్చిన చేతులు గల నిన్ను, శ్రీకృష్ణుడని అంటారు కదా.

38. మదమెక్కిన కంసుడి బలమైన ఏనుగు దంతమును విరిచినవాడా, చెరువులోని విషమయ  కాళీయుడి పడగలపై  నాట్యము చేసిన  నాథుడా,  కుండలను ధరించి

కుంభనృత్యమొనర్చిన మేఘవర్ణుడా, చల్లని తులసిని మాలగా వక్షమున ధరించువాడా, కాలనేమి అను రాక్షసుడి పాలిట కాలయముడా.

39. మందర పర్వతముతో సముద్ర జలమును చిలికి కలతపరచితివి. అంతే కాకుండా, కొండల నెత్తి, సముద్రజలమునకు అడ్డుకట్టి, సముద్ర జలముతో చుట్టబడిన త్రికూట పర్వతముపై నిర్మించిన లంకానగరమును ధ్వంసము చేసిన నీవే కదా, గోవర్ధన పర్వతము నెత్తి, రాళ్ళ వర్షమును అడ్డగించిన మేఘవర్ణుడవు.

40. గజేంద్రుడను ఏనుగును రక్షించితివి. కాని, కువలయ పీడనము అను కంసుడి ఏనుగును చంపితివి. కొండను ఎత్తి, పశువులను రక్షించి, ఆ పశువులను మేపి, వాటి వెన్నను తింటివి. కాని, వెంటనే తుమ్మెదల వంటి నల్లని కన్నుల నప్పిన్న రాధకై, ఆ పశువులనే చంపితివి. ఏమాశ్చర్యమేమాశ్చర్యము, స్వామీ.

41. దేవతలకైనా మనుష్యులకైనా తెలియరాని నీవు, గోపాలుడవై, వెదుళ్ల వంటి భుజములు కలిగిన రాధను అభిమానించితివి. ప్రకృతి యొక్క మాయ ఎలా వున్నా కాని, నీవు పరి పరి విధములుగా అంతటా నిండి వుండి కూడా, అంతా మాయమవునట్లుగా ప్రళయమును సృష్టించితివి. నీ సంకల్పమంతా ఆశ్చర్యముగా వున్నదే. నీ గురించి తెలుసుకొనుట, ఎవరికి సాధ్యము, స్వామీ.

42. ఆబోతులను చంపిన కర్కశుడా/ చంద్రుడిని సిగలో ధరించి, భస్మము నిండిన శరీరము కలిగిన జటాఝూటధారి యొక్క చేతిలోని కపాలము నిండునట్లు, నీ రక్తమును ఎందుకు ఇచ్చావో, సంకోచించకుండా చెప్పు.

43. కోపము నిండిన ఏనుగు తెల్లని దంతమును పీకి, కోపిష్టి కంసుడిని చంపి, భూమిని కొలిచినవాడా, మోసముతో వచ్చిన పూతన ప్రాణములను పాలతో పాటు త్రాగినవాడా/ కాటుక వంటి నల్లని కాంతిగల ఆదిదేవుడవు నీవే కదా.

44. పాల వంటి తెల్లని తెలుపు రంగు, బంగారము వంటి ఎర్రని ఎరుపు రంగు, నీటిలోని పాచి వంటి పచ్చని  రంగు, అందమైన చెరువులలో తిరిగే తుమ్మెదల వంటి నల్లని నల్ల రంగు అను రంగులతో, నాలుగు యుగములలోను నిండి వున్న ఆ సర్వేశ్వరుడి రంగును లోకము పూర్తిగా మరచిపోయినది. ఇది ఎంత దురదృష్టకరమో.

45. అనంతుడిపై శయనించిన పుణ్యస్వరూపుడా, వికసించిన తులసిమాలలను ధరించిన అందమైన పరమ పావనుడా, దేవతలకు కూడా తెలియరానివాడవైన నీవు, ఎంతో ఆశ్చర్యముగా, ఈ భూమిపైన ఆసక్తితో, ప్రకృతీ పురుషుడపై అవతరిస్తూ, నీ భక్తులకు కనిపిస్తున్నావు.

46. చల్లని తులసీదళముల మాలను ధరించువాడా/శంఖమును, చక్రమును చేత పట్టుకొని, అందమైన గరుడవాహనధారివైతివి.  నేను ఈ లోకములో  పుట్టి,  ఇంతవరకూ ఏ మంచిని పొందలేకపోయితిని, ఇప్పుడు నీ భక్తుడనయితిని. ఈ జన్మలోని చావులోనే, నా జన్మలను పోగొట్టుకొని, మోక్షమును పొందు విధానమును చెప్పు,  స్వామీ.

47. కాలమేఘము వంటి శరీరము కలిగిన నల్లని కృష్ణా, దేవాదిదేవా/ పాలసముద్రమున అనంత శయనుడపై వున్నావందురు. కాని, నీవు ఒక చోట వుండక, అన్ని చోట్లా వుంటూ, అవధిలేనివాడవు, అని అంటారే.

48. ఈ భూమిపైన కొలుపై వుండి, వైకుంఠమున వుండి, విశాల సముద్రమున పడుకొని, ఒకసారి భూమిపై పెరిగి, ఒకసారి భూమిని మ్రింగి, మరలా ఒకసారి పందిపై నీటిని నుండి విడదీసిన నా స్వామీ/ ఈ మనుష్యులను సృష్టించి, వారికి మంచి చేసి, కాపాడమని దేవతలను అమర్చిన ఆదిదేవుడవు,  నీవే కదా.

49. ఎండ్రకాయను మ్రింగిన కొంగ, చీకటి పూల కలువలను అడ్డుగా పెట్టుకొని, ఎంతో కష్టముతో, తుళ్లిపడుతూ పైకి లేచిన చేపను పట్టి, తినే, అందమైన చల్లని నీరు నిండిన శ్రీరంగమే, సిగలో తురిమే  తుమ్మెదలు వాలు  పువ్వులను పట్టుకొని తిరిగే, మధురానగరములోని కుబ్జ యొక్క గూనిని, ఉండ చేసి, లోపలికి నొక్కి, ఆమె మనస్సును సంతోషపెట్టిన స్వామి, ఆ శ్రీకృష్ణుడు వున్న ఊరు.

50. ఎనిమిది దిక్కులలోని జనులందరూ నమస్కరించి, పుణ్యస్నానాలు చేయు కావేరి జలముల తీర్థములు కలిగి, తుమ్మెదలు కమ్మగా పాడు తోటలు,  హద్దులుగా కలిగిన అందమైన శ్రీరంగమే, తెల్లని అలలతో నిండిన నల్లని సముద్రము ఎర్రనై, వేడెక్కునట్లుగా, బలమైన ధనస్సును వంచి, బాణమును విడిచిన వీరాధివీరుడు,  శ్రీరాముడు చేరి ఉన్న ఊరు.

51. దనస్సును వంచి, బాణములను ఎక్కుపెట్టి, లంకాధిపతి రావణుడి పది తలలు తెగునట్లు దొర్లించిన ఐశ్వర్యవంతుడు, శ్రీరాముడు నిత్య నివాస మొనర్చుకున్న దివ్య నగరము, చతుర్ముఖ బ్రహ్మదేవుడు కూడా వచ్చి సేవించు చోటు, విలువైన రత్నములను త్రోసుకొని వచ్చు అలల తరంగపు కావేరీ నీరు గల శ్రీరంగమే, అందురు.

52. కణుపులతో నిండిన వెదురు పొదల క్రింద, త్రిదండపు సన్యాసులు, ఏకాంతపు మునులు, వైరాగ్యపు భక్తులు సుఖముగా కూర్చొని, తపస్సు చేసుకునే, అందమైన చల్లని నీటితో నిండిన శ్రీరంగమే, కొండలలో తిరిగి బాగా బలిసి, యుద్ధము చేయుటకు ఎదురుగా వచ్చిన కంసుడి ఏనుగును పట్టుకొని, దాని దంతమును ఊడపీకిన సాహసుడు, శ్రీకృష్ణుడు వున్న ఊరు.

53. పార్వతీదేవి సిగ్గుపడునట్లుగా చేసిన మన్మథుడు, శివుడి శాపము పొంది, కొడుకు అనిరుద్ధుడుగా పుట్టగా, అతడిని తీసుకొని వెళ్ళి, రణభూమి యందు భయంకరమైన వేగముతో పరిగెత్తి, బాణుడి వేయిచేతులను నరికిన, పరమ పురుషుడి గొప్ప నివాసము, కావేరి నీటితో నిండిన శ్రీరంగమే, అని పేరు పొందినది.

54. సహ్యా పర్వతములపై పుట్టి, చందనపు చెట్లను తోసుకుంటూ కిందకు దిగి వచ్చి, అలసిపోయి, ఒళ్లు విరుచుకుంటూ పెరుగుతూ, కుంకుమ పూ రంగుతో ప్రవహించె కావేరిని కలిగిన శ్రీరంగమున కొలుపై వున్న స్వామియే, పదునైన బాణములను ప్రయోగించి, లంకానగరమును నాశనము చేసిన ఆ శ్రీరామచంద్రుడు.

55. పుష్పములో కొలుపై వున్న శ్రీదేవికి, భూదేవికి నాథుడవై, నప్పిన్న రాధతో సరాగములాడిన నీ దివ్య పాదములను, నా హృదయములో స్థిరముగా వుంచి, నన్ను అనుగ్రహించితివి. కావేరీ నీటితో చుట్టబడిన శ్రీరంగమున వున్న శ్రీరంగనాథా, నీవు పుండరీకుడవే, కదా.

56. లంకాధిపతి రావణుడి బలమైన పదితలలు భూమిపై పడునట్లు కొట్టి చంపి, జయమును పొందిన వీరాధివీరా, శ్రీరామా/ భక్తి తేజస్సుతో నిండిన యజ్ఞోపవీతులు, వేదాధ్యయునులు,

వేదసారమును గ్రహించిన వేదాంతులు సేవించు తిరుక్కుడంద అను మహా నగరములో పవళించిన అభయామృత స్వామీ, నీవు సర్వేశ్వరుడవే, కదా.

57. ముంజేతి కంకణపు గాజులు కలిగిన సీతను చేపట్టవలెనని తలచిన రావణుడి శరీరము నశించునట్లు, లంకకు వెళ్లి ఆక్రమించి, నాశనము చేసిన సముద్రవర్ణుడైన శ్రీరామా/ పొడుపైన జుట్టు కలిగిన సుందరీమణులు జలకములాడు జలములతో పొంగిన చల్లని తిరుక్కుడంద అను మహా నగరములో పవళించిన పుండరీకుడవు,  నీవే కదా.

58. మద్దిచెట్లు పడునట్లు నడిచి, కంసుడి మదపుటేనుగుపై నున్న మావటివాడి గుండెలు పగులునట్లు తన్ని, ఆ ఏనుగు దంతమును పీకి, ఆనందించిన పరమపావనుడా, కేశి అను రాక్షసుడి నోటిని చీల్చి, లోకములను కొలిచిన దివ్య పాదము కలవాడా/ వేదములను చదివిన వారు వరములను పొందు తిరుక్కుడందలో పవళించిన సర్వేశ్వరుడవి, నీవే కదా.

59. పచ్చని వరిపైర్లతో చుట్టిన చల్లని పంటపొలములు, పెద్ద పందిరిపైన ప్రేలాడే పూలతోటలు, ఎత్తైన అందమైన మేడలు కలిగిన చల్లని తిరుక్కుడంద నగరములో కొలువైన గోవిందుడా/ కాలనేమి, దంతవక్త్రుడు, మురుడు అను క్రూరమైన రాక్షసులు యమలోకము చేరునట్లుగా తలలు తెగునట్లు, వంగిన అందమైన ధనస్సు చేతిలో కలిగిన అద్వితీయుడా, అభయామృత స్వామీ,

60. తుమ్మెదలతో నిండి,  గుబురుగా పెరిగిన పూలతోటలు, నిండైన చెరువులను కలిగిన తిరుక్కుడంద నగరములో  పవళించిన మోహనాకారుడా/  ఎల్లప్పుడూ ఆగకుండా, మంచువాన కురుస్తుండగా, ఎత్తుగా పెరిగిన వెదుళ్లు తడిసి బరువుతో ఒంగి, మళ్లీ అవి

ఎండగానే, ఆకాశమునకు తాకునట్లుగా, పైకి లేచు వేంకటాచలమున కూడా కొలువై వున్నది నువ్వే కదా.

61. అడ్డుగా వచ్చిన పర్వత జల ప్రదేశములను దాటుతూ, నడిచిన నీ పాదములు నొప్పిపుడుతున్నాయా, శ్రీరామచంద్రా. నీటిలో మునిగి, భూదేవి బాధపడుతుండగా, వరాహమై విడదీసినప్పుడు, నీ దివ్య శరీరము అలసిపోయినదా, స్వామీ. పెరుగుతూ, ప్రవహించే కావేరి నది ఒడ్డున తిరుక్కుడందలో పవళించిన స్వామీ, కేశవా, నువ్వు క్షేమమే కదా, లేచి చెప్పు.

62. నల్లని నీటి కాకులు తిరిగే సరస్సుల ఒడ్డున గల నేరేడు చెట్లనుంచి, నల్లని నేరేడు పండ్లు దొర్లిపడగా, చేపలు తృళ్లిపడే, తిరుక్కురుంగుడి అను మహా నగరములో కొలువైన పూర్ణాయస్వామీ/ బలమైన భుజములు కల హిరణకశ్యపుడి మదము నిండిన మాత్సర్యపు శరీరమును రెండు భాగములుగా చేసి, సంతోషించిన నరసిం హమూర్తివి, నువ్వే కదా.

63. మోక్షము కొరకు ప్రశాంతముగా కూర్చొని, యోగమనే ఉపాయముతో, ధ్యానించు యోగుల హృదయములలో ప్రవేశించి, వారి క్రూరపాపములను తీర్చే దేవాదిదేవా/ ఎంత సులభముగా, నీవు, కొండల వంటి ఎత్తైన మేడలతో నిండిన పాడగము అను మహా నగరములో కూర్చొని, ఊరకము అను మహా నగరములో నిలుచొని, తిరువెహ్కా అను మహా నగరములో పడుకున్నావయ్యా.

64. నా స్వామి ఊరకము అను మహా నగరములో నిలుచున్నది, పాడకము అను మహా నగరములో కూర్చున్నది మరియు తిరువెహ్కా నగరములో పడుకున్నది, అంతా ఎప్పుడో, నేను పుట్టక ముందే, జరిగి పోయినది. అప్పటికింకా నేను పుట్టలేదు. కాని నేను పుట్టిన

దగ్గరనుంచి, నా స్వామిని మరిచి పోయినది లేదు. అందుకే ఆ స్వామి నిలుచున్నది, కూర్చున్నది, పడుకున్నది అంతా, నా మనస్సులోనే.

65. నేను లేక ముందు, నిలుచున్నది ఆ మహిమాన్విత వేంకటాద్రిపైన, కూర్చున్నది ఆ వైకుంఠమున, పడుకున్నది అలల తరంగపు ఆ మహా సముద్రమున.  కాని ఇప్పుడు ఆ అద్భుత నాథుడు, అనంతశయనుడు, జగత్కారణుడు, ఆ మాధవుడు నిలుచున్నది, కూర్చున్నది, పడుకున్నది అంతా, నా మనస్సులోనే.

66.ఈ భూమిపైన ఎవరైనా సరే, పుడుతూనో, చస్తూనో లేక బ్రతికినంత కాలము బ్రతికి, చస్తూనో వున్నారు. కాని ఎవ్వరూ శాశ్వతముగా వుండి సుఖపడినది లేదు. ఈ విషయము తెలిసి కూడా,  నీచులయిన ఈ మానవులు,  భూమిని కొలిచిన  వామనుడి  దివ్య పాదపద్మములను సేవిస్తూ, శాశ్వతముగా, పరమపదమైన ఆ వైకుంఠమునకు వెళ్లి, దేవతలతో సమానముగా వుండే విధము గురించి, ఎందుకు ప్రయత్నము చేయడం లేదో.

67. ఎన్నడూ తరగనంత పుణ్యఫలముతో,  సూర్యమండలము  మధ్య నుంచి  వెళ్లి, వైకుంఠమును చేరి, శాశ్వతమైన మోక్షమును పొందగోరేవారా/ చెబుతిన్నాను,  వినండి. తామర పువ్వుల వంటి ఎర్రని దివ్య పాద పద్మముల పుణ్యమూర్తి కీర్తి, మీ చెవిలో పడి, వినిపించునట్లుగా చేసుకొని, ఆ కీర్తనలను ఆనందముగా మనస్సున అనుభవిస్తూ, మీ పూర్వజన్మల క్రూర పాప ఫల దుఃఖములను పోగొట్టుకొని,  తరించండి.

68. త్రిగుణములైన సత్వ రజో తమో గుణములలో, రజో తమో గుణములకే ప్రాధాన్యతనిచ్చి, కోరికలతో, మోహావేశములో, నీచులు కొట్టుకొనిపోతున్నారు.  వారు వారి  యొక్క కర్మఫలమును పట్టించుకోక, పుడుతూ, చస్తూ, ఏ జన్మలోనూ, తరించే మార్గము లేకుండా,

పోతున్నారు. మీరు, ఆ విధముగా కాకుండా, తరించవలెనని అనుకున్నచో, గుత్తులు గుత్తులుగా పూయు తులసీదళముల మాలలను ధరించు, పరమపురుషుడిని తలుస్తూ, సుఖపడండి.

69. మీ కోరికలు తీర్చలేని, శక్తిలేని దేవతలను ఆశ్రయించి, కాపాడమని, చెడిపోయే జ్ఞానహీనులారా/ సర్వ కారణములకు నిలయమైన ఆ సర్వేశ్వరుడిని నమ్మి, కొలిచి మీ సంసారమనే కష్టాల తుప్పలను, ముక్కలు ముక్కలుగా, చేసుకోండి.

70. దేవతలందరూ భయముతో పారిపోయి, ఆకాశములో అటు ఇటూ, తలో దిక్కు చేరునట్లుగా, భయపెడుతూ, ఈటెలు బల్లెములు శూలములు రోకళ్లు గదలు కత్తులు గుట్టలు గుట్టలుగా విసురుతూ, వచ్చిన బాణాసురుడి వేయి చేతులను, శ్రీకృష్ణుడు ముక్కలు ముక్కలుగా నరికినప్పుడు, అ కల్లోల దృశ్యమును, ఆ దేవతలే చూడలేకపోయిరి.

71. తుమ్మెదలు వ్రాలు పరిమళించు పువ్వులను, మాలగా సింగారించు, బాణాసురుడి పుత్రిక ఉష కారణముగా, కోపముతో ఎదిరించుటకు వచ్చిన బాణాసురుడి వేయిచేతులను నరకి, కనికరించి, వదిలిపెట్టిన శ్రీకృష్ణుడిని చూసి, పారిపోయిన దేవతలందరూ, సిగ్గుపడిరి.

72. పుష్పములో కొలువై వున్న లక్ష్మీదేవి, భూదేవి ఇరువురు భార్యలు కాగా, తన నాభి నుండి వచ్చిన కమలములోని బ్రహ్మదేవుడు, ఆ స్వామి కుమారుడు. ఆ బ్రహ్మదేవుడి పుత్రుడు అయిన శివుడు, తన భార్య పార్వతీదేవికి, తన శరీరమున సగభాగమును ఇచ్చి, నందిపై ఎక్కెను, అని వేదములలో ఉన్నది నిజము. నేను దానిని వేరే విధముగా చెప్పడం లేదు.

73. ఒకనాడు చెట్ల పొదల నుండి బాణమును విడిచి, వాలిని చంపిన శ్రీరామచంద్రుడు, తన భక్తుల హృదయపు పొదలలోనికి బాణమును విడిచినప్పుడు, తమ మంచి హృదయములలో ఆ స్వామిని వుంచుకున్న వారికి తప్ప, వేరెవరికీ, పైలోకములలో వున్న నిండైన శాశ్వత భోగభాగ్యములను ఆ దేవాదిదేవుడు ఇవ్వడు.

74. ఉపాయ ఉపేయములు అయిన వామనుడి దివ్య పాద పద్మములకు నమస్కరించినచో, మనలోని జ్ఞానము వృద్ధి చెంది, భక్తి సంపద నిండుగా పెరుగును. తెల్లని తరంగములతో వ్యాపించి వున్న, మహా సముద్రమున కదలక, స్థిరముగా వుండే స్వామిని పూజించినచో, మనలో పెరిగిన క్రూరపాపములు, మన నుండి పీకి వేయబడి, సమూలముగా నాశనము చేయబడును.

75. మనస్సు చలించకుండా, అనేకజన్మలు కర్మయోగమును ఆచరిస్తూ, దేవాదిదేవుడైన ఆ స్వామి గుణములను ఒంట పట్టించుకొని, అ గుణములను తలుస్తూ, ఆత్మ శుద్ధి గలవారై, బ్రతుకుతూ పరభక్తి, పరజ్ఞానముతో, పరమ భక్తులైన వారు తప్ప, ఆ ఎర్రని కన్నుల ఆశ్రిత వ్యామోహనుడిని, ఎవరూ చూడలేరు.

76. తమ శరీరములోని పంచేంద్రియములు వెళ్లు దారిని అడ్డగించి, ఈ ప్రపంచములోని అధర్మ విషయముల వైపుకు తమ మనస్సుని వెళ్లనీయకుండా, మంచి విషయముల వైపు వెళ్లునట్లు, జ్ఞానమనే గొప్ప వెలుగు నిండిన దారిని చూస్తూ, తమ మనస్సును కరిగించి, ఎముకలు శిథిలమవునట్లుగా ఆర్తి పొంగి, ప్రకాశించునట్లుగా, చెయ్యలేనివారు ఎవరైనా సరే, ఆ చక్రధరుడిని చూడలేరు.

77. యిరపై నాలుగు తత్వములై, ఏడు ద్వీపములై, ఏడు సముద్రములై, ఏడు కుల పర్వతములై, ద్వాదశ ఆదిత్యులై వున్న ఆ ఆదిదేవుడిని, వేదశాస్త్రములో తెలిపిన అష్టాంగ విధిలో ఉపాసించి, నమస్కరించి, ఆ స్వామి మంత్రమైన అష్టాక్షరిని అనుసంధించువారు, ఆ పరమ పద వైకుంఠమునకు చేరు సమర్థులు, అగుదురు.

78. ఎటువంటి ఆటంకముఎదురైనా సరే కదలని మనస్సుతో, చలించని భక్తితో, నీటిలోని శేష పానుపుపై శయనించిన, పరమపావనుడి దివ్య పాదములను ప్రీతితో ఆశ్రయించి, ఆ స్వామి మంత్రమైన ఓ నమో నారాయణాయ, అను అష్టాక్షరిని నమ్మి, తలచుకునేవారు, ఆ పరమపద వైకుంఠమునకు చేరు సమర్థులు, అవుతారు.

79. పది దిక్కులలోని దిక్పాలకులై, సప్తస్వరములు, నవరసములై, పదునాలుగు లోకములలో నున్న జనులకు మంచి చేయుటకై, దశావతారములలో ఆవిర్భవించిన కరుణారస సాగరుడు అయిన ఆ స్వామి యందు భక్తిగలవారు మాత్రమే, ముక్తికి మార్గమైన మోక్షమునకు అర్హులు.

80. అందమైన తాటిపండు పైకి, మారువేషములో వచ్చిన ధేనుకాసురుడిని, చేతులు చాచి పైకి విసిరి, నాశనము చేసిన స్వామి దివ్య పాదములను ఆశ్రయించిన వారికి తప్ప, వేరొకరికి దేవతలతో సమానమైన స్థానము వుండదు.

81. చిలికిన పాలాముద్రమున పవళించి, కాలనేమి అని రాక్షసుడిని చంపి, పొగరు లేక ఒదిగి వున్న వాలి తమ్ముడు, సుగ్రీవుడికి సహాయపడుటకై, ఎత్తైన ఏడు చెట్లను, ఒకటేసారి పడగొట్టి, వేంకటాద్రిన నిండుగా కొలుపై వున్న స్వామి పాదములనే, ఎల్లప్పుడూ ఆశ్రయించి, తరించండి.

82.ఈ భూమిపై ఎన్నో విధాలుగా అవతరించి, అందరితో కలిసిపోయి వున్న నిన్ను అభిమానించి, త్రివిధ జలముల క్షీరసాగరమున, శేషపానుపుపై శయనించిన నీపై, భక్తి కలిగిన వారు మాత్రమే, ఈ ప్రపంచములోని ప్రకృతి సంబంధము వలన కలిగే బాధలను మరచిపోయి, ఈ లోకములోను, పై లోకములోను, అన్ని విధాలైన ఆనందమును, మనస్ఫూర్తిగా అనుభవించ గలరు.

83. తేనె నిండిన చల్లని తులసి మాలలు కలవాడా/ నీ పవిత్రమైన దివ్య పాదములను విడిచిపెట్టి, భక్తి అనే పాశముతో మనస్సును కట్టకుండా, ప్రేమలేకుండా వున్నచో, శాశ్వతమైన భోగభాగ్యపు పరమపద ఆనందమును పొందగలమా.

84. చక్రధరుడు తిరిగి నన్ను పుట్టింప తలచునో, లేక శాశ్వతముగా, తన పాదముల వద్ద ప్రేమగా వుంచుకొన తలచునో. ఇంతకు ముందు, తన మీద కొంచెము కూడా ఇష్టము లేని నీచుడను. ఆ స్వామి, తన మనస్సులో, నా విషయమున తలచే తలంపు, ఏ విధముగా వున్నదో.

85. విషపు పడగల ఆదిశేషుడిపై పవళించిన స్వామీ, మాయాలోలుడా, నిజముగా నీవు గొప్పవాడవు. నీ మాయా వేషములను తెలుసుకొంటిని. నీ దివ్య పాద పద్మములపై వుంచిన నా మనస్సును త్రిప్పివేసి, నీ నుంచి నన్ను దూరము చేసి, ఈ ప్రకృతి పాశములవైపు నడిపి, వాటిలో నన్ను పడవేయ వద్దు, స్వామీ.

86. బండిని తన్నిన దివ్యపాదములు కలవాడా, ప్రవహించే నీటి సరస్సునందు ఆడే పెద్ద పాము యొక్క బలమైన పడగలపై నాట్యమాడిన స్వామీ, శంఖము నిండిన శ్రీహస్తుడా/

నిజంగా, నీ ఎర్రని దివ్య పాదములను నిరంతరము ధ్యానిస్తున్న నన్ను, నీవు విముక్తుడిని చెయ్యవా,  కృష్ణా.

87. నుదుటిన కన్నుగల శివుడు, స్వర్గలోకపు ఇంద్రుడు, కమలమున పుట్టిన తపోవంతుడు బ్రహ్మదేవుడు, మిగిలిన దేవతలందరూ, ప్రతీ క్షణము నమస్కరించే పాదములు కలవాడా, వేదప్రతిపాద్యుడా, స్వామీ, నీ కన్నా వేరొకరు రక్ష ఏమీ లేనివాడను.

88. క్షీరసముద్రమున కొండను నాటి, తెల్లని పళ్ల పామును చుట్టి, అలలు ఒరియ చిలికిన నాడు, కొండ సముద్రములో మునగకుండా,  పెద్ద కూర్మమై వుండి, దేవతల బాధలను తీర్చే అమృతమనే మందును, దేవతలకు ఇచ్చిన ఆ ఉదార గుణవంతుడిని తప్ప, నేను వేరొక దైవమును తలవను.

89. ఎక్కువైన భూమి భారమును పోగుట్టుటకై, అర్జునుడి రథమును నడిపి, ఆశ్చర్యముగా జయమును కోరిన దుర్యోధనుడిని చంపి, వానికి వీరస్వర్గమును ఇచ్చి, రాజ్యమును పంచ పాండవులకు ఇచ్చి, కీర్తిగాంచిన నిన్ను తప్ప, నేను వేరు దైవమును తలవను.

90. నాలుగు కులములలో వున్న మంచి కులములో నేను పుట్టలేదు. మంచిని తెలుపు విశిష్టమైన నాలుగు వేదములను నేను చదవలేదు. నా శరీరములోని పంచేంద్రియములను జయించలేదు. ఈ ప్రపంచములోని విషయ శబ్దాదులకు లోబడి బ్రతికితిని. పరమ పావనుడా, నీ ప్రకాశించు దివ్య పాదములు తప్ప, వేరే ఏ ఆశ్రయము ఎరుగను,  స్వామీ.

91. అనురాగము నిండిన మృదు మధుర పలుకులతో, వాడి చూపుల విశాలపు కన్నుల సీత గురించి, లెక్కపెట్టలేనంతమంది రాక్షసులను అగ్ని వంటి బాణములతో సం హరించితివి. నీ

కన్నా రక్ష మరొకటి లేనివాడను. నీ వంటి బంధువు మరొకరు లేనివాడను. అనంతమైన అద్భుత శక్తియుక్తుడా, నిన్ను నా నుంచి ఎప్పుడూ ఎడబాయ వద్దు.

92. వృషభములు ఏడింటిని చంపి, బల్లెము వంటి వాడి చూపుల రాధ యొక్క మనస్సును దోచుకున్న గోపాల కృష్ణా, సముద్ర జలమును సృష్టించి, ఆ సముద్ర జలమునకు అడ్డుకట్టి, ఆ సముద్రజలముపై పవళించి, ఆ సముద్ర జలమునే చిలికిన నిన్ను నేను శరణు వేడుకొను చున్నాను. స్వామీ, భయపడవద్దు, అని నువ్వు, నాకు చెప్పవా.

93. పటిక బెల్లము వంటి తియ్యనైన నా స్వామీ, పాల కడలిలో పవళించిన భక్త సులుభుడా, కఠిన హృదయము కలవారు నశించునట్లు, తీవ్రమైన బాణములు వేసే కోదండమనే విల్లు కలిగిన శ్రీరామా, శ్రీరంగనాథా/ తుమ్మెదలు వాలు చల్లని తులసితో పూజించు, నీ దివ్య పాద పద్మములనే ఆశ్రయించాలని కోరుతూ, నమస్కరిస్తూ వున్న నన్ను, కనికరించు స్వామీ.

94. గోవులలో వున్న పంచగవ్యములు నీదే. అందులోని పవిత్రత, నీ ఆధీనములోనే వున్నది. ఈ లోకములో, ప్రతీ నిత్యము జరిగే, కళ్యాణ గుణ విభూతి అంతా నీదే. అందలి లీలలు అన్నీ, నీ ఆధీనములోనే వున్నాయి. అందమైన సముద్రము అంతా నీదే. అందులోని ఫలమంతా, నీ ఆధీనములోనే వున్నది. అదే విధముగా, నేను కూడా నీ ఆధీనములోనే వున్నాను. అజ్ఞానముతో నిండిన నా ఈ శరీరములో వున్న ప్రాణము, నీది. అందులో వున్న జ్ఞానము, నీ ఆధీనములోనే వున్నది. నాకు సర్వేశ్వరుడవు నువ్వే, శ్రీరామా.

95. నా శరీరములో జయింపరాని పంచేంద్రియములను అణచి, ఆశలు అను కోరికల వలయాగ్నిని, సమూలముగా నాశనము చేసుకొని వచ్చి, నీ కైంకర్య సేవలో వున్న నన్ను, నీవు వదిలించుకోవాలని తలచి, నాకు మంచిని చెయ్యక, పెద్ద ఆశల వలయములో, నన్ను

పడవేసినా, నడి సముద్రమున పవళించిన నువ్వు తప్ప, నన్ను రక్షించు వారు, వేరొకరు లేనివాడను స్వామీ.

96. అవధి లేని మాయాలోలుడా, ఏడులోకములు మొత్తము కలిసి, యుగయుగాలుగా, నిన్ను నిండుగా కీర్తించినా కూడా తరగని అవధి లేని కీర్తివంతుడా/ అవధిలేని అనేక జన్మలను పోగొట్టుకుంటూ వచ్చి, నీ దివ్య పాదముల యందు ఆసక్తితో, నేను పడివుంటిని. పుండరీకాక్షా/ నన్ను నీవు అనుగ్రహించు స్వామీ.

97. శంఖము, చక్రము, గద, ధనస్సు, ఖడ్గము ధరించిన అందమైన గొప్ప చేతులు కలవాడా, ఎర్రని తామర పువ్వులో పుట్టిన లక్ష్మీదేవిని, వక్షస్థలమున నిలుపుకున్న లక్ష్మీపతీ/ రక్త మాంసములతో నిండిన ఈ శరీరము అను వ్యాధిని పోగొట్టుకొని, తరించు ఉపాయమును కోరి, నిన్ను చేరవచ్చితిని. ఆ ఉపాయమును నాకు తెలిపి, నన్ను అనుగ్రహించు, స్వామీ.

98. నేను, నా కోపమును పోగొట్టుకొని, మోసపు బుద్ధిని విడిచి, నా ఈ శరీరములోని ఇంద్రియములు కోరుకునే కోరికలను వదిలించుకొని, నిన్ను చేరాలి, నిన్ను పొందాలి అనే ఆశ కలిగి, రోజు రోజుకూ అది పెరుగుతుండగా, బ్రతుకుతున్న నీ భక్తుడను, నన్ను నీవు మరువక, పుట్టుట చచ్చుట అను గొప్ప దుఃఖముల సుడిగుండము నుండి దాటు విధానమును నాకు చూపి, నీ దయను నాకు ఆనందముగా ప్రసాదించు స్వామీ.

99. నేను చేసిన క్రూరపాపములను గుర్తు చేసుకొని, దాని గురించి యమభటులు వేచి వున్నారన్న విషయమును, నా మనస్సు వినకుండా చేసి, నా ఆత్మను, రాధ భర్తవైన నీ యందే సమర్పించి, వుంచితిని. పుష్పవర్ణుడా/ నన్ను నీ నుండి విడతీయవద్దు స్వామీ.

100. జన్మ జన్మల వలన కలిగిన గొప్ప దుఃఖములను మరచిపోవునట్లుగా చేసి, జ్ఞానశూన్యులైన వారిని, ఈ సంసార సాగర చక్రము నుండి దాటించి, ఒడ్డుకు చేర్చు, నీ దుర్లభ దివ్య పాదముల యందు గల భక్తి, అను, ఎవరికీ కనిపించని ఓడ లభించు విధము తెలియక, తిరుగుతున్నాను స్వామీ, నాపై దయ చూపవయ్యా.

101.మంగళప్రదుడైన సముద్రవర్ణుడా, నా స్వామీ/ నీ భక్తులు, నీ వద్ద కోరికలు కోరుకుంటూ వుంటారు. భక్తుల కోరికలు తీర్చుటయే, నీ గొప్ప మనస్సు యొక్క నిండైన సంపద. అందుకే, అడుగుతున్నాను స్వామీ. చంచలమైన నా మనస్సులో, కదలని నీ దివ్య పాద పద్మములను ఉంచి, నిరంతరము నిన్ను తలచే భాగ్యమును ప్రసాదించు స్వామీ.

102. ప్రకాశించే నీ దివ్య పాదపద్మముల యందు తరగని అమూల్యమైన భక్తి భావమును వుంచి, నిన్నే రక్షగా తలచి, నా ఈ శరీరము అను వ్యాధిని పోగొట్టే విధానమును చెప్పు. తరంగపు అలల సముద్రమున పవళించిన సర్వేశ్వరా, వరాహమైన జయశీలుడా, పొంగే సముద్రపు నీటిని, రాళ్లతో అడ్డుకట్టిన నా స్వామీ/ నాకు సరి అయిన దారిని చూపు.

103. లక్ష్మీదేవిని కలిగి వున్న వక్షస్థలుడా, దేవాదిదేవా, వేదములలో నిండి, వేదమై వున్న పరమపావనుడా/ బంగారపు మెరుపు కలిగిన కాళమేఘము వంటి నల్లని శరీరము కలిగిన నీ పేర్లను, ఎటువంటి ఆటంకము లేకుండా, నిరంతరము తలుచుకునే భాగ్యమును ప్రసాదించు స్వామీ.

104. రాక్షసులైన కబంధుడు, దంతవక్త్రుడు, ఖరుడు, మూరుడు అను వారి శిరస్సులను పగలగొట్టి, ముక్కలు ముక్కలుగా చేసిన ఆయుధములను చేతులలో కలిగిన నా స్వామీ,

నేను కూర్చొని వున్నా, నిలుచొని వున్నా, పడుకొని వున్నా, తిరుగుతూ వున్నా, ఎల్లవేళలా నీ దివ్య పాదములను తలుస్తూ, నిన్నే నా మనస్సున నిండుగా నిలుపుకొను భాగ్యమును ప్రసాదించు స్వామీ.

105. ప్రళయకాలమున భూమిని ఆరగించి, ఆ తరువాత బయటకు తీసి, మరలా సృష్టించి, బలిచక్రవర్తిని ఆ భూమినే దానముగా అడిగి, దానినే కొలిచి, ఈ లోకము అనే భూమిని రక్షించువాడవు, నీవు తప్ప  ఎవరూ లేరు, అని అందరూ అనే కాలనిర్వాహకుడా, సుస్వర మధురమైన పలుకుల శ్రీదేవిని ఎదపై వుంచుకున్న పద్మనేత్రుడా/  చెప్పాలంటే,  ఈ ప్రపంచములో, అందమైన రూపము నీదే తప్ప,  వేరే లేనేలేదు. నీ తరువాతే ఎవరైనా.

106. కోపముతో ఎదిరించిన కాలనేమి అనే రాక్షసుడిని నరికి, యముడి వద్దకు పంపిన నీవు, శంఖము, చక్రము, గద, ధనస్సు, ఖడ్గమును ధరించితివి. పశువులకు వచ్చిన ఆపదను పోగొట్టుటకై,  అదే చేతితో అందరూ చూస్తుండగా,  కొండను ఎత్తితివి. ఇటువంటి నీ లీలలతో నిండిన విషయములపై తప్ప,  నాకు వేరే ఏ విషయములపై, కొంచెమైననూ ఇష్టము లేదు.

107. మహా కోపిష్టులు అయిన కాశీరాజు, దంతవక్త్రుడు, పౌండ్రుక వాసుదేవుడు, అతి కోపిష్టుడు అయిన మాలి, మహా బలవంతులైన సుమాలి, కేశి, ధేనుకాసురులు బాధపడి నశించునట్లుగా, వారి ఆయువును హరించిన నీ దివ్య పాదములపై కోరిక తప్ప, ఏ విషయముపై కోరిక లేదు స్వామీ.

108. ఎవరికీ హాని చెయ్యని గొప్ప వరములను ఇచ్చు బ్రహ్మదేవుడే,  స్వయముగా వచ్చినా గాని, సం హరించే శివుడు వచ్చి,  వరములిచ్చినా గాని, వేయికన్నుల దేవేంద్రుడు తన స్థానమునే ఇచ్చినా గాని, నేను వాటిని తీసుకోక,  మోక్షము అనే భోగభాగ్యమును పొంది, ఆ

స్వామితో కలిసి ఉండాలనే ఆశతో, ఎదురుచూస్తూ వుంటాను తప్ప, నా మనస్సులో మరొకటి తలవనయినా, తలవను.

109. నీవు చేయు పనులను బట్టి, నీకు నచ్చినట్లుగా వచ్చి, చాలా చిన్న వామనుడపై భూమిని గ్రహించితివి. అది తీసుకోవడానికి, చాలా పెద్దగా పెరిగి, త్రివిక్రముడవైతివి. అహంకారముతో నిండిన వారి చెడ్డ గుణములను తీసివేసే దేవాదిదేవుడని వేదవేదాంతులు, మునులు, ఋషులు, అందరూ కీర్తిస్తుండడంతో, నేను కూడా నిన్ను, అదే విధముగా కీర్తిస్తున్నాను.

110. పాలసముద్రమున శయనించినట్లుగా, భక్తుల ఎదలో శయనించిన సముద్రవర్ణుడా, నేను పవిత్రుడనయితినో లేదో, నాకు తెలియదు. కాని తుమ్మెదలు తిరిగే చల్లని తులసిని ధరించిన నా స్వామీ, నేను నీ భక్తుడను. నేను ఎల్లప్పుడూ నిన్ను సేవిస్తూ, పూజిస్తూనే వున్నాను. నేను చేయు ఈ పనులన్నిటిని, నీవు, నీ మనస్సుతో ఓర్పుగా చూసి, నాపై దయ చూపవయ్యా.

111. నిన్ను నిందించు వారిపై చాలా కోపముగా, వారి శక్తిని బట్టి యుద్ధము చేసి, నీ కోపాగ్నిలో భస్మము చేసి, వారిని నీ వద్దకు తీసుకొని వెళ్లి, తరింపచేయుదువని అనుకుంటున్నారు స్వామీ. సర్వలోక రక్షకా/ స్వామీ, నేను నీ భక్తుడను. నేను తెలవక, పొరబాటున నిన్ను నిందించినచో, చేసిన అపరాధములను మన్నించి, నా మంచినే స్వీకరించు, స్వామీ.

112. వ్యాధులతో, బలహీనముతో, ముసలితనమును పొంది, కత్తిపేటు వలె ఆయువు గతించి, చచ్చు రోజు ఎవరికైనా వచ్చును. అందుకే, ఆ స్వామి దివ్య పాదములకు సేవ చేయుటే

మంచిదని బాగా తెలుసుకొని, తిరుగు లేని భాగ్యమును పొందవలెనని తలచి, ఆ స్వామికి నమస్కరించి సుఖపడు, మనసా.

113. గంగను తలపై కలిగి, ఎర్రని జడల నల్లని కంఠము కలిగిన శివుడి బ్రహ్మ కపాలపు దుఃఖమును తీర్చిన, నిత్య కళ్యాణ గుణ సంపన్న విలక్షణమైన స్వామిని చేరు విధమును తలచి సుఖపడు, మనసా.

114. ఈ ప్రపంచములో, నీచమైన ధనధాన్య విద్యా యౌవన కుల సంపద రాజ్య అహంకార మదములు అనే ఎనిమిది మదములను వదిలిపెట్టి, వాటి వలన వచ్చు ధుఃఖములను విడిచి, పైకిపోయి, వైకుంఠమును చేరాలి, అనే ఆశతో, జ్ఞానమై, సూర్యప్రకాశమై భూమిని జ్ఞానదంతముతో వరాహమై విడదీసి, ఎత్తిన నా స్వామి యొక్క దివ్య పాదములను తలుస్తూ, నమస్కరిస్తూ, పూజించు మనసా.

115. తెలివి లేని ఓ మనసా/ ఎందుకో నీవు, ఈ సంసారమనే ధుఃఖ సాగరములో పడివున్నావు. మనకు తల్లీ తండ్రి దైవము అన్నీ అయివున్న స్వామి, దేవతలు, మోక్షమును పొందిన ముక్తులు సేవించు ఆ స్వామియే, మన యొక్క అనేక జన్మల పాపములను, మన వద్దకు చేరనీయకుండా పోగొట్టి, మనపై అభిమానమును చూపి, మన కైంకర్య సేవను స్వీకరించును.

116. లంకకు వెళ్లి, లంకను దహించి, ఎదిరించిన రావణుడి ఆయువు నశించునట్లుగా చంపి, విజయము పొందిన వీరాధివీరుడు, ఆ శ్రీరామచంద్రుడు తన నుంచి నన్ను విడదీసి, వేరు చేయక పోవడం వలన, ఆ యమధర్మరాజు, నన్ను ఆ స్వామి నుండి విడదీసి, నేను చేసిన పాపములను లెక్కించ గలిగే సాహసం ఇప్పుడు చెయ్యలేక పోతున్నాడు.

117. అనేక జన్మలలోని భయము, వ్యాధులు, మనోవ్యాధులు, ఆపదలు, అపాయములు, ముసలితనము వీటితో కలిసి వున్న ఈ శరీరమును పోగొట్టి, ఈ శరీరములోని మనస్సును ఆ పరమ పద వైకుంఠమునకు చేర్చు, అనంతమైన కీర్తికలిగిన ఆది అంతము లేనివాడు, విషపు ఆదిశేషుడి పానుపుపై పవళించిన వేద ప్రతిపాద్యుడు, ఆ స్వామి యొక్క చేతిని, ఎన్నడూ విడువకు మనసా.

118. నా మనస్సు, చాలా అభిమానముగా, తాను చేసే పనులతో, చెప్పే మాటలతో ఇటు సాయంసంధ్యలు, అటు రాత్రింబవళ్లు, సన్నని తీగవంటి కమలవాసిని అయిన శ్రీలక్ష్మీదేవికి నాథుడు అయిన ఆ స్వామి దివ్య పాదపద్మములనే తలుస్తూ, ఆ పాదములను వదలక, చుట్టుకొని, విడవడం లేదు.

119. చల్లని కావేరీనది నీటితో చుట్టిన శ్రీరంగమున, పుష్పవర్ణముతో కొలువైన శ్రీరంగనాథా/ స్వామీ, విను. ఇంతకు ముందు, నేను చాలా పాపములు చేసి వున్నా కాని, ఇప్పుడు నా ఆత్మ యందు, నీపై భక్తిభావము చిగురించి, అది పెరిగి, పెద్దదై మొగ్గ తొడిగి, వికసించిన పువ్వువలె విచ్చుకొని, సుతిమెత్తని నీ అందమైన ప్రకాశవంతపు దివ్య పాదములపై వచ్చి పడి, నిండుగా నిలిచి వున్నది. ఇప్పుడు, నా హృదయములో, పాపమునకు కాస్త కూడా చోటు లేక, నీపై కలిగిన స్వచ్ఛమైన భక్తి భావము, అంతటా నిండి వున్నది.

120. ఎల్లప్పుడూ ఒకే విధముగా వుండే, అనేక జన్మల నుంచి నన్ను తప్పించుటకే, ఇక్కడకు వచ్చి, నన్ను తరింప చేసిన ఆ మేఘవర్ణుడిని, నా మనస్సు నుండి విడదీయక, తన యందే నా మనస్సుకు ఇష్టము పెరుగునట్లుగా, నిండు తేజోమయుడై వుండుట చేత, నా ఆత్మ, తనను బాధపెట్టు, అవిద్యాదులైన మదమాత్సర్యములన్నిటిని, ముక్కలు ముక్కలుగా చేసుకొని, శాశ్వతమైన ఆ ఆనందస్థానమును పొందినది.

తిరుమళిశై ఆళ్వారు దివ్య పాదములకు నమస్కారములు.

************************

9. పురుషార్ధములైన ధర్మము, అర్ధము, కామము గురించి రచించిన పద్యాల అర్ధ రూపము.

.......................

తిరుమంగై ఆళ్వారు రచించిన పెరియ తిరుమడల్.

..........................

ఇందులో, పురుషార్ధములోని ధర్మము, అర్ధము, కామముల గురించి వివరిస్తూ, ఈ మానవ జన్మలో, ఇవన్నీ అనుభవించి, చివరకు మనము చేరవలసినది, మోక్షము నిచ్చే ఆ శ్రీమన్నారాయణుడి సన్నిధికే, అని తిరుమంగై ఆళ్వారు ఈ పెరియ తిరుమడల్ లో వివరించారు.

...............

అనేక మచ్చలు కలిగి, వేయినోళ్ల తేజస్సు నిండిన, ఆదిశేషుడి

రత్నపు శిఖర పడగల, అప్రాకృత కాంతుల నడుమ, తెల్లని

శేషపానుపుపై, ఒక నల్లని కొండవలె, మెరిసే మణిమయ మకర

కుండలముల ప్రకాశమాన శోభతో, అమరి వున్న స్వామికి మంగళము.

లెక్కింపరాని నక్షత్ర మండలముల గొప్ప కాంతులతో, మెరిసే ఆకాశము అను

గొడుగు క్రింద,  సూర్యచంద్రులు అను అఖండ దీపములను వెలిగించి,

తన తరంగనాదముల సవ్వడితో, శబ్దించు సముద్రపు అలల చామరమును

భూదేవి వీస్తుండగా, తాను కొలిచిన సుందరమైన ధృఢ పాదములకు మంగళము.

దేవతలు అభిమానించే వేంకటాద్రి అను మహోన్నతమైన పర్వతమును,  తన తలగా

చేసుకొని, మేఘములను జుట్టుగా కలిగి, ఆకాశమున తిరుగు తారలను కొప్పున

పూలుగా సింగారించుకొని, సుందరమైన హంసగమనపు వయ్యారాల భూదేవి

తన పచ్చని చేతులతో తాకు, ఆ స్వామి యొక్క దివ్య పాద పద్మములకు మంగళము.

శేషపానుపుపై తాను పవళించి వుండగా,

లక్ష్మీదేవి తన సుందరమైన,  సుతిమెత్తని

దివ్యహస్తములతో పాదములను ఒత్తుచుండగా,

యోగనిద్రలో అమరిన స్వామికి మంగళము.

యోగనిద్ర యందు మునిగిన స్వామి, తన నాభిలో

గొప్ప తేజస్సుతో ప్రకాశించే, ఏకైక తామరపువ్వును

సృష్టించి, ఆ పువ్వుపై,  బ్రహ్మదేవుడిని సృష్టించెను.

ఆ బ్రహ్మదేవుడితో పాటు, విశిష్టమైన నాలుగు వేదములను అనుగ్రహించెను.

ఆ వేదముల యందు, లోకములను సన్మార్గములో నడిపే

ధర్మము, అర్థము, కామము, మోక్షము

అను నాలుగు విధి విధానములు ఇమిడి వున్నాయి.

నాలుగింటిలో చివరిది మోక్షము, మనము

మరణించిన తరివాత వచ్చు ఫలితము.

సాటిలేని ఉన్నతమైన మోక్షమును ఆశపడినవారు, అడవులలోనికి వెళ్లి, అక్కడ చెట్లపై నుంచి క్రింద పడిన పండ్లను, ఎండిన ఆకులను తింటూ, తమ శరీరమును, తమను కష్టపెట్టుకుంటూ, కఠినమైన కుటీరముల యందు నిద్రిస్తూ, సూర్యుని ఎండలో ఎండి, నీటిలో తడిసి, అందమైన సరస్సులలో మునుగుతూ, జీవిస్తూ, ఈ లోకము నుండి ఈ శరీరమును విడిచిపోయిన తరువాత, అత్యున్నతమైన మోక్షమును పొందిరి, అన్న మాటలు చెప్పడం తప్ప, ఈ సమయములో ఫలానావారు, ఈ విధముగా పొందిరి, అని తెలిపినట్లు ఎక్కడా విన్నది లేదు.

భయంకరమైన సూర్యమండలము మధ్య నుంచి, చిన్న దారిలో వెళ్లగా, శాశ్వతమైన మోక్షమును పొందవచ్చును.

ఆ విధముగా వెళ్లినవారిని గురించి చెప్పండి, అని అడగగా, జ్ఞానహీనులైన అల్ప మనస్కులు తడబడుతుంటారు.

కాని అటువంటి వారికి కూడా మనము వివరముగా చెప్పవచ్చును.

ముందు పురుషార్థములో ధర్మము, అర్థము, కామము గురించి తెలుసుకుందాము.

వేదములలోని పురుషార్థములోని మొదటిది అయిన ధర్మము ప్రకారము, ధర్మమార్గమున జీవించినవారు, తమ జీవితము ముగించిన తరువాత,

ప్రకాశవంతమైన కాంతి కలిగిన బలమైన సిం హం వంటి సిం హాసనముపై, దేవతలందరూ కీర్తిస్తుండగా, అందమైన విశాలపు కన్నులు కలిగిన సౌందర్య రాశులు చామరలు వీస్తుండగా, మంచి పరిమళభరితమైన సువాసనలు దట్టముగా వెదజల్లుచుండగా, ఎంతో కాలము నుండి వేయికన్నులు కలిగిన దేవేంద్రుడు కూర్చొని, పాలించు, ఇంద్రలోకమునకు చేరి, మెరుపు

తీగల వంటి సన్నని నడుము కలిగిన సుందరాంగులు, తమ తెల్లని పలువరుసతో, పండు వెన్నెలే ఎదురు వచ్చి, పలకరించుతున్నదా అన్నట్లుగా వున్న, చల్లని చిరునవ్వుతో స్వాగతము పలకగా, లేడికన్నుల ఆ యువతుల చూపులను, ఆనందముగా అనుభవిస్తూ, ముందుకు అడుగులు వేయగా, అందమైన బంగారపు పూలతో అలరారు కల్ప వృక్షములతో నిండిన వనములను దాటుతూ, మందార మకరందమునకై పోటీపడు తుమ్మెదలు తిరిగే తోటలను చూస్తూ, నెమలి పింఛము వంటి మెత్తటి పొడవైన కురులలో పరిమళ పూలను ముడిచి, ప్రశాంతమైన చల్లని చూపుల విశాల కన్నుల సాధు స్వభావపు మెరుపు కాంతి కలిగిన వారితో, తమకు నచ్చినట్లుగా సంచరించు అందమైన ప్రదేశములతో నిండిన రత్న ఖచితమైన మణిమయ వజ్ర వైఢూర్య పగడపు స్థంభముల బంగారపు మండపములు, వాటిలో హంస నడకల అప్సరసలు, తమ సుతిమెత్తని చేతులతో వాయించే ఇంపైన వీణాగానమును వింటూ, సుఖపడెదరు.

ఇది ధర్మమనే పురుషార్థము యొక్క ఫలితము.

ఇక రెండవదైన అర్థము అనగా డబ్బు గురించి తెలుసుకుంటే,

వెన్నెల కాంతులను విరజిమ్ము, చంద్రుడు వుండు ఆకాశమున, మెరుపుల కారుమబ్బులతో పోటీపడుతూ, తిరిగే విమానములపై పయనిస్తూ, మందమైన కిటికీలు, గట్టిపైన తలుపులకు తాళములు కలిగిన మణిమయ ప్రకాశముతో వెలిగే ఇంటిలోనికి చూడగా, రత్నములు

పొదిగిన దీపపు కాంతులతోను, మెచ్చుకోదగిన విచిత్రమైన విశాలపు సుతిమెత్తని పానుపులతోను, ఇంటి బయట వాకిటిలో హంసలు త్రొక్కగా, నలిగి పొడిపొడి అయిన రంగురంగుల పూలపుప్పొడి రంగవల్లులతోను, చిన్న చిన్న పూలతీగల సువాసనలతోను, మధురమైన మందార మకరంద మధురిమలతోను, పెద్ద పెద్ద చెట్లతోను, పూలపై వ్రాలు రంగు రంగుల తుమ్మెదలతోను, ఇంత మందాన కమ్మటి సువాసన గాలిలో వీచుచుండగా, ఈ భూమిపైన సుఖమును అనుభవించెదరు.

ఇది అర్థము అనే పురుషార్థము యొక్క ఫలితము.

ఇక మూడవదైన కామము వద్దకు వస్తే,

మంచి సువాసనా భరితమైన, చందనపు చల్ల గాలి వెంబడించినను, ఆ మైమరపు నింపే మధురమైన స్పర్శను పట్టించుకోక, సన్నని నడుము గల వయ్యారపు సుందరి వంపు మెడలోని సుందరహారములు, ఆమె ఎదపై కదులుతుండగా, తన మనస్సును పారేసుకొని, అర నిమిషము కూడా, తన విశాలమైన కనుసన్నల నుండి ఆమె రూపును విడువక, తన శరీరము చితికి సన్నమై, శిథిలమవుతున్ననూ ఎరుగక, ఆ స్త్రీ యొక్క లేడికన్నుల చూపులకై ఎదురుచూసి, ఆ యువతిని పొంది, అందమైన చిరునవ్వు కలిగిన ఆ అధరపు భోగ్యామృతమును పానమొనర్చుటను, కామము అందురు.

సంస్కృత వేదములలో వున్న కామపు నిర్వచనములను చూడగా,

మలయ పర్వతములపై నుంచి వీచు దక్షిణపు గాలుల,  చందన పరిమళపు,  చల్లని పిల్లతెమ్మెరల, సుతిమెత్తని పలకరింపులకు,  అనిర్వచనమైన అనుభూతిని పొందనివారు,

గోపాలుడి సమ్మోహనపు వేణుగాన రసమునకు కరిగిపోనివారు, ఆలమందలోని ఎద్దుల గంటల లయబద్ధమైన సవ్వడికి వాడిపోనివారు, తాటిచెట్టుపై కూతపెట్టు,  కోయిల గానమునకు పరవశించని వారు,

నిండు పున్నమి చంద్రుడు వెదజల్లు,  స్వచ్ఛమైన వెండి వెన్నెల వెలుగులను,  విరహపు వేడి సెగలుగా తలుస్తూ  తల్లడిల్లనివారు,  అందమైన మన్మథుడి పూలబాణమునకు పులకరించనివారు వుంటారా.

ఇవి సంస్కృత వేదములలో వున్న కామపు నిర్వచనములు.

వీటిని ఇష్టపడని వారు వుండరు కాక వుండరు.

లేడి చూపుల హంస నడకల స్త్రీలు, కష్టపెట్టు తమ భర్తలతో కలిసి, బ్రతికే సాహసము చెయ్యరు. స్త్రీల మనస్సు చాలా చంచలము, అని ద్రవిడ శాస్త్రములోని నానుడి. కాని, దీనిని మేము నమ్మము కాక నమ్మము.

రాజ వీథులలోని, అందమైన అంతఃపురములలో, వికసించిన పువ్వులను, తమ మెత్తని కొప్పునిండా పెట్టుకొని, చల్లని సుగంధ పరిమళముల, మందగమన పిల్లగాలి, తమ శరీరమునకు తగులుచుండగా, మృదువైన పువ్వుల పానుపుపై, నిద్రించుచున్న బంగారపు వన్నె స్త్రీలు, సిరిసంపదలలో మునిగి తేలెదరు, అని అంటారు.

కాని,

రణరంగ పరాక్రముడు అయిన రాముడు, తన తండ్రికి ఇచ్చిన మాటకై, కీర్తిప్రతిష్టలు నిండిన సంపన్న రాజ్యమును వదిలి, అందమైన నగరవాసులు బాధపడుతూ, వెళ్లవద్దు, అని అంటూ, తమ వెనుక వస్తున్నా, పట్టించుకోక, మాట తప్పక, నాలుగు వైపుల మంటల సెగలతో, ఎండమావులు నిండిన ఎడారిలో, రాళ్లపై పడిన కాళ్లు మంటలు మండి, అ వేడికి వెదురు కొమ్మల వలె చీలుతున్ననూ, సుడిగాలులు వీస్తున్ననూ, భూత ప్రేత పిశాచములు తిరిగే భయంకరమైన అడవిలో, కోపముతో మండే సూర్యుడి ఎండవేడిలో, ఖళఖళ మనే ఎర్రని నిప్పు రవ్వల వలె మండే రాళ్లపై వెడుతున్నప్పుడు, తన మృదువైన దూది వంటి పాదములతో, రాజైన తన భర్త శ్రీరాముడి వెంట వైదేహి సీత, ఆ దేవత మెల్లని హంస నడకలతో, వెళ్లలేదా.

మరియు,  ఎర్రని పెదవుల,  నల్లని పెద్ద పెద్ద కన్నుల లేడి చూపులతో, మెరుపు వంటి సన్నని నడుము కలిగిన వేగవతి అను కన్య, తన ప్రియమైన ప్రాణనాథుడిని చూడకుండా, ఆమె అన్న,  ఆమెను బలవంతముగా తీసుకొని వెళ్లగా, అమె వారిని కాదని, వారిని అవమానించి, వారితో యుద్ధము చేసి, రాయివంటి ధృడభుజములు కలిగిన తన ప్రియనాథుడి చెయ్యి పట్టి, అతని బంగారు మేనును స్వీకరించలేదా.

నాగ లోకపు నాగరాజు యొక్క గారాల ముద్దుబిడ్డ సిగ్గు, బిడియము అన్నీ విడిచి,  గంగానది ప్రవహించు,  అందమైన ఐశ్వర్యవంతమైన స్వర్ణమయ రాజ్యములో, కాంతి వేగముతో కదిలే పొడవైన కత్తులు కలిగిన కురువంశపు వారిలో ముఖ్యుడు, తనకు తానే సాటి వేరొకరు లేని అర్జునుడే,  తనకు తగిన వరుడు అని తలచి, తన తండ్రిని వప్పించి, అతడిని పెండ్లాడలేదా. భర్తతో కలిసి,  అందమైన అతని నగరములో,  జీవితాంతము హాయిగా సుఖపడినట్లు, మహాభారతమున వినలేదా.

ఇంద్రునితో యుద్ధము చేసి, ఓడించిన హిరణ్య నగరపు రాజు, అసురులలో అద్వితీయ బలవంతుడు ఆ బాణాసురుడి కూతురు, ఈ లోకములోనే అపురూప సౌందర్యరాశి, గొప్ప గొప్ప మహిమలు సంపాదించిన చాలా తెలివి గల ఉష, తాను ప్రాణముగా వలచిన అనిరుద్ధుడిని, తులసి మాలలను ధరించిన రత్నపు కొండవంటి భుజములు కలిగిన మాయాలోలుడు, పాపాత్ముకురాలినైన నాకు,  తనపై భక్తి,  అనే విరహావస్థను కలగ చేసిన ఆ

శ్రీకృష్ణుడి మనవడిని, తన యోగబలము చేత తీసుకొని వచ్చి, తన మందిరములో వుంచుకొని, సుఖపడలేదా.

ఇటువంటివి ఇంకా చాలా వున్నాయి, చెప్పమంటారా. తెలివితక్కువ వారా, ఏమని చెప్పను.

కదలని హిమాలయముల పర్వతరాజు అందాల పుత్రిక, తెల్లని కాంతి వెన్నెల వలె వెలుగు, అందమైన పలువరుస కలిగిన ఎర్రని అధరములతో, సన్నని నడుము కలిగి, హంస నడకలతో నడిచే దేవకన్య, ఉమాదేవి, వేయి భుజములు కలిగిన చేతులను అన్ని దిక్కులకు చాచి, కడియపు కాళ్లు పైకి క్రిందకు కదుపుతూ, నిప్పురవ్వలు చిందునట్లు చిందులు వేస్తూ, ఏడు లోకములలోని దేవతలు ఆకాశమునుండి చూస్తుండగా, కుల పర్వతములు, గాలి, నక్షత్రములు అన్నీ కూడా, తన చుట్టూ తిరుగుచుండగా, శత్రువులను సం హరించు మూడాకుల శూలమును ధరించి, శివతాండవము చేయు భస్మధారి, ఆ శివుడిని కోరి, ఆమె తన యొక్క అందమైన శరీరము క్షీణించుకొనునట్లుగా చేసుకొని, అతి కష్టమైననూ, తన పంచేంద్రియములను అదుపులో పెట్టి, తన యొక్క జుట్టును విడదీసి, తాను కూడా జటాధారియై, భయంకరమైన తపస్సు చేసి ఆ ఈశ్వరుడిని చేరలేదా.

కామము అనే కోరిక ఒక్క మగవారికే కాదు, ఆడవారికి కూడా వున్నది, అని చెప్పుటకు ఇది చాలా, లేక చాటభారతమంత వుంది, ఇంకా చెప్పమంటారా.

పాపాత్మురాలిని అయిన నాకు, ఆ భగవంతుడిపై కలిగిన కామపు బాధను, ఇప్పుడు చెబుతున్నాను, వినండి.

పెద్ద పెద్ద తోటలతో నిండి వుండి, వేదవేత్తలకు నిలయమైన తిరునరై ఊరిలో, పెద్ద పర్వతమంత ఎత్తులో వున్న, కళానైపుణ్యపు మండపము యొక్క తలుపులను దాటుకొని, లోపలికి ప్రవేశించిన నేను, నా కన్నులు చెదురునట్లుగా వున్న, సుందరమైన దృశ్యమును చూసితిని.

నీలమణులతో ప్రకాశించే ఒక పెద్ద కొండపై, విరబూసిన తామరపువ్వుల మెరుపు కాంతులతో నిండిన, అద్భుతమైన ఆ సర్వేశ్వరుడి ఆకారమును చూసి, ఉలిక్కిపడితిని.

ఆహా/ ఏమి వున్నది, ఆ ఆకారము. అద్భుతము. ఆ స్వామి యొక్క లక్ష్మీదేవి కొలువై వున్న ఎత్తైన దివ్య వక్షస్థలము, ఆ పెదవులు, ఆ కన్నులు, అభయమిచ్చు ఆ హస్తములు, ఆ దివ్య పాదములు రెండూ, అన్నీ, అన్నీ కూడా ఎర్ర తామరపువ్వు రంగుతో నిండి వున్న బంగారపు తోట వలె వున్నది.

అంతేకాదు, ఆ సుందరమైన దివ్య విగ్రహము నడుమునకు పట్టు పీతాంబరము, భుజములకు నిండైన భుజకీర్తులు, చెవులకు మకర కుండలములు,మెడలో బంగారపు హారములు, తలపై ఎత్తైన అమోఘపు కాంతిభరితమైన కిరీటము, అందులో ప్రకాశించే రత్నములతో, కదలని మరకత మణి పర్వతము వలె, వున్నాడు సర్వేశ్వరుడైన ఆ శ్రీనివాసుడు.

ఆహా/ పక్కన, అందమైన నెమలి కంఠమునకు, అటు ఇటు, లేత వెదురు కొమ్మల వంటి రెండు భుజములు, దొండపండు వంటి ఎర్రని అధరము, మిల మిల మెరిసే, చేప కన్నుల లేడి చూపులతో, హంస వంటి తెల్లని తెలుపు నిండిన, అద్భుతమైన మంజులవల్లి ఆ లక్ష్మీదేవియే నిలిచి వున్నది.

ఆ దివ్య మోహన సౌందర్య రూపము పక్కన, చాలా అందమైన లక్ష్మీదేవి వున్నది, అన్న విషయమును కూడా పట్టించుకోక, నా మనస్సును అక్కడికక్కడే పోగొట్టుకుంటిని. ఆ మనస్సుతో పాటు, నా చేతికి నిండుగా వున్న బంగారపు గాజులను, నాతో తెచ్చుకున్న పట్టుబట్టలను కూడా పోగొట్టుకుంటిని.

నన్ను చూసి, సముద్రము ఘోషించుచున్నట్లుగా, అనిపిస్తున్నది. చంద్రుడు వెదజల్లు చల్లని వెన్నెల కూడా నాకు వేడిసెగ వలె వుంటున్నది.

ఇప్పుడు, నా మనస్సు యొక్క ఆలోచనలు,  మారునట్లు ఆ సర్వేశ్వరుడు చేసెనా, ఏమో.

దక్షిణదిక్కున వున్న మలయపర్వతముపై నున్న  చందనపు వనములలోని,  చందనపు పూల పుప్పొడిని తాకి, మధుర పరిమళములతో తిరుగుతూ, ఈ లోకమునంతా ఆనందింప చేస్తూ, సుతిమెత్తగా వీచు,  చల్లని పిల్లగాలికి కూడా,  నేను తాళలేక పోతున్నాను.  నా శరీరము మండుతున్నట్లుగా,  వున్నది.

తాటిచెట్టుపై,  ముళ్లపుల్ల గూటిలో,  చాలా మెల్లగా కూయు,  పెన్నడపక్షి యొక్క కూత కూడా,  నా మనస్సును కోయు రంపపు ధ్వని వలె,  వినిపిస్తున్నది.  నేను ఏమి చేయుదును.

బండ వంటి కాముడు,  తన చేతిలోని చెరుకు విల్లును వంచి,  భుజము వరకు లాగి, ఒంటరినైన నా పైకి, నా మనస్సునే లక్ష్యముగా చేసుకొని, గురిచూసి,  పుష్ప బాణములతో కొట్టుచున్నాడు. వాటి నుండి నన్ను కాపాడువారు ఎవరూ లేక పిచ్చిదాననైతిని.

రాళ్లూ రప్పలతో నిండిన అడవిలోని ఒక తీగపై, అరవిరిసిన, అద్భుతమైన, అందమైన పువ్వు యొక్క పరిమళము, ఎవరికీ చెందక, వృథా అయి, ఎడారిలో నేలరాలినట్లుగా, అయినది నా బ్రతుకు.

నా యొక్క ఆడతనము, నా మనస్సు, నా శరీరము ఆ తిరుక్కణ్ణపురములో కొలువై వున్న లక్ష్మీపతి, శౌరిరాజ స్వామి యొక్క బంగారపు కొండవలె ప్రకాశించు, ఆతని సుందరమైన వక్షస్థలమును చేరనందుకు, నా బ్రతుకు వ్యర్థమై, నాకే భారమవుతూ, అనుక్షణము నన్ను బాధిస్తున్నది.

ఈ బాధనుండి రక్షించే మంచి మందును తెలిసినవారు, ఎవరైనా వున్నారా.

రాత్రివేళ తీరుబాటుగా, నెమరువేయు సమయమున, శ్రావ్యముగా వినిపించే, సుందరమైన ఎద్దుల మూపురముల మెడలోని గంటల సవ్వడి కూడా, నా చెవులకు, కర్ణకఠోరమైన భయంకరమైన చప్పుడుగా అనిపిస్తూ, నన్ను బాధిస్తున్నది.

దీని నుండి నన్ను నేను రక్షించుకునే విధమును తెలపండి.

నాకు ఈ పరిస్థితిని కల్పించిన తులసిమాలలను ధరించిన స్వామి, ఇంతకు ముందు, ఆ చంద్రుడి దుఃఖమును తీర్చిన మేఘవర్ణుడు, పరిమళించు సరాగపు అతసీ పుష్పవర్ణుడు,

తన నల్లని రంగు వంటి,  సముద్రముపై రాళ్లను వేసి, వారధిని కట్టి, రాక్షస రాజైన రావణుడి పెద్దవైన పదితలలు,  నేలపై దొర్లునట్లుగా,  బాణములు వేసి, భయంకర యుద్ధమున యమలోకమునకు పంపిన శూరుడు,

వేయికన్నుల ఇంద్రుడి స్వర్గమును, దేవతల దేవలోకములను, తన భుజబలముతో వశపరచుకున్న హిరణ్యకశ్యపుడిని, పెద్ద సిం హరూపుడై,  అగ్నివలె,  కోపముగా చూసి, భయంకరమైన యుద్ధమును చేయకుండా, ఆ హిరణ్యుడి కిరీటపు తలను,  బరబరా ఈడ్చుకుంటూ, దగ్గరగా తీసుకొని, తన తొడపై పెట్టుకొని, ఆ రాక్షసుడి ఎర్రని బంగారపు వన్నె శరీరమును,  తన పదునైన గోళ్లతో చీల్చి,  చంపినాడు.

గొప్ప మెరుపు వెలుగులతో,  ప్రకాశించే చక్రాయుధమును ధరించిన వీరుడు,

ప్రళయకాల సమయమున, కళకళలాడే ఈ విశాల భూమిని మ్రింగి, తిరిగి సాటిలేని వరాహమై, ఆ గొప్ప జలములోనికే ప్రవేశించి, ఒంగిన తన కఠినమైన, పదునైన దంతము చివరన,  ఈ విశాల భూమిని ఉంచి, నీటి నుండి పైకెత్తిన ఆశ్చర్యపు అద్భుతుడు,

ఉత్తర దిశగా వున్న పెద్ద మందర పర్వతమును కవ్వముగా చేసుకొని, వాసుకి అను గొప్పజాతి పామును త్రాడుగా చేసుకొని, వెలిగే సూర్యచంద్రులు, ఆకాశములోని నక్షత్రములు

కూడా తనతో తిరుగునట్లుగా, కొండను తిప్పి, అమృతమును దేవతలకు పంచి, వారి చిరకాలపు దుఃఖమును తీర్చిన ఉదారుడు,

అంతేకాకుండా, తన రూపమును ఎవరూ గుర్తించలేనట్లు, తాను ఒక చిన్న పొట్టి బ్రహ్మచారి వామనుడై వచ్చి, ఆ బలిచక్రవర్తి యొక్క గొప్ప యాగభూమిలోకి ప్రవేశించి, రణశూరుడైన రాక్షసరాజు, బలిచక్రవర్తి మనస్సును ఆనందింపచేసి, మంచి మాటలతో అతని మనస్సును కరిగించి, నా పాదముతో నేను కొలుచునట్లుగా, మూడడుగుల భూమిని నాకు ఇమ్ము, రాజా/ అని నోరు తెరిచి అడగగా, అలాగే నా చేత ఇవ్వబడినది, తీసుకో, అని బలిచక్రవర్తి నీటిని దానముగా ఇవ్వగా, ఆ క్షణమునందే, ఆ స్వామి మెరిసే మణిమయ కిరీటము వెళ్లి, ఆకాశమును తాకగా, అందమైన కంకణములు కలిగిన పాదము, ఏడులోకములను ఆక్రమించగా, మళ్లీ, ఆ బలిచక్రవర్తి తన మోసముతో, ఈ విశాల భూమండలముపైకి చేరకుండా, అసురులు భయపడునట్లుగా, తన పాదముతో, పాతాళమునకు అణగగొట్టి, భూమిని తన లోకముగా చేసుకున్న విశాల పాదపద్మములు కలవాడు,

తామరపువ్వులో విలసిల్లే, సన్నని నడుము కల లక్ష్మీదేవికి నాయకుడు,

తిరువిణ్ణకరు నగరములో కొలువై వున్న బంగారు కొండ, శ్రీనివాసుడిని,

మణిమాణిక్యములు ఒడ్డుకు తోయు కావేరీనది నిండుగా ప్రవహించు, అందమైన

కుంభకోణము అను నగరమున వున్న రణవీరుడు,  అభయామృత స్వామిని,

దక్షిణదిక్కున  తిరుక్కురుంగుడి నగరములోని అందమైన పగడపుకొండ, పూర్ణాయస్వామిని,

ఎల్లప్పుడూ చల్లగా వుండే తిరుచ్చేరై నగరములోని ఉదారస్వభావుడు,  తోతాద్రినాథస్వామిని,

విశాలమైన పువ్వులపై హంసలు నిద్రపోయే నీటితో చుట్టబడి వున్న,  అందమైన

పంటపొలములు కలిగిన తిరువాలి నగరములోని నా అమృతతుల్యుడు,  కేథార స్వామిని,

కొత్త గుడి గోపురముల తిరుక్కణ్ణమంగై నగరములోని కల్పవృక్షము,  భక్తవత్సల స్వామిని,

మెరిసే శంఖచక్రములతో తిరువెళ్లరై నగరపు రత్నమయమహిమాన్వితుడు,పుండరీకాక్షుడిని,

తిరువెవ్వుళు నగరములోని పెద్ద కొండ,  సుందరాయస్వామిని,

తిరుప్పుట్కుళి నగరములోని నా రణధీరుడు,  విజయరాఘువ స్వామిని,

పేరుగాంచిన శ్రీరంగమున కొలువైన కీర్తివంతపు మణిమయుడు,  శ్రీరంగనాథుడిని,

తిరువల్లవాళ నగరములో కొలువైన నీళానాయకుడు,  సుందరాయ స్వామిని,

పాలకడలిన పవళించిన తొణకని మణిదీపము,

నా మనస్సులోని మోహనాకారుడు ఆ శ్రీమన్నారాయణుడిని,

తిరువిడంద నగరములో కొలుపైన నా స్వామి, లక్ష్మీవరాహ స్వామిని,

తిరుత్తంగాల నగరములోని అతిబలవంతుడు, నారాయణమూర్తిని,

కళకళలాడే తిరుక్కడలమలై నగరములోని మాయాలోలుడు, స్థలాశనాయస్వామిని,

దేవతల యొక్క శిరోమణుల కాంతి వెలుగైన, ఆ దేవాదిదేవుడిని,

తిరుప్పేర నగరములోని జన్మాంత రహితుడు, మకర కుండల స్వామిని,

ఎవరూ ఎరుగలేని, పరతత్వమైన, ముత్యము వంటి తెల్లని పరమాత్మను,

ప్రళయకాలమున హంస అయి, మత్స్యమై, సిం హమై, అమరమైన వేదమై,

ఈ లోకమును మ్రింగిన దివ్య మంగళ విగ్రహమూర్తి అయిన సర్వేశ్వరుడిని,

తిరుక్కోవలూరు నగరములోని మండపములో అమరిన నిక్షేప స్వామిని,

పూతన అరుచునట్లుగా,  పాలు త్రాగిన చంటిబిడ్డడు,  చిన్నికృష్ణుడిని,

హంసలు ఆహారమునకై వెదుకు సరస్సులు కలిగిన,

అజుందూరు నగరములో విలసిల్లే ఉజ్వలుడు,  శక్తినాథ స్వామిని,

దక్షిణదిక్కున తిల్లై చిత్రకూటమునందు కొలువైన ఐశ్వర్యవంతుడు,  గోవిందరాజ స్వామిని,

మెరిసే దట్టమైన మేఘములు తిరిగే వేంకటాద్రిపైన కొలువైన సర్వజ్ఞుడు,  శ్రీనివాసుడిని,

తిరుమాలిరుంశోలై నగరములో కొలువైన రాజు చక్రధరుడు,  సుందర స్వామిని,

తిరుక్కోట్టియూరు నగరములోని నారసిం హావతారుడు,  ఉరగశయనాయ స్వామిని,

తిరుమెయ్యం నగరములో కొలువైన అమృతప్రవాహుడు,  సత్యగిరినాథ స్వామిని,

ధృడమైన గుడి ప్రాకారములు కలిగిన కంచినగరపు స్వామి,  దేవతిరాజ స్వామిని,

తిరువిందళూరు నగరములోని పరమపావనుడు,  రంగనాథ స్వామిని,

తిరువేళుక్కై నగరములో కొలువైన నరసిం హ స్వామిని,

తిరుప్పాడగము నగరములో అమరిన మాయావి, పాండవదూత స్వామిని,

తిరువెహకా నగరములో యోగనిద్రలో అమరిన స్వామి, యథోక్తకార స్వామిని,

తిరువూరకము నగరములోని విలక్షణుడు, త్రివిక్రముడిని,

అష్టభుజగ నగరమందలి విశిష్టమైన వాడు, గజేంద్ర వరద స్వామిని,

తిరుమూళిక్కళము నందు కొలువైన మణిదీపము, సూక్తినాథ స్వామిని,

ఆతనూరు నగరములో నివసించే కాలనిర్వాహకుడు, అధినాయక స్వామిని,

భూత భవిష్యత్తు వర్తమాన నిర్వాహకుడు, తిరునీర్మల వాసుడు, జలధి వర్ణాయ స్వామిని,

నాలుగు వేదములైన స్వామి, తిరుప్పుల్లాణిలో నిండి వున్న కళ్యాణ జగన్నాథ స్వామిని,

దక్షిణ భారతదేశపు ద్రవిడము, ఉత్తర భారతదేశపు సంస్కృతములలో

నిండిన వేదవేద్యుడు, తిరునాంగూరులో కొలువై వున్న గోపాలకృష్ణుడిని,

ప్రసిద్ధమైన మణిమాడక్కోయిలలో కొలువైన నాయకుడు, నారాయణ స్వామిని,

మంచి నీటి సరస్సులతో చుట్టిన తలైచ్చంగాడు నగరములోని పూర్ణచంద్ర స్వామిని,

సుందరమైన తిరునరైయూరిలో కొలువైన ధృఢవంతుడు, శ్రీనివాసుడిని,

మణిక్కూడములోని నాయకుడు, బండ భుజములు కలిగిన మణిపర్వత స్వామిని,

తిరుక్కణ్ణపురములో నివసించే శౌరిరాజ స్వామిని,

నవమన్మథుడు, ఆ శ్రీకృష్ణుడిని నేను చూసి,

నమస్కరించి,

నా పరిస్థితి అంతా, సవివరముగా తెలిపినప్పుడు, ఆ స్వామి, నాపై తన కరుణాకటాక్షములను చూపి, తన దివ్య మంగళ విగ్రహము వద్దకు, నన్ను చేర్చుకున్నచో, నేను ధన్యురాలిని.

అలా కాకుండా,

ఆ స్వామి, నన్ను తన దరికి చేర్చుకొనక పోయినచో, నేను

మెరుపు వంటి సన్నని నడుముల సుందరాంగుల ఎదుట,

వేదములు తెలిసిన వేదవేత్తలు నివసించే చోట,

ఆ స్వామి యొక్క భక్తుల ముందు,

భూమినంతా ఏలాలి,  అనే ఆశతో భయంకరమైన యుద్ధములు చేసే రాజుల ఎదుట,

దేశదేశముల యందు,

ఆ స్వామి,  ఇంతకు ముందు చేసిన చెడ్డ పనులన్నింటిని, అందరికి తెలిసేటట్లుగా, పెద్ద గొంతుకతో, ఎలుగెత్తి చాటెదను.

అవి ఏమిటంటే,

రేపల్లెలో,  మెరుపు వంటి సన్నని నడుము కలిగిన గోపికల ఇంటి తలుపుల తడికలను తెరచి, దొంగతనముగా దూరి, అక్కడ వుంచిన పాలు పెరుగు వెన్నను కడుపారా ఆరగించగా, కోపగించిన చేపకన్నుల గోపికలు, యశోదాదేవితో కలిసి పట్టుకొని, ఒక పెద్ద త్రాడుతో,  రోటికి కట్టగా, కట్టబడిన అల్లరితనమును,

గోపాలురు చేయు ఉత్సవమున, గోవర్ధన పర్వతము దగ్గర నైవేద్యము పెట్టుటకై,  పెద్ద పెద్ద బండ్లపై తెచ్చిన ఆహారమును,  పెద్ద భూతమై, మొత్తము ఆరగించిన సిగ్గులేనితనమును,

కుంభనృత్యము చేసి, గోపికల హృదయమును దోచుకొని, వారిని విరహములో నెట్టగా, ఆ విరహపు బాధతో కొట్టుకొని పోతున్న గోపికలు, నీవు నా వద్దకు రాకు, అని పలికిన అతి దైన్యపు మాటలను,

కౌరవ రాజుల నిండు సభలో, పాండవ దూతగా వెళ్లినప్పుడు, ఆ స్వామిని నిందిస్తూ, అందరూ పలికిన మాటలను,

దక్షిణము వైపున వున్న లంకానగరములోని రాక్షసజాతి స్త్రీ, రావణాసురుడి ప్రియమైన చెల్లెలు, రంపపు దంతములు కలిగిన గయ్యాళి శూర్పణఖ యొక్క మనస్సును కామముతో రగల్చగా, ఆమె మనస్సు వివర్ణమై, ముక్కలు ముక్కలై, నువ్వే కావాలి, అని కోరి వచ్చిన ఆమె ముక్కు చెవులను కోసిన విధమును,

పెద్ద పర్వతాకారము వంటి భయంకరమైన రాక్షసి తాటకిని, ఆడది అని కూడా చూడకుండా, విశ్వామిత్రుడు చేయు యాగ సమయమున, పరాక్రమముతో, యమలోకమునకు పంపిన విధమును,

ఇవేమిటి, ఇంకా, చాలా చాలా, ఎంత చెప్పినా, తరగనన్ని విషయములను,

అందమైన తాటాకుల గొడుగుతో, ఆకాశమంతా నిండిన విశ్వరూప తేజస్సుతో, ఆవరించిన ఆ స్వామి యొక్క చెడ్డ విషయములను,

లోకమంతా తెలిసేటట్లు ప్రచారము చేసెదను.

తిరుమంగై ఆళ్వారుడి దివ్య పాదములకు నమస్కారములు.

*******************

10. పురుషార్థములోని మోక్షము గురించి రచించిన పద్యాల అర్థ రూపము.

.....................

తిరుమంగై ఆళ్వారు రచించిన శిరియ తిరుమడల.

.......................

నీలి మబ్బులను తాకు, ఎత్తైన కొండలను కలిగిన భూదేవి,

నీలి సముద్రపు జలతారు చీరను, అందముగా సింగారించుకొని,

ప్రకాశవంతమైన సూర్యుడిని, నుదుటిన, ఎర్రని తిలకముగా దిద్దుకొని,

మహా మహా నదులను, మెడలో హారములుగా వేసుకొని,

నీరు నిండిన దట్టమైన మబ్బులను, కురులుగా దువ్వుకొని,

నక్షత్ర కాంతుల పువ్వులను, కొప్పులో ముడుచుకున్నది.

ఆకుపచ్చని తివాచీ రంగుతో మెరిసే, ఆ భూదేవి ఒడిలోని భూలోక వాసులు,

ఇక్కడ పురుషార్థములు అంటూ, చెప్పి, చేసేవి, మూడు.

అవి ఏమిటి, అని తెలుసుకోగా, ధర్మము, అర్థము, కామములు.

ఎవరెవరు, వీటిలోని కామమును పొందుతారో లేక,

ఉత్తమమైన ధర్మమును, అర్థమును పొందుతారో, ఈ భూమిపైన

వారి పూర్వ జన్మ సుకృత ఫలముగా, పొందు భాగ్యములు.

ఎవరైననూ పూర్తిగా నమ్మి, అది వున్నది, అని చెప్పునది

మోక్షము ఒక్కటే. అదియే బలమైన పురుషార్థము.

అందరూ చెప్పినది విని, అది ఎట్లుండును,

అని ఆలోచించక, నేను చెప్పెదను వినండి.

మేఘములతో నిండిన ఆకాశము నందు, ఏడు

గుర్రముల రథమును కలిగిన సూర్య మండలమును

చేధించుకుంటూ, అండ పిండ బ్రహ్మాండమును దాటినచో, అక్కడ

తృప్తితీరా, అమృతము వంటి పరమపద మోక్షమును పొందవచ్చును.

అతృప్తామృత పురుషార్థము అయిన ఆ పరమపద మోక్షమును పొందిన

తరువాత, అందమైన కుందేళ్లను వదిలి, కాకిని పట్టుకొనుటకు,  రాలేము కదా.

సుందర సుకుమారమైన యువతుల్లారా/ వినండి,

నాకు జరిగిన అనుభవమును తెలిపెదను.

నల్లని కురులను దువ్వి, పూలను సిగలో ముడిచి,

అందమైన చీరను కట్టి, మణుల వడ్డాణమును పెట్టి,

అందమైన పదునైన ఈటెవంటి నా కలువ కన్నులకు, కాటుకను

సింగారించి, అందమైన ఒక బంతితో ఆటలాడుకుంటున్నాను.

నీటితో నిండిన చెరువులోని కమలముల వంటి ఎర్రని కన్నుల

అపరిచితుడొకడు, విశాలమైన వీధిలోని ప్రజలు సంతోషించునట్లు,

కుండలు రెండు తలపై పెట్టుకొని, మద్దెలు వాయిస్తూ,

లయబద్ధముగా, కుంభనృత్య మాడుచుండెను.

అందమైన నా తోటి చెలికత్తెలు పిలవగా,

నేను ఆ నృత్యమును చూచుటకు వెళ్లితిని.

ఆ నాట్యమును చూసిన మైకములో, తరువాత నుంచి,

కుదురుగా నేను,  ఏమి చూడలేకపోతున్నాను.

ఎవరు ఏమి చెప్పినా, వినలేకపోతున్నాను.

బుద్ధి నశించి, నా మతి భ్రమించినది.

అందమైన చిలుక పలుకుల నా తల్లి, నాకు

దిష్టి తీసి, శ్రీపాద ధూళితో రక్ష పెట్టినది.

పర్వత ప్రాంత వనమూలికలను తాయెత్తుగా కట్టి,

తులసిమాలలను ధరించు దేవుడికి నమస్కరించినది.

అయిన తీరలేదు, నా మనోవ్యథ,

తీ ర లే దు, నా భ్రాంతి.

రాలేదు,  నా పూర్వ రూపము.

ఉలుకు పలుకు లేని నన్ను చూసి,

ఎందరో చెప్పిరి, వేరు వేరు చికిత్సలు.

చేసిరి,  కాని  ఉపయోగపడలేదు.

అ సమయమున వచ్చెను, నల్లని కొప్పుల ఎరుకలసాని.

దేవతలను ఆవాహన చేసుకొని, చాటలోని వడ్లను చల్లెను.

బక్క చిక్కిన నా శరీరము చమట పట్టి,

రోమాంచితమవ్వగా, నా చేతులను వాసన చూసి,

చెప్పినది, వేయినామములవాడు, అని,

చూపినది నా చేతిపై, నల్లని దివ్య శరీరము వాడిని.

ఆయన కుడి చేతిలోన శంఖమున్నది,

మెడలోన తులసిమాల వున్నది, అని చెప్పినది.

మీరేమి భయపడకండి,

మీ పిల్లను ఈ స్థితికి తెచ్చిన వాడు

ఎవరో కాదు, వాడిని నేను ఎరిగితిని.

లేడి కన్నుల సుందరాంగులారా/ మీకు తెలియ చెప్పెదను.

ఎవనిచే ఈ భూమి కొలవబడినదో,

ఎవనిచే లంక బూడిదై, నాశనమైనదో,

ఎవనిచే గోవర్ధనగిరితో, రాళ్లవాన ఆపబడినదో,

ఎవనిచే ఆ సముద్రజలము చిలకబడినదో,

వాడేనమ్మా, మీ బిడ్డను ఈ స్థితికి తెచ్చినది.

ఊరిలోని ఆలమందను కాచి,

నోటిలో లోకములను చూపినవాడు,

పరపూర్ణమైన పట్టువస్త్రములను, ఆభరణములను ధరించి,

వ్రేపల్లెలో అల్లరి పిల్లవాడిగా తిరుగు,  దివ్య పాదములు కలవాడు.

ఎర్రటి అథరములు కలిగి, అందమైన చీరను కట్టిన

సుందరాంగి, యశోదాదేవి కవ్వమును గట్టిగా పట్టుకొని,

తన అందమైన నడుమును వయ్యారముగా తిప్పుతూ,

కమ్మటి పెరుగును చిలికి, వెన్నముద్దను చేసి,

చెమట నిండిన చంద్రబింబము వంటి

తన ముఖమును తుడుచుకొని,

వెన్నముద్దను తోసి, వేరొక గిన్నెలో వుంచి,

త్రాడుతో కట్టిన ఉట్టిలో, భద్రముగా పెట్టి,

లేడికన్నుల యశోద బయటకు పోవు వరకు ఆగి,

దొంగనిద్రను నటించిన చిన్నికృష్ణుడు లేచి,

ఉట్టిలోని గిన్నె లోపలి వరకు చెయ్యి పెట్టి,

ఉట్టిలోని వెన్ననంతా తిని, దానితో తృప్తి పడక,

పక్కన వున్న ఇరుగు పొరుగు ఇళ్లకు వెళ్లి, నిండుగా

వున్న పెరుగు కొండలను దొర్లించి, పగలగొట్టి,

పడుకున్న చోటకే వచ్చి, ఏమి

ఎరుగని వాడి వలె పడుకొని వుండగా,

పెద్దలు మీరు, ఇది తప్పు, అని చెప్పుట

మరచి, మా ఇంటికి ఇలా పంపుతారా, అని

కడుపు బాదుకుంటూ వచ్చిన ఇరుగు పొరుగు

వారిని సముదాయించి, పంపిన యశోద,

ఇంటిలోన తానుంచిన వెన్నను తిన్నదే కాకుండా,

ఎదుటి వారి ఇంటిలోనికి దొంగతనానికి వెళతావా,

అని కోపించిన యశోద, ఊరివారందరూ

చూస్తుండగా, గట్టి త్రాడుతో రోటికి కట్టగా,

అయిననూ, అల్లరి మానక, నీరు నిండిన

పెద్ద చెరువు వద్దకు వెళ్లి, అందులో వున్న

క్రూరమైన పడగల కాళీయుడిని,

దమ్ముంటే నాకు ఎదురుగా రమ్మని,

తరంగములతో నిండిన నీటిలోనికి దూకి,

కాళీయుడి పడగలపై నాట్యమాడిన,

వాడేనమ్మా, మీ బిడ్డను ఈ స్థితికి తెచ్చినది.

సీతకన్నా నేను చాలా అందమైన దానను,

నన్ను చేపట్టు, అని వచ్చిన రాక్షసి, శూర్పణఖ

ముక్కు చెవులను కోసి, దానికి సహాయముగా వచ్చిన

అన్న ఖరుడిని, క్రూరనరకమునకు పంపిన వాడు,

కెంపుల వంటి చెక్కిలి గల సీత కారణముగా,

విశాల బాహుభుజుడు అయిన అందమైన

ఆభరణ కిరీటములతో నిండిన రావణుడి పది తలలను

నరికి, చంపి, సంతోషించిన ఎర్రని కన్నుల శ్రీరాముడు,

వాడేనమ్మా, మీ బిడ్డను ఈ స్థితికి తెచ్చినది.

యుద్ధమే ధ్యేయముగా,  కలిగిన హిరణ్యుడి

శరీరమును,తన పదునైన, దట్టమైన గోళ్లతో చీల్చి,

ఆ రాక్షసుడి ప్రేగులను,  మాలగా చేసుకొని,

లక్ష్మీదేవికి నిలయమైన తన గుండెలపై వేసుకొని,

నెత్తురు కారుతూ, పడివున్న హిరణ్య కశ్యపుడిని,

భుజములపై ధరించిన బొబ్బిలి వంటి నరసిం హుడు

వాడేనమ్మా, మీ బిడ్డను ఈ స్థితికి తెచ్చినది.

పొట్టి వామనుడై, మూడడుగుల భూమిని

ఇమ్మా, అని బలిచక్రవర్తిని యాచించి,

కపటముతో, నీటిని దానముగా గ్రహించి,

లోకములన్నిటిని కొలిచినవాడు,

తులసి మాలలను ధరించిన తన విశాల వక్షముపై,

మబ్బులు కమ్మిన మందర పర్వతమును పెట్టుకొని,

కూర్మరూపుడై, పాము వాసుకిని త్రాడుగా చేసుకొని,

దేవదానవులు క్షీరసాగరమును అమృతమునకై చిలికెను.

సరస్సున మొసలి పట్టిన ఏనుగు,

పోరాడి అలసినదై, నీటిలో విచ్చిన

తామరపువ్వును పీకి, తొండముతో పట్టుకొని,

దిక్కులు పిక్కటిల్లునట్లు, గట్టిగా అరచుచూ,

నారాయణా, ఓ మణివర్ణా, శేషశాయీ, రా,

నా అమితమైన దుఃఖమును పోగొట్టు,

అని అరచుచుండగా, మొసలిని రెండు ముక్కలుగా

చీల్చి, ఏనుగు దుఃఖమును తీర్చిన స్వామి,

వాడేనమ్మా, మీ బిడ్డను ఈ స్థితికి తెచ్చినది.

గాలి, ధూళీ, వేరెవరో కాదమ్మా.

సాక్షాత్తు, ఆ వేయి నామముల వాడేనమ్మా,

తెలివి కలిగి అర్థం చేసుకోండి, అని చెప్పి వెళ్లినది.

అప్పుడు మా అమ్మ, మేము ఆ స్వామి భక్తులమే కదా, పరిమళ

తులసిమాలలను ఎల్లప్పుడూ సమర్పిస్తూనే వున్నాము కదా, అని అనుకున్నది.

నేను,  ఆ శ్యామల వర్ణ దివ్య శరీరమును చూడదలచి,

మతి భ్రమించి, తిరుగుతున్నాను, అని నాకు తెలిసినది.

నా,  ఈ శరీరమున చల్ల గాలి వలె ప్రవేశించి,

ఏ విధముగా నన్ను మభ్య పెట్టెనో, నాకు తెలియకున్నది.

నల్లని సముద్రవర్ణుడిని వెంబడించిన నా మనస్సు,

తిరిగి నా వద్దకు రాక, నన్ను మరచినది.

నా మనస్సు, నన్ను కాదని వదిలిపెట్టినా, నేను వదలక,

ఇటు రా, నా మంచి మనసా, నీవు అంటే నాకు చాలా ఇష్టము,

సుందర తులసిమాలలను ఆ మణివర్ణుడికి ఇచ్చెదము,

అని పిలిచి, పిలిచి అలసితిని. అయినా అది రాకున్నది.

నా వారు నాకు సహకరించుట లేదు.

ఊరివారు నన్ను చూసి, నవ్వుచున్నారు.

పిచ్చిదాని వలె ప్రవర్తించకు, అని అనే

ప్రజల మాటలను పట్టించుకోని,  దానిని అయితిని.

రాత్రివేళల ఊరంతా నిద్రించిననూ,

నా విశాలమైన కన్నులు నిద్రించవు.

అగ్ని వద్ద మైనపు ముద్ద వలె,

ఆ ఉత్తముడికై నా ఆత్మ,  నీరై కరుగుతున్నది.

లోతైన సముద్రమంత కోరికలు కలిగిన ఈ లోకులు,

ఎవరు ఏమి చేస్తారా, తప్పు పడదామా, అని చూస్తారు.

నా విషయమును పక్కన పెట్టి, అలోచించి చూడగా,

అందరూ చాలా మంచిది, అని చెప్పే వాసవదత్త,

తన చెలికత్తెల నందరిని వదిలిపెట్టి, పెద్ద వీధిలోని

బాహు భుజముల వత్సరాయుడిలోన కలిసిపోయెనే.

ఊరివారు ఏమి చేయ గలిగారు.

మరి నాకు నీతులు చెప్పుచున్నారు.

ఏది ఏమైనా, నేను ఆ నల్లని దివ్య శరీర

చాయ కలిగిన ఆ సర్వేశ్వరుడిని చూచు వరకు,

ఈ లోకమున, నా చుట్టూ వున్నవారు, నన్ను

తప్పు పడతారు, అని అలోచిస్తూ,  కూర్చొను.

ఎవరు, ఎన్ని విధముల నన్ను తప్పు పట్టినా సరే,

ఆ నల్లనివాడు, నీలమేఘశ్యాముడు ఎక్కడ వున్నాడా, అని

మహిమ గల వేంకటాద్రిపై నున్న తిరుపతి, తిరుక్కోవలూరు,

గుడి గోపుర ప్రాకారములు కలిగిన కంచి, తిరువూరకము,

అప్పకుడుత్తాన్, మద్దిచెట్లను విరిచిన

చిన్నికృష్ణుడు కొలువైన తిరువెళ్లరై, తిరువెహ్ కా,

చాలా గొప్ప నగరములైన తిరువాలి, తిరుత్తంగాళ్,

తిరునరైయూరు, తిరుప్పులియూరు,

అందమైన కావేరీ నీటితో, పూల తోటలతో

నిండిన శ్రీరంగము, తిరుక్కణ్ణమంగాపురము,

నల్లని కృష్ణుడు కొలుపైన విణ్ణగరము,

అందమైన తిరుక్కణ్ణపురము, తిరుచ్చేరై,

తిరువజుందూరు, నిండు నీటితో చుట్టిన క్కుడంద్రై,

క్కడిక, కడల్ మలై, పూలతోటల తిరువిడవింద్రై,

తిరునీర్మలై, మహిమ నిండిన తిరుమాలిరుంశోలై,

తిరుమోకూరు, మానవులందరూ వైకుంఠమని పిలిచే బదరి,

ఉత్తర మధుర మొదలగు ఊరులన్నిటిలోను

ఊరేగుతూ, వీధి వీధి తిరుగుతూ,

మధురా నగరములో ఏనుగు దంతమును విరిచిన స్వామి,

మొసలి నోటి నుంచి, అసహాయ గజేంద్రుడిని రక్షించిన స్వామి,

అసంఖ్యాయమాన పరిపూర్ణ కళ్యాణ గుణములు కలిగిన మహిమాన్వితుడు,

తామరపువ్వుల వంటి కన్నులు కలిగి, తులసి మాలలను ధరించువాడు,

ఎక్కడ వున్నాడా, అని నలువైపులా వెతుకుతూ,

ఎవరు నన్ను తిట్టినా పట్టించుకోక,

ఆ శ్రీమన్నారాయణుడి వేయి పేర్లను కీరిస్తూ, తిరిగెదను.

తిరుమంగై ఆళ్వారుడి దివ్య పాదములకు నమస్కారములు.

*********************